శ్రీ ర స్తు.

# ద శ కు మా ర చ రి త్ర ము

కే త న క వి కృ త ము.







చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్ర క టి త ము.

1925.

# తొలి పలుకు.

దశకుమారచరిత్రము తెనింగించిన కవి కేతన. ఇతఁడు కౌండిన్యసగోత్రుఁడు. భండారుకేతన బావమఱఁది. మ్రానయ (మారయ) సంకమాంబల కుమారుఁడు. ఇంటిపేరు మూలఘటిక వారు. అభినవదండి బిరుదాంకితుఁడు. ఈకవి తనశక్తిసామర్థ్యముల నిటులఁ జెప్పుకొనినాఁడు:—

☛. కవితఁ జెప్పి యుభయకవిమిత్రు మెప్పింప, నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ బరగ దశకుమారచరితంబుఁ జెప్పిన, ప్రోడ నన్ను వేఱె పొగడ నేల.

దశకుమారచరిత్రము ఉభయకవిమిత్రుఁడును భారతరచనాధురీణుఁడు నగు తిక్కనసోమయాజి కంకితము గావింపఁబడినది. తిక్కనయంతవాఁడు మెచ్చిన నాకవితయొక్క గొప్పదనము నేను జెప్పుకొనుట పునరుక్తియని కవి చెప్పుచున్నాఁడు. కేతనకవిత రసవంతముగ నిర్దుష్టముగ ధారాశోభితముగ నుండి చదువఁజదువఁ జవులూరుచుండును. ఈకేతనకవి వెంగిదేశమునందలి * వెంటిరాలను నగ్రహారమున కధిపతి.

ఆంధ్రభాషలోఁ గవు లంకితమునొందిన పుస్తకములలో దశకుమారచరితము మొట్టమొదటిది. ఇందుఁ గవిరాజగు తిక్కనసోమయాజి గుణగణములు దాతృతాసౌందర్యములు విద్యావివేకములు పండితానురక్తి విపులముగఁ గొండాడఁబడినవి. తాను కవియై కవుల నింతగ గౌరవించినవాఁడు తిక్కనగాక వేఱొకండు ఆంధ్రవాఙ్మయమునఁ గానరాఁడు. కాని కేతన తిక్కనసోమయాజి నుభయభాషాకవి యనియు, మయూరసన్నిభమహాకవి యనియుఁ గవిజనరాజకీరసహకారమనియుఁ బేర్కొనెనెగాని ఉత్తరరామాయణాదిగ్రంథములు రచించినటులఁ జెప్పలేదు. దిక్కనసోమయాజి యప్పటికి గ్రంథరచనము గావిం

---

* పూర్వముద్రితప్రతిలో వెల్టిరా లని యున్నది.

పలేదేమో యన వీలులేదు. ఏలయన దశకుమారచరిత్రమునఁ దిక్కన యజ్ఞముగావించినటుల షష్ఠ్యంతములందు ఆశ్వాసాంతములందుఁ గృత్యాదిని జెప్పఁబడినది. ఉత్తరరామాయణము యజ్ఞమునకుఁ బూర్వము రచింపఁబడినపొత్తమని గ్రంథమందలి గద్య కృత్యాది తెలుపుచు. ఇట్టియెడఁ గేతన దిక్కనసోమయాజిరచితగ్రంథములఁ బేర్కొననికిఁ గారణము తోఁచదు. భారతము దశకుమారచరిత్రము గైకొనునప్పటికి రచింపఁబడలేదేమొ గాని నిర్వచనోత్తరరామాయణము మాత్ర మప్పటికి రచియింపఁబడె ననుట కెట్టిసంశయ ముండదు.

''కృతులు రచియింప సుకవుల
కృతు లొప్పఁ గొనంగ నొరులకిం దీరునె
... ... తిక్కఁడొకండు దక్కన్.

సీ. లలితవాచావాక్యములఁ జెప్ప నుభయభా
షలయందు ననుట ప్రశంసత్రోప.

క. అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్ర నామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కఁడు దాల్చెన్.

అను దశకుమారచరిత్రములోని పద్యములవలన తిక్కన కవులబహూకరించి కృతులఁ గొనె నని వివిధగ్రంథములు రచియించె నని, మనుమసిద్ధి యాస్థానమునఁ గవియు మంత్రియునై యుండె నని యుభయకవిమిత్రుఁ డనుబిరుదము దాల్చె నని తెలియును. ఉభయకవిమిత్రబిరుదము భారతరచనమునుండి సుప్రసిద్ధముగఁ దిక్కన వాడుకొనుటచే భారతరచనాకాలమునఁ దిక్కనకృతి తీసికొనెనేమో యని తోఁచెడిని. దశకుమారచరిత్రకృత్యాదివలనఁ దిక్కనసోమయాజి ప్రతిభ రాజనీతి త్యాగగుణము కార్యదక్షత వివిధవిద్యానైపుణ్యము

స్పష్టముగఁ దెలియును. తిక్కనసోమయాజియంతవానికిఁ గృతి నిచ్చుట కేతనప్రతిభకు దృష్టాంతము.

* కేతన దశకుమారచరిత్రము విజ్ఞానేశ్వరీయము ఆంధ్రభాషాభూషణము అను మూఁడుపుస్తకములు రచించెను. విజ్ఞానేశ్వరీయము యాజ్ఞవల్క్యధర్మశాస్త్రమునకుఁ దెలుఁగుపద్యకావ్యము. ఆంధ్రభాషాభూషణము తెలుఁగుబాసలోఁ దొలుత వ్రాయఁబడినవ్యాకరణము. దశకుమారచరిత్రము దండికృతమగు సంస్కృతగద్యకావ్యమునకుఁ దెలుఁగుసేత.

దశకుమారచరిత్రము మూలగ్రంథమునందలి కథలు వర్ణనాంశములలో నించుక తగ్గించి రసోచితములగు కథాభాగములలో నించుక పెంచి వ్రాయఁబడెను. చాలవఱ కిందలిభావములు మూలగ్రంథములోనివె. పంద్రెండవ యాశ్వాసములో మాత్రము కథ మూలముతోఁ బెక్కుచోటుల భిన్నముగా నున్నది. ఉత్తరపీఠిక దండికృతము కాదని కాఁబోలు నిందు విడిచి పెట్టఁబడినది. అపహారవర్మకథలోని బోగముదానికథ మూలగ్రంథముకంటె నిందుఁ దగ్గింపఁబడినది. నిదురించుసుందరి యాకృతియును దెలుఁగున సంక్షేపింపఁబడినది. ఇటులె వర్ణనాంశములలోఁ గేతన చాల సంక్షేపించెను. విశ్రుతునిచరితములోని రాజనీతులు మాత్ర మీతెలిఁగింపులో విరళము గలవు. మిగిలినచోటులఁ గథాభిరుచి కడ్డుపడువర్ణనములు లేక గ్రంథమంతయుఁ గథావస్తువునకె ప్రాధాన్య మీయఁబడి మనోహరముగ నున్నది.

---

* ఈకేతన కాదంబరి పద్యకావ్యము చేసెనని కొందఱందురు. ప్రబంధరత్నాకరమున కాదంబరి రచించినది మూనయకేతన యని కలదు గాన నతఁ డింకొకఁడు.

కేతనకవి దండ్యాచార్యునిభావములు పెక్కుచోటుల యథారూపముగఁ గొంచెము మార్పుగ నిమిడ్చియున్నాఁడు. చూచుట కవి స్వతంత్రభావములవలెఁ దోఁచును.

"భవదంసోపనీతం యజ్ఞోపవీతం భూసురభావం ద్యోతయతి. హేతిహతిభిః కిరాతరీతి రనుమీయతే. కథయ కి మేత దితి."

క. జందెముల బ్రాహ్మణత్వము, చందంబున బోయతనము శస్త్రహతిఁ బో
ల్పొందఁగ రాచఱికము సీ, యందొక్కట దోఁచుచున్నయది తలపోయన్

ఈపద్యమునందు క్షత్త్రియత్వము క్రొత్తగఁ జేర్పఁబడినది. మాతృకకంటె భావమీ తెలుఁగుచేతలో బాగుగనున్నది.

"తత్ర హేతిహతికిణాంకం కాలాయసకర్కశకాయం యజ్ఞోపవీతేనానుమేయవిప్రభావం వ్యక్తకిరాతప్రభావం లోచనపరుషం కమపి పురుషం దదర్శ."

సీ. నిధిసాధనక్రియానిమ్నోన్నతంబైన ప్రాంతపట్టణమునఁ బాడువోలెఁ
(గాలాయసముననంగములు గావించినఁ బ్రాణంబు వచ్చిన ప్రతిమవోలెఁ)
దొండంబు కొమ్ములు దునియ వ్రేటులు వడి కొదపడ్డ యేనుఁగుకొదమవోలె
డాంబికవిప్రవిడంబనం బొనరింపఁ బూనిన యొఱపిఁడిబోయవోలె

తే. (మేన బోటుగం ట్లొంతయు మిక్కుటముగ)
నల్లనై తుండుపడి(బ్రాహ్మణత్వమునకుఁ
దాపలంబైన వెడజన్ని దములు దాల్చి)
యున్న యొక్కని గాంచె నమ్మన్నెకాఁడు.

ఇందుఁ గుండలీకృతభాగములుమాత్రము మూలానుసారములు. మిగిలిన వన్నియు స్వతంత్రములె.

"పశ్చాన్నిషీదతోఽస్య బాహుదండయుగళ ముభయకరమూలప్రవేశిత మగ్రే ఽవలంబ్య స్వ మంగ మాలింగయామాస స్వయం చ పృష్ఠతో వలితాభ్యాం పర్యవేష్టయత్."

"చెలిఁ గౌఁగిలించెఁ దనకేలు పిఱిందికిఁ జాఁచి వేడుకన్."

క. అతనికరంబులు కక్షద్వితయంబున నిగుడఁ దిగిచి వికసితముఖుఁ డై

పతి యన్యోన్యాలింగన,వితతసుఖం బనుభవించె....

ఇందుఁ గౌఁగిలింతలు చాలవఱకు మూలానుగుణముగ నున్నను మిగుల స్పష్టముగ సుబోధములుగ నున్న వనుట సత్యము.

''వత్స! మాధ వీవ పిచుమందాశ్లేషిణీ యథాఽసౌ శోచ్య మాత్మానం. మన్యతే త థోపపాద్య స్థాపితా.''

క. గురువెంద వేము నడరిన,పరుసున నవ్వికటవర్ష్మ పాల్పడి చెన్నుం
బొరయక మెలఁతుక యెప్పుడు,విరసాంతఃకరణ యగుచు వేదనఁబొందుఙ్.

ఇందుఁ దెలుఁగుసేతలో నుపమానముమాత్రము దీసి కొని కథాంశముతోఁ గేతన నిమిడించియున్నాఁడు. ఇటులె పరిశీలింతుమేని కేతన దండికవిభావములను రసోచితముగ మృదుమనోహరశైలిలోఁ దెలిఁగించినతావులు పెక్కులు గనిపెట్ట వచ్చును.

కేతనస్వతంత్రముగ వ్రాసినపద్యములలోఁ బెక్కులు మనోహరముగ నున్నవి. ఇతనికవితలో నన్వయకాఠిన్యము లేదు. సమాసజటిలత్వముండదు. నిసర్గసిద్ధమగు ధారాశుద్ధియు మృదుకల్పనము వెల్లివిరియు చుండును. ఇతనికవిత తిక్కనకవితయంత ప్రౌఢము కాకపోయినను దిక్కనవంటి విద్వత్కవి యానందింపఁదగినదిగ నున్న దనుటకు సంశయము లేదు. కేతనకవిత నిర్దుష్టముగ నుండును. ఇతఁడు తెలుఁగున వ్యాకరణము వ్రాసినవాఁడగుటచే నితనిలక్షణగ్రంథమునకీ దశకుమారచరిత్రము లక్ష్యగ్రంథ మని చెప్పవచ్చును గాని కొలఁది స్ఖాలిత్యము లిందును గానవచ్చుచున్నవి. ప్రత్యంతరసహాయమునఁ బరిశోధించిన నిర్దుష్టస్వరూపములు లభించునేమొ. అంతవఱకుఁ బ్రమాదపతితములుగ భావించుట యీమహాకవిప్రతిభకు లోపము కాఁజాలదు.

## ల - డలకు యతి.

ఉర్విజగాత్రముల్ కడువడంక (అష్టా. ప. 59.)

## యతిలోపించుట.

మగపంతంబును వక్కినక్ జనము లే మంత్రీ (ద్వాద. ప. 50)

## అపశబ్దములు.

ఉ. సుందరకుండు నేనును నసూయతనంబున (పంచమాశ్వాసము. ప. 45.)

ఉ. సౌమ్యుడి యెంత యెంతయును జోద్యతరంబుగ (పంచమా. ప. 62.)

ఇంతకు మిగిలి దోషము లీగ్రంథమునఁ గానరావు.

ప్రస్థానమున తృతీయాస్థానము 59 పద్యములో, ఉజ్జయినికి ఉజ్జేని యనురూపము గానవచ్చుచున్నది. ఇది వ్యావహారికభాషారూపమో యని మా భ్రాంతి. ఇంతగొప్పగ్రంథములో నీస్వల్పలోపములు గణనీయములు కావు. ఆంధ్రభాషలో నిపుడపురూపములుగ నున్న శబ్దములు పెక్కులు ఈగ్రంథమునఁ గలవు. ఇందుఁ జాలవఱకు నిఘంటుస్థములు కాలేదు. కేతన దేశీయములతోఁ గవితఁ జెప్పువాఁ డగుటచే నితనికవితలో దేశ్యశబ్దములు విచ్చలవిడిగ నున్నవి. వాఙ్మయశోధకుల కాశబ్దములు సహకారులు కాఁగలవు.

కేతన రసోచితముగఁ బద్యములు వ్రాయుటలో మిగుల నేర్పుగలవాఁడు. శృంగారరసమున నీకవి మిగుల మెలఁకువఁజూపును. స్త్రీవర్ణనమున నీకవి కచకుచాదివర్ణనముల కెడమీయఁడు. సంభోగశృంగారముఁగూడఁగొన్నితావులమనోహరముగ సభ్యముగ వ్రాసియున్నాఁడు. కేతన స్త్రీవర్ణనము మనోజ్ఞముగ నుండును. పోకడయుఁ జవిగొలుపుచుఁ గ్రొత్తతీరుతీయములతో బింకముగ నుండును. చూడుఁడు.

సీ. భానుజుపట్టంపుదేవి యై రూపున నడిసన్న రతివిలాసముల గెల్చి

(సప్తమా. ప. 111)

సీ. లక్ష్మీహస్తమునకు లాంఛనం బబ్జంబు హస్తంబ యబ్జ మీాయబ్జముఖికి
(దశమా. ప. 29)

క. అనిపలుకఁగ మృదునూపుర,నినదము రశనాకలాపనినదము వనితా
జనసరసవచనరచనా,నినదంబును నిండె వర్ణనీయం బగుచున్.(దశ.23.)

ఇటులె యితరవర్ణనములందును మనోహరములగుపద్యములు కలవు. కథాసందర్భములం దున్న భారములు చాలవఱకు మాతృకానుగుణములె గాని వర్ణనాంశములు మాత్రము కేతన ప్రతిభావిశేషమునకుఁ దార్కాణములగు స్వతంత్రపద్యములు. కేతన తేటతెలుఁగునఁ బద్యము వ్రాయుటయందెగాక సమాస పటుత్వముగ వ్రాయుటలోఁ గూడ గడుసరి.

తేటతెలుఁగు.

ఉ. ఇంచుకసేసి పెంపెఱుఁగఁ జెంతయు వేసుక నేను బుత్త్రుఁగాఁ
బెంచిన మావిమోకకడఁ బ్రీతి మదీయవయస్యయైన యి
క్కాంచనమాల నెలచెలిక త్తెలు నవ్వఁగ నంటఁబట్టె నా
పంచన కాలనై పడనిపాటుల నేఁ బడితిన్ దపస్వినీ."
(సప్తమా. ప. 71.)

సమాసపటుత్వమునకు.

మ. చటులస్యందనఘట్టనం దెరలి యశ్వప్రాతచంచత్ఖురో
ద్భటపాదాతపదాహతి స్నెగసి యుద్యద్వారణశ్రేణికా
కటనిష్యందిమదాంబువృష్టి నడఁగంగా భూరజశ్పుంజ ము
త్కటపరోద్ధతవృత్తి నొత్తి నడచెన్ దండెత్తి యుద్ధంబునన్.
(ఏకాదశ. ప. 119)

రసవంతములగు పద్యముల నిటులె నుదాహరింపఁబూని తిమేని గ్రంథములోని సగపాలు తోలిపలుకునఁ జేర్పవలసి వచ్చును. ఈగ్రంథమందలి దొంగతనము పట్టుబడుట కోడి పందెములు జూదము అభిసారికాత్వములు నరకయాతనలు

సూర్యోదయాదివర్ణనములు తరువాతికవులకుఁ జాలవఱకు కాదర్శ ములయ్యె ననుటలో సాహసము లేదు.

కేతన కభినవదండిబిరుదము దశకుమారచరిత్రరచనానంతరము పండితు లొసంగిన దనుట కాధారములుగలవు. ఆంధ్ర భాషాభూషణమున కేతన

"క. వివిధకళానిపుణుఁడ నభి, నవదండి యనంగ బుధజనంబులచేతన్
భువి పేరు గొనినవాఁడను."

అని వ్రాసికొనియున్నాఁడు. కాని దశకుమారచరిత్రములోఁ గూడ గద్యయందు అభినవదండియనుకొనుట యెటుల నొప్పును. గ్రంథరచనానంతరము వచ్చినబిరుదము గ్రంథమున నెటులఁ జేర్పఁబడె నని కొంద అందురు. కృతిశ్రవణానంతరము పండితులొసంగిన బిరుదమును గద్యమునందుఁ జేర్చికొనియుండు నని మాకుఁ దోఁచుచున్నది.

దశకుమారచరిత్రము సంస్కృతమున వ్రాసినది మహాకవి దండి. ఇతఁడు క్రీ. శ. ఏడవశతాబ్దము పూర్వార్ధమునం దుండెను. ఆకాలపుటాచారములగు పడవనడుపుటలు సముద్రయానము అనులోమవిలోమద్విజవివాహములు, సంకరబ్రాహ్మణులను గూర్చిన విశేషాంశము లిందుఁ గలవు. చరిత్రస్థలములగు కాళేశ్వరము రామతీర్థము కళింగనగరము ఆంధ్రనగరము ఇందుఁ జెర్కొనఁబడినవి. కళింగనగరము సముద్రతీరమందలి సుప్రసిద్ధమగు రేవుపట్టణము. ఇది యొకానొకకాలమున రాజధానిగ నుండెను. ఇందె పేర్కొనఁబడిన యాంధ్రనగరము వేంగి కావచ్చును. జయసింహుఁడు ఆంధ్రదేశమును పాలించిన చాళుక్యరాజన్యుఁడనియు నితఁడు క్రీ.శ. ౬౩౩ మొదల ౬౬౩ వఱకు రాజ్యము నేలినవాఁడై యుండు ననియు మాతలంపు.

 

అప్పటికళింగనగరము కళింగదేశమునకు రాజధాని యనియు దానిని కర్ణనుఁడు పాలించుచున్నాఁ డని తెలుపఁబడినది. పరిశోధనదృష్టితోఁ జూచితిమేని కళింగరాజులకుఁ జాళుక్యులకు జరిగినయుద్ధము దశకుమారచరిత్రములోని మంత్రగుప్తునికథవలన మనకుఁ దెలియఁగలదు.

కేతనకవి సుప్రసిద్ధుఁడు దిక్కనసోమయాజికాలమునాఁటివాఁడు గావున కవికాలనిరూపణమున నంతశ్రమపడవలసిన పని యుండదు. తిక్కనసోమయాజి మనుమసిద్ధియాస్థానమున నుంటవలనను మనుమసిద్ధి నెల్లూరురాజధానిగఁ జేసికొని ఆంధ్రదేశభాగమును గణపతిదేవునకు సామంతుఁడై పాలించియుంటవలనను సమకాలికుఁ డగు కేతనయు క్రీ. శ. ౧౨౦౦ మొదలు ౧౨౮౦ లోఁగ జీవించియుండును.

దశకుమారచరిత్రము 1901 లోఁ బ్రచురించిరి. ప్రతులచిరకాలమునఁ జెల్లిపోయెను. పలువురు కేతనకవితామృతముఁ జవిజూడ నెంచి నిరాశావశులు గావలసివచ్చినది. ఇట్టియుత్తమగ్రంథ మిప్పుడు ఆంధ్రసాహిత్య పరిషత్తులోని వ్రాఁతప్రతిని ఇదివఱలో ముద్రితమైన ప్రతిని నాధారముచేసికొని శ్రీమద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేఁ [illegible]బడి సారస్వత సేవకులును విద్యాభిరతులు న[illegible] వేంకటేశ్వరశాస్త్రిగారి సమాదరణమున [illegible]గ నిర్దుష్టముగఁ బాఠాంతరసమన్వితముగఁ [illegible] భాషాభిరతుల సుకృతహేతువె.

భ్రష్టభాగములఁ బూరించుటలో మాతృకాభావములు చాలవఱకు సమర్థింపఁబడినవి గాని

"క. తగునే నీవు పతివ్రత ... ... ...

... ... యఁగ నీచేతు లెట్టు." (దశమా. ప. 97.)

లోఁ గేతనమహాకవిమతమునకు వ్యతిరేకముగ అర్ధబిందుకనిర్బంధుకప్రాసము సమకూర్పఁబడినది. మఱియు సప్తమాశ్వాసాంతగద్యములలో

"భారతామ్నాయసేవాపరణ."

అని వ్రాయఁబడినది. కేతన తిక్కనసోమయాజి గ్రంథరచనము భారతరచనమును జెప్పనే లేదు. అట్టిచో భారతప్రశంస కవిమతమునకు విరుద్ధము.

సర్వాంగసుందరమగు నీదశకుమారచరిత్రము ఆంధ్రమహాజనాదరణపాత్ర మగునుగాక!

నందిగామ. 20-4-1925 } శేషాద్రిరమణకవులు. శతావధానులు.

N. B. చీకటి, ఏగు, పరగ, లోనగుశబ్దములలో నర్ధబిందువు ప్రాచీనగ్రంథానుసారముగ లేదు. ఇందే చీకటి నిర్బిందుకముగ 161, 234. పుటలలోఁ బ్రాసమందుఁగలదు. కావున నరసున్న ప్రమాదపతితము (పా) యని గుర్తుపెట్టఁబడినవి పాఠాంతరములు.

శ్రీరస్తు.

# దశకుమారచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

---

శ్రీరమణీగృహాంగణము చెన్నువహింప న*(లంకరింపఁ)గాఁ
దోరణముం బ్రదీపమునుదోహలినై యొడఁగూర్చె నాఁ
(వగం), (?) జేరి యురంబునందుఁ దులసీవనమాలయుఁ గౌస్తు
భంబు నో, ప్పారఁగ నుల్లసిల్లు హరి యన్నమతిక్కని ధన్యుఁ
జేయుతన్. 1

ఉ. హారికపర్దకాంచనమయాచలసానువునందు నిర్ఝర
స్ఫారవిలాసముం గలుగు జాహ్నవిఁ దాల్చిన శంకరుండు నీ
హారకరావతంసుఁ డణిమాదిగుణప్రదవీక్షణుండు ది
క్పూరితకీర్తిశాలి యగు కొమ్మయతిక్కనిఁగాచుఁగావుతన్. 2

ఉ. విప్రకులప్రధానుఁడు పవిత్రచరిత్రుఁ డుదాత్తవేదవి
ద్యాప్రతిపాలకుండు విబుధప్రకరాభిమతార్థసంవిధా
నప్రవణుండు సద్గుణసనాథుఁ డజుం డనిశంబు నాత్మసా
మ్యప్రతిపత్తిఁ దిక్కనిఁ జిరాయురధిష్ఠితకాయుఁ జేయుతన్.

క. మేదురతేజోరాజిత
రోదోవివరుండు కొట్టరువుతిక్కనికిన్
వేదత్రితయాత్మకునకు
నాదిత్యుం డొసఁగుఁగాత మభ్యుదయంబుల్. 4

---

N. B.—వ్రాఁతప్రతిలో లేనివానికెల్ల () కుండలీకరణము చేయఁబడినది.

ఉ. గ్రక్కున నేత్రయుగ్మము కరద్వితయంబున మూసి పట్టి యా
ఒక్కిలి కంటికిం దనదు మిక్కిలిహస్తము మాటుసేసి యిం
పెక్కుడుబాల (కేళిఁబరమేశ్వరుచి)త్తము పల్లవింపఁగా
దక్కక ముద్దునం బొలుచు దంతిముఖుం గొలుతుం బ్రస
న్నుఁగాన్. 5

చ. జనకుఁడు పంచవక్త్రుఁ డనిశంబును నెన్ని నప్రా(పుతోడఁబు
ట్టిన) గణనాథుఁ డింక నొకఁడే నను బోర జయించు నంచుఁ
బెం, పొనర నమర్త్యశాత్రవుల నోర్చి వెలింగెడు నామ
యూరవాహనుఁడు మయూరసన్నిభమహాకవిఁ దిక్కనిఁ
గాచుఁగావుతన్. 6

మ. తనదుర్వారతరప్రతాపమునఁ జిత్తస్నేహముల్ గట్టి సే
యునితం బెట్టి విదగ్ధుఁడో తలఁప నోహో యంచు లో
కంబు గో, సనపుచ్ఛం గరమొప్పు దర్పకుఁడు రాజత్సుంద
రాకారు శో, ఘనసంపన్నుఁ గృతీశ్వరుం బ్రచురసౌభాగ్యా
న్వితుం జేయుతన్. 7

చ. అవయవసంపద(ంగలిగి)యారయ నింద్రియగోచరత్వముం
దవులమి శక్తితత్త్వ(మును ద)త్త్వముఁ దానె యనంగ
నొప్పుభై, రవి జగదేకమాత ప్రచురస్థితి శక్తిసమగ్రుఁ జే
యుతం, గవిజనరాజకీరసహకారముఁ గొట్టరు మంత్రి తిక్క
నిన్. 8

క. వాక్తా(మ్రపర్ణి)కవితా
మౌక్తిక(మణితార)హారమండనులగు త
త్ప్రాక్తనసుకవుల నియమా
త్యక్తుల వాల్మీకికాళిదాసులఁ గొల్తున్. 9

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిచరణాభివందనంబు
నుం జేసి నారచియింపం బూనిన కృతి కధీశ్వరుండైన కొట్ట
రువు తిక్కనామాత్యునకు నిజస్థానంబగు విక్రమసింహ
పురంబు వర్ణించెద. 10

సీ. కరిఘటానిలయంబు తురగజన్మస్థలి
సుభటనివాసంబు సుకృతకర్మ
కర్మఠద్విజగణాకరము రాజన్యసం
ఘావాస మర్యవర్యాశ్రమంబు
కర్షకాగారంబు కవిబుధసదనంబు
సుందరీశృంగారమందిరంబు
ధనధాన్యసంగ్రహస్థానంబు ధర్మద
యాచారవిద్యావిహారభూమి

తే. తైలఘృతలవణాదిసద్ద్రవ్యపాల
మమలబహువిధరత్నరత్నాకరంబు
మధురజలపూరకాసారమండలంబు
నాఁగ విక్రమసింహాఖ్యనగర మొప్పు. 11

వ. అట్టి విక్రమసింహనగరంబున కధీశ్వరుండును రాజవేశ్యా
భుజంగనామాంకితుండును నైన మనుమసిద్ధిమహీవల్లభు
వంశావళివర్ణనం బెట్టి దనిన. 12

క. సవితృకులంబున మును రా
ఘవకరికాళాదినృపనికాయముపిదపన్
బ్రవిమలయశోవిరాజిత
భువనుండగు మనుమసిద్ధి భూపతి పుట్టెన్. 13

ఉ. శ్రీవిభుఁడైన యామనుమసిద్ధికిఁ బుణ్యచరిత్రయైన శ్రీ
దేవికిఁ బుట్టెఁ దిక్కజగతీతలనాథుఁ డశేషలోకసం
భావితుఁడై ధరాభరము వాపఁగ నానసుదేవదేవకీ
దేవుల కుద్భవించి వినుతిం జెలువొందినకృష్ణుఁడో యనన్.

వ. ఇట్లుదయించి రాజ్యాభిషిక్తుండైన యనంతరంబ. 15

సీ. బలిమిచేఁ (బృథ్వీశుతలఁ ద్రుంచె) [1]సేవణ
కటకసామంతుల గర్వ మణఁచె
ద్రవిళమండలికు లందఱుఁ దక్క నేలెఁ జో
డని నిజరాజ్యపీఠమున నిలిపెఁ
గర్ణాటవిభునహంకారంబు మాన్పించెఁ
బాండ్యునిచేతఁ గప్పంబు గొనియె
నేలువమన్నీల [2]నెఱి పుట్టఁగా నేలె
వైరివీరుల నామ లూర నొర్చె

తే. [3]త్రిభువనీరాయ వెండాఱుఁ శుభయకటక
వీరుఁ డభినవభోజుఁ డాకారమదనుఁ
డవనిభారధౌరేయమహత్త్వవిజిత
దిక్కరీంద్రుండు చోడలతిక్కనృపతి. 16

క. మరునకు ననిరుద్ధుఁడు శ్రీ
వరునకు మకరధ్వజుండు వసుదేవునకున్
హరి పుట్టినక్రియ నతనికిఁ
జిరతరకీర్తిత్తుఁడు మనుమసిద్ధి జనించెన్. 17

వ అతనిగుణవిశేషంబు లెట్టి వనిన. 18

---

1 శ్రీవీరేశలింగముపంతులుగారి ప్రతిలో నీపదము కనఁబడదు. 2 నిచట విరుద్ధముగా నున్నది. 3. ఇట విరుద్ధముగాఁ గనఁబట్టుచున్నది.

సీ. వీరారివర్గవిదారణక్రీడ న
ద్యతనజగత్ప్రాణసుతుఁ డనంగఁ
బరధనదారాపహరణానభిజ్ఞత
నూతనగంగాతనూజుఁ డనంగ
నర్థార్థిజనవాంఛితార్థసంపూర్ణవి
తీర్ణిమై నభినవకర్ణుఁ డనంగఁ
గామినీచిత్తాపకర్ష కారణశుభా
కారసంపద వింతకంతుఁ డనంగ
ఆ. ధీరతాగుణమున మేరుమహీధర
మన గభీరవృత్తి నబ్ధి యనంగఁ
వెలసె వైరిరాజవేశ్యాభుజంగాంక
భూషితుండు సిద్ధిభూవిభుండు. 19

వ. ఇట్లు కీర్తిపాత్రంబైన మనుమసిద్ధిమహీవల్లభునకుఁ గరుణా
రసపాత్రంబైన కొట్టరువుతిక్కనామాత్యుండు నిజకుల
క్రమాగతంబగు మంత్రిపదవియందు వర్తిల్లుచు. 20

ఆ. అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలిశంఖములును
గంబగట్లు భూమి కానికగాఁగఁ బెం
పెసఁగు రాచపదవు లెల్లఁ బడసె. 21

వ. ఇట్లు పడసి సమస్తసంపత్సమేతుం డై రాజ్యసుఖంబు లను
భవింపుచు నొక్కనాఁడు విద్వద్గరిష్ఠగోష్ఠీసమయంబునం
గావ్యదర్పణప్రతిబింబితమూర్తులైన మహాపురుషుల సద్వ
ర్తనంబులు విని పరమానందంబు నొంది కృతిపతిత్వంబు
కృతకృత్యభావంబుగా విచారించి. 22

ఉ. ధీనిధి భాస్కరార్యునకు ధీరగుణాన్వితకొమ్మమాంబకున్
మానవకోటిలోపల సమస్తగుణమ్ముల వాఁడు పెద్ద నా
వానికి వాఁడు పెద్ద యన వానికి వానికి వాఁడు పెద్ద నా
వానికి వార లిద్దఱకు వాఁ డధికుం డనఁ బుట్టి రాత్మజుల్.

సీ. వివిధవిద్యాకేళిభవనభావంబున
జలజజుముఖచతుష్టయముఁ బోలి
విబుధవిప్రతిపత్తివిదళనక్రీడమై
జలశాయిభుజచతుష్టయముఁ బోలి
ధర్మమార్గక్రియాదర్శకత్వంబున
సన్నుతాగమచతుష్టయముఁ బోలి
పృథుతరప్రథితగాంభీర్యగుణంబున
శంబరాకరచతుష్టయముఁ బోలి

ఆ. సుతచతుష్టయంబు నుతి కెక్కె గుణనిధి
కేతనయును బారిజాతనిభుఁడు
మల్లనయును మంత్రిమణి సిద్ధనయు రూప
కుసుమమార్గణుండు గొమ్మనయును. 34

వ. అం దగ్రనందనుండు. 35

చ. కవితకు ముఖ్యుఁ డీతఁ డనఁ గామితవస్తువు లిచ్చువాఁడు నా
నవరసభావకుం డితఁ డనన్ బురుషార్థపరాయణుండు నా
నవు నన రాజనీతివిషయజ్ఞుఁ డితం డనఁ గీర్తిచంద్రికా
ధవళితదిక్కుఁడై నెగడె ధన్యుఁడు కేతనమంత్రి యిమ్మహిన్.

ఉ. మానిని బ్రహ్మమాంబకు నమాత్యశిఖామణి కేతశౌరికిన్
భూనుతకీర్తి భాస్కరుఁడు పుణ్యచరిత్రుఁడు మంత్రి

గుండఁడుఁ, ధీనిధి నల్లసిద్ధియు నతిస్థిరచిత్తులు ధర్మతత్పరు
ల్మానవనాథపూజ్యులు క్రమంబునఁ బుట్టిరి కీర్తనీయు లై.

వ. అం దగ్రజుండు. 38

క. నీతి సురాచార్యుం డన
దాతృతఁ గానీనుఁ డనఁ బ్రతాపంబునఁ బ్ర
ద్యోతనుఁ డన సచివాగ్రణి
కేతయభాస్కరుఁడు జగతిఁ గీర్తన కెక్కెన్. 39

చ. గొనములప్రోక భాస్కరునకున్ బతిదేవత మారమాంబ
కున్, దినకరతేజులై తుహినదీధితిసన్నిభకాంతిమంతులై
వనధిగభీరు లై సుజనవందితు లై జనియించి రొప్పుగా
మనుచరితుండు కేతనయు మారసమానుఁడు మారశౌరి
యున్. 40

క. శౌచంబున గంగాత్మజుఁ
డాచారంబున మరీచి యర్థుల కీగిన్
ఖేచరవల్లభుఁ డనఁగాఁ
బాచయకేతండు కీర్తిపాత్రం బయ్యెన్. 41

ఆ. మారశౌరి రూపమహిమాస్పదంబున
మారుఁ బోలుఁ గూచిమారుఁ బోలు
వీరవైరిభయదవిక్రమక్రీడఁ గాం
తేయుఁ బోలు వైనతేయుఁ బోలు. 42

వ. భాస్కరామాత్యు ననుసంభవుండు. 43

క. దండితరిపువర్గుఁడు గుణ
మండనమండితయశోరమారంజితభూ

మండలుఁ డన నుతి కెక్కెను
గుండామాత్యుండు విప్రకులతిలకుఁ డిలన్. 44

చ. స్థిరవిభవుండు గుండనకు ధీరగుణాన్విత భూమిదేవికిన్
వరనుతకీర్తి మల్లనయు వందితబంధుఁడు కొమ్మఁడున్ దయా
కరుఁడగు సిద్ధఁడుం గుసుమకార్ముకసన్నిభమూర్తి కేతఁడున్
బరువడి నుద్భవించిరి శుభగ్రహసంశ్రితపుణ్యవేళలన్. 45

వ. అం దగ్రజుండు. 46

ఉ. రెండవ పుష్పబాణుఁ డధరీకృతకిన్నరభర్త ధిక్కృతా
ఖండలసూతి నిర్జితశకద్విషుఁ డండ్రు సురూపవైభవా
ఖండితశౌర్యదానముల గౌరవమొందుట కారణంబుగా
గుండనికూర్మిపుత్రు గుణకోవిదు మల్లని నెల్లవారలున్.

క. ఆతనితమ్ముఁడు భువన
ఖ్యాతుఁడు కొట్టరువు కొమ్మఁ డబలాచేతో
జాతుండు దానవైభవ
నూతనజీమూతవాహనుం డన వెలసెన్. 48

క. కొమ్మామాత్యుని కూరిమి
తమ్ముఁడు సిద్ధనకు నితరదండేశులు స
త్యమ్మునఁ జాగమ్మున శౌ
చమ్మున శౌర్యమున రూపసంపద నెనయే. 49

క. ఆతని యనుంగుఁదమ్ముఁడు
కేతన బహుసత్కళానికేతనుఁడు దశా
శాతటవిలసత్కీర్తి
ద్యోతితభువనుండు నాఁగ నున్నతిఁ దాల్చెన్. 50

వ. ఆగుండనామాత్యు ననుసంభవుండు. 51

క. సకలకళాపారంగతుఁ
డకుటిలచిత్తుఁడు నిజాన్వయాంభోనిధిశీ
తకరుఁడు ప్రకటయశోధనుఁ
డకలంకుఁడు నల్లసిద్ధనామాత్యుఁ డిలన్. 52

క. వినయనిధి నల్లసిద్ధికి
వనజానన యచ్చమకుఁ బ్రవర్ధితకీర్తుల్
జనియించిరి కేతన మ
ల్లన లనఁగా వివిధసత్కళాకోవిదులై. 53

క. ధూతకలంకుఁడు విద్వ
త్ప్రీతికరుఁడు దురితతిమిరదిననాథుఁడు జై
వాతృకసమసౌమ్యాకృతి
కేతన యన నల్లసిద్ధికేతన వెలసెన్. 54

ఆ. ఎల్లగుణములందు నితని కీతఁడె సరి
గాక సదృశు లొరులు గలరె యనఁగ
నల్లసిద్ధిసుతుఁడు మల్లనామాత్యుండు
వినుతి కెక్కె సూరిజనుల సభల. 55

వ. ఇట్టి సంతానంబువలన వెలుంగు కేతనామాత్యు ననుసంభ
వుం డైన మల్లనార్యుగుణవిశేషం బెట్టి దనిన. 56

ఉ. బల్లిదుఁడే వృకోదరుఁడు భాగ్యసమగ్రుఁడె కిన్నరేశ్వరుం
డుల్లసితప్రతాపగుణయుక్తుఁడె పంకజబాంధవుండు వా
గ్వల్లభుఁడే విరించి సుభగత్వమనోజ్ఞుఁడె మన్మథుండు మా
మల్లనమంత్రి మంత్రిజనమండనుఁ జేర్కొని చెప్పి చెప్పఁ
చోన్. 57

క. పరమదయాపరతంత్రుఁడు
హరిపూజాపరుఁడు మల్లనామాత్యునకున్
సరసిజముఖి మాచమకున్
జిరవిభవాస్పదుఁడు మనుమసిద్ధి జనించెన్. 58

వ. అతనిగుణంబు లెట్టి వనిన. 59

సీ. సుకవిజిహ్వాచకోరికలకుఁ దనకీర్తి
పసనైన చంద్రాతపంబుగాఁగ
నాపదార్తజనసస్యములకుఁ దనకృపా
దానాంబు వమృతంపుసోనగాఁగ
వనితాజనులచూపు లనుతూఁపులకుఁ దన
ప్రసన్నవిమేను లెప్పంబుగాఁగ
మహనీయనృపనీతిమణులకుఁ దనమాట
లాలితశాణోపలంబుగాఁగ

ఆ. వినుతి కర్హుఁ డయ్యె వివిధవిద్యాభ్యాస
చరితుఁ డభవచరణసరసిజాత
మధుకరాయమాణమానసుం డప్రతి
మానవిమలబుద్ధి మనుమసిద్ధి. 60

వ. ఆమల్లనామాత్యు ననుసంభవుండు. 61

ఉ. స్థాపితసూర్యవంశవసుధాపతి నాఁ బరతత్త్వధూతవా
ణీపతి నా నుదాత్తనృపనీతిబృహస్పతి నా గృహస్థగా
రీపతి నాఁ గృపారససరిత్పతి నాఁ బొగడొందె సిద్ధిసే
నాపతి చోడ తిక్కజననాథశిఖామణి కాప్తమంత్రియై. 62

క. సామాద్యుపాయపారగుఁ
డాముష్యాయణుఁడు సిద్ధనామాత్యునకున్

క. పరమదయాపరతంత్రుఁడు
హరిపూజాపరుఁడు మల్లనామాత్యునకున్
సరసిజముఖి మాచమకున్
జిరవిభవాస్పదుఁడు మనుమసిద్ధి జనించెన్. 58

వ. ఆతనిగుణంబు లెట్టి వనిన. 59

సీ. సుకవిజిహ్వాచకోరికలకుఁ దనకీర్తి
పరమైన చంద్రాతపంబుగాఁగ
నాపదార్తజనసస్యములకుఁ దనకృపా
దానాంబు వమృతంపుసోనగాఁగ
వనితాజనులచూపు లనుతూఁపులకుఁ దన
ప్రసన్ననిమేను లెప్పంబుగాఁగ
మహనీయనృపనీతిమణులకుఁ దనమాట
లాలితశాణోపలంబుగాఁగ

ఆ. వినుతి కర్హుఁ డయ్యె వివిధవిద్యాభ్యాస
చరితుఁ డభవచరణసరసిజాత
మధుకరాయమాణమానసుం డప్రతి
మానవిమలబుద్ధి మనుమసిద్ధి. 60

వ. ఆమల్లనామాత్యు ననుసంభవుండు. 61

ఉ. స్థాపితసూర్యవంశవసుధాపతి నాఁ బరతత్త్వధూతవా
ణీపతి నా నుదాత్తనృపనీతిబృహస్పతి నా గృహస్థగా
రీపతి నాఁ గృపారససరిత్పతి నాఁ బొగడొందె సిద్ధిసే
నాపతి చోడ తిక్కజననాథశిఖామణి కాప్తమంత్రియై. 62

క. సామాద్యుపాయపారగుఁ
డాముష్యాయణుఁడు సిద్ధనామాత్యునకున్

తే. జగతి నుతి కెక్కె రాయవేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరస్ఫూర్తి రాజమూర్తి
గంధవారణబిరుదవిఖ్యాతకీర్తి
ఘనప తేజుండు సిద్ధయతిక్కశౌరి. 66

తే. అతఁడు పతిహితారుంధతి నన్వయాంబు
నిధినిశాకరరేఖ ననింద్యచరిత
సకలగుణగణాలంకృత జానమాంబ
వనజలోచనఁ బ్రీతి వివాహమయ్యె. 67

క. అమ్మంత్రి తిక్కనార్యున
కమ్మగువకు సద్గుణాఢ్యుఁ డగు సిద్ధనయున్
గొమ్మనయును నిమ్మడియును
ముమ్మడియును నుదయ మైరి మోదం బెసఁగన్. 68

వ. అం దగ్రజుండు. 69

సీ. ఇందిరాసుతుచంద మిట్టిదె యననేల
యీతనిరూపంబుఁ జూతురేని
యమరభూరుహ మిట్టి దననేల యీతని
త్యాగంబునకుఁ గేలు సాఁతురేని
యమృతసేచన మిట్టి దననేల యితనిక
పాదృష్టిఁ బెరయఁ జొప్పడుదురేని
మనుమార్గ మది యిట్టి దననేల యితనిస
ద్వృత్తగౌరవము భావింతురేని
తే. యని యనేకవిధంబుల నఖిలజనులు
తనసమస్తగుణంబులు తగిలి పొగడ

తే. జగతి నుతి కెక్కె రాయవేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరస్ఫూర్తి రాజమూర్తి
గంధవారణబిరుదవిఖ్యాతకీర్తి
జనప తేజుండు సిద్ధయతిక్కశౌరి. 66

తే. అతఁడు పతిహితారుంధత నన్వయాంబు
నిధినిశాకరరేఖ ననింద్యచరిత
సకలగుణగణాలంకృత జానమాంబ
వనజలోచనఁ బ్రీతి వివాహమయ్యె. 67

క. అమ్మంత్రి తిక్కనార్యున
కమ్మగువకు సద్గుణాఢ్యుఁ డగు సిద్ధనయున్
గొమ్మనయును నిమ్మడియును
ముమ్మడియును నుదయ మైరి మోదం బెసఁగన్. 68

వ. అం దగ్రజుండు. 69

సీ. ఇందిరాసుతుచంద మిట్టిదె యన నేల
యీతనిరూపంబుఁ జూతు రేని
యమరభూరుహ మిట్టి దన నేల యీతని
చాగంబునకుఁ గేలు సాఁతు రేని
యమృతసేచన మిట్టి దన నేల యితనికృ
పాదృష్టి బెరయఁ జొప్పడుదు రేని
మనుమార్గ మది యిట్టి దన నేల యితనిస
ద్వృత్తగౌరవము భావింతు రేని
తే. యని యనేకవిధంబుల నఖిలజనులు
తనసమస్తగుణంబులు తగిలి పొగడ

ఆ. వీఁడె కాని యొరుఁడు లేఁడు లోకంబుల
నని యనేకవిధుల నఖిలజనులు
పొగడ నెగడె సుకవిపుంజకంజాకర
భాస్కరుండు మంత్రిభాస్కరుండు. 75

ఉ. ఆతతనీతిసంపద విహంగమపుంగవకేతుఁ జెప్పుచోఁ
గేతనఁ జెప్పి యుద్ధవిజిగీషను వానరకేతుఁ జెప్పుచోఁ
గేతనఁ జెప్పి దిగ్వలితకీర్తిరతిన్ వృషకేతుఁ జెప్పుచోఁ
గేతనఁ జెప్పి కాక ధరఁ గేవలమర్త్యులఁ జెప్పఁబోలునే. 76

క. లోలుఁడు కీర్తికిఁ బరభూ
పాలసచివకార్యతుహినపటలీభానుం
డాలానము జయహస్తికిఁ
బోలమమల్లుండు ప్రకృతిపురుషుఁడె తలఁపన్. 77

శా. పారావారపరీతధాత్రి వినుతింపంబోలు మల్లాంకునిన్
సారోదారయశోభిరాము బహుశాస్త్రప్రౌఢు శస్త్రాస్త్రవి, ద్యారాజన్నిజబాహువిక్రము నుదాత్తస్వాంతు ధర్మక్రియా, చారాపాస్తసమస్తదోషనివహున్ జోహత్తనారాయణున్.

చ. ఉరవడి నుగ్రసేవణపయోనిధి బాడబవహ్నిచాడ్పునన్
దరికొని కుంభజన్మక్రియఁ ద్రాగి రఘుక్షితినాథుమాడ్కి న
చ్చెరువుగ నింకఁ జేసె నని చెప్పు జనప్రకరంబు విక్రమా
భరణుని సిద్ధనార్యసుతుఁ బాచని నన్ననగంధవారణున్.

క. *ఇమ్మడిఖచరాధీశ్వరుఁ
డిమ్మడిదినవాథతనయుఁ డిమ్మడిగుప్తుం

---

* శ్రీ.వి. పం. ప్రతిలో నీపద్యము కానరాదు.

డిమ్మడి బలీంద్రుఁ డనఁగాఁ
బెమ్మఁడు వితరణగుణమునఁ బెంపు వహించెన్. 80

వ. ఇట్టి సంతానవంతుఁడైన సిద్ధనామాత్యుననుసంభవుండు.

సీ. స్వారాజ్యపూజ్యుఁడో కౌరవాధీశుఁడో
నాఁగ భోగమున మానమున నెగడె
రతినాథుఁడో దినరాజతనూజుఁడో
నాఁగ రూపమున దానమున నెగడె
ధరణిధరేంద్రుఁడో ధర్మసంజాతుఁడో
యనఁగ ధైర్యమున సత్యమున నెగడె
గంగాత్మజన్ముఁడో గాండీవధన్వుఁడో
యనఁగ శౌచమున శౌర్యమున నెగడె

తే. సూర్యవంశభూపాలకసుచిరరాజ్య
వనవసంతుండు బుధలోకవత్సలుండు
గౌతమాన్వయాంభోనిధిశీతకరుఁడు
కులనిధానంబు కొట్టరుకొమ్మశౌరి. 82

క. అతఁడు రతిఁ జిత్తసంభవు
గతి రోహిణిఁ జంద్రుమాడ్కిఁ గమలావాసన్
శతదళలోచనుక్రియ న
ప్రతిమాకృతి నన్నమాంబఁ బరిణయమయ్యెన్. 83

వ. అక్కులవధూరత్నంబు గుణవిశేషంబు లెట్టి వనిన. 84

సీ. పతిభక్తి నలయరుంధతి పోలెనేనియు
సౌభాగ్యమహిమ నీసతికి నెనయె
సౌభాగ్యమున రతి సరియయ్యెనేని భా
గ్యంబున నీయంబుజాక్షి కెనయె

భాగ్యంబునందు శ్రీ ప్రతియయ్యె నేనియుఁ
దాలిమి నీలతాతన్వి కెనయె
తాలిమి భూదేవి తగ సాటియగు నేని
నేర్పున నీపద్మనేత్ర కెనయె
తే. యని యనేకవిధంబుల నఖిలజనులు
పొగడ నెగడెఁ గృపాపరిపూరితాంత
రంగ కొమ్మనామాత్యు నర్ధాంగలక్ష్మి
యఖిలగుణగణాలంకృత యన్నమాంబ. 85

క. ఆరమణి పరమపావన
నీరజభవనాన్వయాంబునిధిచంద్రిక పూ
ర్వారాధితదేవత యా
గౌరవ మభివృద్ధి పొంద గర్భము దాల్చెన్. 86

సీ. గర్భితనవసుధాకరపయోనిధిమాడ్కి
సతి మేను పాండురచ్ఛవి వహించెఁ
గలితభృంగాబ్జకుట్మలయుగ్మకము పోల్కిఁ
గాంత చన్మొక్కలఁ గప్పు మిగిలె
మకరందసంవాహమలయానిలుని క్రియ
నంబుజాననగతి యలస యయ్యె
నుచితకాలాగమనోజ్జ్వలకుసుమంబు
గతి నింతినాభి వికాస మొందె
ఆ. వళులు విరిసెఁ గౌను బలిసెఁ గోర్కులు మది
సందడించె నారు నంద మయ్యె
ననుపమానభాగ్య యగు నన్నమాంబకు
వర్ణనీయగర్భమై భవమున. 87

వ. ఇట్లు గర్భలక్షణలక్షితాంగి యైననవమాసంబులు పరిపూర్ణంబులైన శుభముహూర్తంబున సుపుత్త్రుం బడసిన నతండు జాతకర్మప్రముఖసంస్కారానంతరంబున వేదాదిసమస్తవిద్యాభ్యాసవిభాసి యగుచు ననుదినప్రవర్ధనంబుం జెంది తుహినభానుండునుం బోలె బహుకళాసంపన్నుండును గార్తికేయునింబోలె నసాధారణశక్తియుక్తుండును నధరీకృతమయూరుండును నై పరమేశ్వరుండునుం బోలె లీలావినిర్జితకుసుమసాయకుండును నకలంకవిభూత్యలంకృతుండును నై నారాయణుండునుంబోలె ననంతభోగసంశ్లేషశోభితగాత్రుండును *గ్రతుపురుషత్వప్రసిద్ధుండును లక్ష్మీసమాలింగితవక్షుండును నై వెలసె నాతిక్కనామాత్యు గుణవిశేషంబు లెట్టి వనిన. 88

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁ డనిన వీఁ
డను నాలుకకుఁ దోడ వైనవాఁడు
చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁ డనిన వీఁ
డను శబ్దమున కర్థ మైనవాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁ డనిన వీఁ
డని చెప్పుటకుఁ బాత్ర మైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన వీఁ
డని చూపుటకు గుఱి యైనవాఁడు
తే. మనుమసిద్ధిమహీశసమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు

---

* శ్రీపరమ.

కొట్టరువుకొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి. 89

క. అగు నను గొమ్మయతిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్దచారుకవితమై
నెగడిన "బాణోచ్ఛిష్టం
జగత్త్రయం" బనినపలుకు సఫలం బయ్యెన్. 90

క. కృతులు రచియింప సుకవుల
కృతు లొప్పఁ గొనంగ నొరునికిం దీరునె వా
కృతినిభుఁడు వితరణశ్రీ
యుతుఁ డన్నమసుతుఁడు తిక్కఁ డొక్కఁడుదక్కన్. 91

క. అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుం డై తా
నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్. 92

సీ. సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొను ననుటధికకీర్తనకుఁ దెరువు
లలితనానాకావ్యములు చెప్పు నుభయభా
షలయందు ననుట ప్రశంసత్రోవ
యర్థిమైఁ బెక్కూళ్ల నగ్రహారంబులు
గా నిచ్చు ననుట పొగడ్తపాలము
మహితదక్షిణలైన బహువిధయాగంబు
లొనరించు ననుట వర్ణనము*చొప్పు

* దాం.

తే. పరుని కొకనికి నిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపు సొంపారి నెగడు నెట్టు
కొమ్మనామాత్యు తిక్కనికొలఁది సచివుఁ
డింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు. 93

## షష్ఠ్యంతములు.

క. ఈదృశగుణభూషణునకు
వేదాదిప్రకటవివిధవిద్యాభ్యాసా
పాదితమహత్త్వునకు బల
సూదనవిభవునకు సతతశుద్ధాత్మునకున్. 94

క. శ్రీమంతునకు నిరర్గళ
ధీమంతున కధ్వరాబ్జదిననాథునకున్
సామాద్యుపాయవిదునకు
నాముష్యాయణున కంగజాకారునకున్. 95

క. చతురాననసన్నిభునకు
సతతస్వాహాస్వధాదిశబ్దద్వయసం
స్కృతహవ్యకవ్యసంత
ర్పితమఖశిఖిముఖనిలింపపితృవర్గునకున్. 96

క. హృద్భవనిభమూర్తికిఁ బ
ద్మోద్భవవంశాగ్రణికి నయోన్నతునకు వి
ద్వద్భోగ్యభాగ్యునకు గుణ
సద్భావజ్ఞునకు నీతిచాణుక్యునకున్. 97

క. *భాస్వద్గుణవితరణజిత
భాస్వత్తనయునకు వినయపరునకుఁ గరుణా

* కొన్ని ప్రతులలో నీపద్యము కనఁబడదు.

ర్ద్రస్వాంతునకు ననూనత
పస్స్వాధ్యాయాదిసుకృతపరిపాకునకున్. 98

క. సన్మానసమగ్రునకు వి
యన్మణితేజునకుఁ బరహితార్థికి సద్ధ
ర్మోన్మననాన్వితకీర్తికి
మన్మత్క్ష్మాపాలమంత్రిమాణిక్యునకున్. 99

క. విద్యావైశారద్యస
ముద్యోతితమతికిఁ బుణ్యమూర్తికి దివిష
న్నద్యంబువిమలయశునకుఁ
బద్యాదిత్రివిధకావ్యపారీణునకున్. 100

క. అన్యమవరసుతునకు సౌ
జన్యాభరణునకు నభవచరణాంభోజా
తన్యస్తచిత్తునకు నృప
మాన్యునకును గవిసరోజమార్తాండునకున్. 101

శా. తేజోరాజితసర్వలోకునకు భూదేవాన్వయాంభోజినీ
రాజీవాప్తున కాగమప్రథితకర్మప్రస్ఫురత్కీర్తికిన్
బూజాతర్పితరాజశేఖరునకున్ బుష్పాస్త్రరూపోపమా
రాజన్మూర్తికి దోషదర్పదమనారంభైకసంరంభికిన్. 102

క. దేవేంద్రవిభవునకు భూ
దేవకులాగ్రణికి భారతీసుస్థితిసం
భావితవదనసదనునకు
సేవాతర్పితశశాంకశేఖరున కిలన్. 103

మాలిని. కనకగిరితటీసంకాశవక్షస్స్థలీభా
గునకు భజనవృత్తక్షోణిదేవాదరోద్య
ద్ఘనయశునకు మన్మత్క్ష్మాపతిప్రాజ్యరాజ్యా
బునిధిశశికి వాణిస్ఫూర్తిమన్మూర్తి కుర్విన్. 104

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలసదభినవదండి నామధేయవిఖ్యాత కేతనార్య ప్రణీతంబైన దశకుమార చరితంబను మహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# ద శ కు మా ర చ రి త్ర ము.

## ద్వి తీ యా శ్వా స ము.

---

శ్రీ శ్రితవత్సునకు సుదా
త్తశ్రౌతస్మార్తకర్మతత్పరమతికిన్
విశ్రుతవిశ్రాణునకును
నాశ్రితభరణునకుఁ దిక్కనామాత్యునకున్. 1

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా చెప్పంబూనిన కథానికాయం బను (సుర)లతాజాలం బెట్టి దనినఁ దదీయకందం బైన కుసుమపురంబున కధీశ్వరుం డైన రాజహంసమహీవల్లభు వృత్తాంతంబును రాజవాహనప్రముఖదశకుమారజననప్రకారంబును దివ్యవాగుపదేశక్రమంబున వారలు దిగ్విజయార్థం బరుగుటయు వింధ్యాటవీమధ్యంబున మాతంగకుం డను సాధకునకుఁ గ్రియాసహాయత్వంబు ననుష్ఠింపం బూని రాజవాహనుండు చెలుల వంచించి చనుటయుఁ దదన్వేషణార్థంబుగాఁ దక్కినకుమారులు దిక్కులను బెక్కుముఖంబులం బోవుటయు దైవయోగంబున బిలంబు సాధించి వెలువడివచ్చి పుష్పోద్భవసోమదత్తులం గలసి రాజవాహనుం డుజ్జయినీపురంబునకుం బోయి తత్పతి యైన దర్పసారుని చెలియలి నవంతిసుందరి యను కాంతారత్నంబుం గపటోపాయంబునం బరిణయంబగుటయుఁ గొండొకకాలంబునకుఁ

జంపానగరంబునం గుమారు లెల్లం గూడుటయుఁ దొలుతఁ గూడిన యిరువురచరితంబులు రాజవాహనువలన నెఱింగి దక్కినకుమారులుం దమతమచరితంబులు క్రమంబున నత నికి విన్నవించుటయును బదంపడి శాత్రవజయం బొనర్చి రాజహంసుచేత రాజవాహనుం డభిషిక్తుం డగుటయు నతండు సముద్రముద్రితంబైన వసుధాచక్రంబు నిర్వక్రం బుగాఁ బాలించి మిత్రగణసమేతంబుగా రాజ్యసుఖంబు లనుభవించుటయు నై యొప్పు నెద్ది యది సవిస్తరసందర్భ సంకీర్తనం బాకర్ణనీయంబుగా వర్ణించెద. 2

సీ. ఎందులపరిఖ భోగీంద్రబృందమునకు
భాసురకేళీనివాస మయ్యె
నెందులకోట దినేంద్రునశ్వములకు
సముచితవిశ్రమస్థాన మయ్యె
నెందులసౌధంబు లిందిరాదేవికి
నెసకంపుఁ బుట్టినయిండ్లు లయ్యె
నెందులజనులసమృద్ధవర్తనములు
పరుల కుత్తమకృత్యభంగు లయ్యె
ఆ. నట్టి కుసుమపురమునందు విశ్వంభరా
భారభరణపరిణతోరుభుజుఁడు
రాజవంశజుండు రాజహంసుం డను
రాజు గలఁడు దివిజరాజనిభుఁడు. 3

వ. అమ్మహీవల్లభునకుం గులక్రమాగతులగు నాప్తమంత్రులు మువ్వురు గల రందు మతిశర్మ యను మంత్రికి సుమ తియు సత్యశర్మయు, ధర్మపాలుండను నమాత్యునకు సుమి

త్రుండును గామపాలుండును, బదోద్భవుం డను సచివు
నకు రత్నోద్భవుండును సుశ్రుతుండును సుమంత్రుం
డును నను తనయులు పుట్టి రి ట్లుదయించినపుత్రవర్గంబు
లోన సత్యశర్మ ధర్మకర్మపరాయణుం డై తీర్థయాత్ర పోయెఁ
గామపాలుండు దుర్వినీతుం డై జనకాగ్రజులశాసనంబునం
దనాదరంబు చేసి యెక్కడికేనియుం జనియె రత్నోద్భ
వుండు వణిగ్వ్యాపారపారంగతుం డై కలం బెక్కి *జేహా
రంబునం బోయెఁ దక్కినసుమతియు సుమిత్రుండును సుశ్రు
తుండును సుమంత్రుండును నను నలువురుం దమతండ్రుల
పిమ్మట నారాజునకుం బ్రధాను లై కార్యంబు లనుష్ఠింప
వసుమతికి సవతియనం దగు వసుమతీదేవి యగ్రమహి
షిగా నతండు రాజ్యసుఖంబు లనుభవించుచున్న యెడ
మాళవదేశాధీశుం డైన మానసారుండు రాజ్యగర్వంబునఁ
గన్నుఁగానక కయ్యంబునకుఁ గాలుద్రవ్వి యెగ్గు లొనర్చిన
వానిమీఁదఁ బోవం దలంచి ప్రయాణభేరి సఱవం బంచిన.

మ. కులశైలంబులు దిర్దిరం దిరుగ దిక్కుంభీంద్రవర్గంబు సం
చలతం జెంద వియత్తలంబు పగులన్ సర్వంసహాచక్రమా
కులతం బొందఁగ సప్తసాగరములున్ ఘూర్ణిల్ల లోకంబుల
ల్లలనాడం జెలఁగెన్ బ్రయాణపటహం బత్యద్భుతాపాదియై.

వ. తదనంతరంబ. 6

క. భేరీభైరవభాంకృతి
ధూళీకృతశత్రుఁ డగుచుఁ దుహినాంశుకులా

* వ్యవహార.

ధారుఁ డగు రాజహంసమ
హీరమణుఁడు దండువెడలె నెంతయు నలుకన్. 7

క. జలనిధులు నిట్టపొడువం
బ్రళయాంతకుఁ డవనిజనులపై నేచినయ
ట్లలఘుప్రకట చతుర్విధ
బలయుతుఁ డై మానసారుపై వడి నడిచెన్. 8

ఉ. మాగధనాథుఁ డి ట్లరుగ మాళవవల్లభుఁ డాగ్రహించియు
ద్యోగము విక్రమంబు విభవోన్నతియుఁ విలసిల్లుచుండ నా
నాగజయూథఘోటకసనాథసమగ్రబలంబుతోడ భూ
భాగము పల్లటిల్లఁ బయిపై నడిచెన్ సమరాభిలాషి యై.

వ. ఇవ్విధంబున మగధమాళవేశ్వరు లొండొరుల కెదురు
నడిచి కలను చెప్పి మొనలు దీర్చి కదిసినసమయంబున. 10

క. కరిఘటలు తురగచయములు
నరదంబుల మొత్తములు భటానీకములుఁ
బెరసి దిగంతము లద్రువఁగఁ
బరువడి దలపడిరి రెండువాగులయందున్. 11

వ. అయ్యవసరంబున. 12

క. కరికరములఁ దురగఖురో
త్కరముల రథచరణములఁ బదాతులు పైపైఁ
దొరుఁగుచుఁ దునియుచు నలియుచు
ధరణీభాగమునఁ బడిరి తఱచై యుండన్. 13

క. కాలుబల మెల్ల నిమ్మెయిఁ
గాలునిబల మయ్యె నంతఁ గరితురగరథా

భీలత్రివిధబలంబులు
నాలంబున రౌద్రరసము నాకృతి చూపెన్. 14

వ. తత్సమయంబున. 15

ఉ. ఆమగధేశమాళవధరాధిపు లెక్కటిం బోరి రాజిలోఁ
గాముఁడు శంబరుండు శశిఖండధరుండుగజాసురేంద్రుఁడున్
రాముఁడు రావణుండు సురరాజతనూజుఁడు సింధునాథుఁ
డున్, భీముఁడు దుస్ససేనుఁడు సువేంద్రుఁడు కంసుఁడుఁ
బోరునాకృతిన్. 16

వ. ఇట్లతిఘోరయుద్ధంబు సేసి వసమరియున్న మానసారుం
జూచి కరిపోతకంబుఁ గనిన కంఠీరవంబునుంబోలెఁ గోపించి
పట్టుకొని తదీయవదనంబు లజ్జావనతం బగుట గనుంగొని
కరుణించి యమ్మాళవేంద్రునిం దోడ్కొనిపోయి వానిరా
జ్యంబునం బ్రతిష్ఠించి క్రమ్మఱవచ్చి రాజహంసధాత్రీపతి
యప్రతిహతం బగు తనసంపద పొంపిరివోవ లక్ష్మీకిం
బాత్రంబుగా సుపుత్రుం బడయం గోరుచున్న యెడ నొక్క
నాఁడు ప్రభాతసమయంబున. 17

క. వసుధాధిపుకోర్కికిం దగఁ
బసనగు సంతానవృక్షఫలము కరుణతో
వసుమతికి వాసుదేవుం
డొసఁగెన్ గలలోన దైవయోగముపేర్మిన్. 18

వ. ఆసుస్వప్నంబు సఫలంబగుటం జేసి యద్దేవి గర్భంబు దాల్చి
నం బ్రమోదసంపదవలనఁ బొంపిరివోవుచు సమస్త సు
హృద్భూపాలవర్గంబు రావించి వసుమతీదేవికి సీమంతో

త్సవం బొనర్చి మగధేశ్వరుండు విభవవిజితదేవేంద్రుం
డగుచు మంత్రిపురోహితసామంతపరివారపరివృతుం డై
కొలువున్న యవసరంబునఁ బ్రతిహారి చనుదెంచి సవిన
యంబుగా ని ట్లనియె. 19

క. దేవ! భవద్దర్శనసం
భావన లెడఁ గోరి వచ్చి ప్రతిహారమునన్
దేవసముఁ డొకముసీంద్రుఁడు
దా వేడుక నున్నవాఁడు ధరణీనాథా!. 20

క. అని విన్నవించి జనపతి
యనుమతమునఁ దోడి తెచ్చె నాసన్న్యాసిన్
గని యెఱిఁగి మందహాసము
వినయముతోఁ గూర్చెఁ బతి వివేకము వెలయన్. 21

ఉ. అంతఁ బయోజబంధుఁడు దినార్ధగతుండగుడున్ సమస్తసా
మంతుల భృత్యులన్ బుధుల మాన్యులఁ బొండని యాన్బ
పాలుఁ డే, కాంతగృహంబులోనికిఁ బ్రియంబున మంత్రులుఁ
దాను బోయి వే, షాంతరగూఢుఁడైన చరు నల్లన చేరఁగ-
బిల్చి యిట్లనున్. 22

క. ఓరీ! నీతో వచ్చిన
చారులు నినుఁ బాసి యెందుఁ జని రీ వీయా
కారముఁ గొని యేపురముల
నేరాజుల కొలఁదు లెఱిఁగి తెఱిఁగింపు మొగిన్. 23

వ. అనిన వాఁడు సవినయంబుగా ని ట్లనియె. 24

క. దేవరపనుపున మును నా
నావిధదేశముల కెల్ల నాతోడిచరుల్

పోవుటయు నేనుఁ బోయితి
నీవేషము దాల్చి మాళవేశ్వరుపురికిన్. 25

వ. అందు నిగూఢంబుగా వర్తించి యతనివర్తనంబు నెఱింగి
వచ్చితి నని యిట్లనిన. 26

క. ఆనృపతి మును పరాజితుఁ
డై నీచే నిలువఁబడిన యంతటఁ గోలెన్
బూని మహాకాళంబునఁ
దా నీశు గుఱించి యుగ్రతప మొనరించెన్. 27

చ. అతనితపఃప్రభావమున కాపరమేశుఁడు మెచ్చియిచ్చె ను
ద్యతగద యేకవారభయదంబుగఁ గావున దానిలావునన్
బ్రతిభటుఁడై కృతఘ్నమతిఁ బైఁ జనుదేరఁగ నున్నవాఁడు ని
శ్చితమిది మీఁదికార్య మెడ సేయక సేయుము మేదినీశ్వరా!.

చ. అని యెఱిఁగించి వాఁడరుగ నప్పుడె కార్యము నిశ్చయించి యి
ట్లనికి తగంగ మంత్రులు నరాధిప! యిట్టిదయేని మాళవేం
ద్రున కెదురెత్తరాదతఁడు రోషమునం బయి నెత్తివచ్చినన్
జెనయుట దక్కి దుర్గములు సేరుట నీతి దలంచిచూడఁగన్.

వ. అని దైవబలము విచారించి పలికిన మంత్రులను బలి యి
ట్లనియె. 30

మ. మగపంతంబున మానసారుఁ డనిలో మా కల్గి పై నెత్తినన్
బగ వాటింపక వాని నొంపక జగత్ప్రఖ్యాతిగా నోటమైఁ
దగ వూహింపక దుర్గభూములకు నిందాపాత్రమైఁ బోక బు
ద్ధిగఁ జెప్పందగునే నృపప్రకృతి నిస్తేజంబు సైరించునే. 31

ఉ. దైవబలం బసాధ్య మని ధైర్యము పెద్దఱికంబు లజ్జయుం
బోవఁగఁ బెట్టి కానలకుఁ బోయిన లోకమువారు నవ్వరే

యేవపుమాట లేమిటికి నెల్లవిధమ్ముల మానసారుసైఁ
బోవుటమాన వాఁ డనికిఁ బూని నిజంబుగ నెత్తివచ్చినన్.

వ. అనినం బతిపలుకు లతిక్రమింపనేరక యొడంబడి వీడ్కొని నిజనివాసంబులకుఁ జనిరి మఱునాఁడు మాళవేశ్వరుండు సమస్తసామగ్రితో నెత్తివచ్చిన విని సుమతిప్రముఖులగు నలుగురు మంత్రులు కార్యబలంబు సాధనంబుగా నధిపు చిత్తంబు మెత్తంజేసి హేతుదృష్టాంతంబులు సూపి యొడఁ బఱచి గర్భభారాలసాంగియైన మహాదేవి నిఖిలాంతఃపుర సంతానంబుఁ గూర్చి బుద్ధిసహాయంబుగా నాత్మసతీవర్గం బును శరీరస్థితిసహాయంబుగా ధాత్రీవర్గంబును క్రీడాస హాయంబుగా సఖీవర్గంబును దుర్గస్థలవర్తనసహాయంబుగా మూలంబును సమర్పించి వింధ్యాటవీమధ్యంబున నిగూఢం బుగా నిలువ నియమించి కందువఁ జెప్పి యనిచిపుచ్చిరి రాజహంసుండును దండువెడలె నిట్లొండొరులు చేరవిడిసి.

క. మగధాధీశుఁడు మాళవ
జగతీపతియును సమస్తసైన్యాన్వితులై
దిగధీశులు మది బెదరఁగ
నగునగు ననఁ బోటులాడి రాహవభూమిన్. 34

క. తదవసరంబున విజయా
స్పదుఁడై మగధేశుమీఁద భవదత్తమహా
గద వైచె మాళవేశ్వరుఁ
డది నుగ్గుగ నేసె రాజహంసుం డలుకన్. 35

ఉ. భూతపతిప్రసాదవిధి బొంకగు టెందును లేమిఁ దీవ్రమై
యాతునుకల్ రణాగ్రమున నన్నియు నన్నిముఖంబులన్

వడిఁ, సూతునెఱుంకు లంటి నృపసూనుశరీరము గాఁడెఁ గ్రక్కునన్, సూతుఁడు నేలఁ గూలెఁ బతి సొమ్మిలఁ బోయె రథోపరిస్థలిన్. 36

క. అంత వడిం దురగములు
డ్భ్రాంతములై కలను వెడలి పటుగతిమైఁ ద
త్కాంతాజను లున్నయర
ణ్యాంతరమున కేఁగె దైవయత్నముకలిమిన్. 37

వ. ఇట్లు రథ్యంబులు పఱచునెడ నంతఃపురసన్నివేశంబున కనతిదూరంబున నొక్కవటవిటపి నరదంబు దగిలినఁ బరిశ్రాంతములైన వాహనంబులు నిశ్చలంబులై యుండ రాజహంసుండును సేదదేరకయుండె నట మాళవేశ్వరుండును మగధపతిరాజ్యంబు గైకొని కుసుమపురంబున కరిగిన. 38

క. నలుగురు (మంత్రులు) నిట పోలి
కలనం బడియును విధాతృకారుణ్యమునం
దెలిసి పతిఁ దడవి కానక
పోలఁతులకందువకుఁ జేరఁ బోయిరి వెలుచన్. 39

వ. ఇట్లు చనుదెంచి వారలు వసుమతీమహాదేవిం గని యుద్ధప్రకారంబును రాజహంసునిం గలని రోసి కానమియు సవిషాదంబుగా నెఱింగించిన నిజవల్లభుండు పరలోకగతుం డయ్యెనని కాఁదలంచి యద్దేవి శోకంబు సైరింపంజాలక తనుత్యాగంబునకు నుద్యోగించి యనలంబు దయసేయుం డనిన మంత్రు లిట్లనిరి సంశయంబగు పతిమరణంబునకు నను మరణంబు తగ దదియునుంగాక నీస్వప్నఫలంబు సాకారం

బైనట్లున్న యీగర్భంబు రక్షించుటయు సమస్తలోకరక్ష
ణం బగు మఱియును. 40

మ. ఉపరస్థుండు సుతుండు వాఁడును జిరాయుశ్శ్రీ యశస్సౌ
కుమార్యదయాధైర్యపరాక్రమంబుల జనారాధ్యుండు లోక
త్రయీ హ్లాదయాహ్లాదకరుండు నిక్క మని నిన్నే కాంత
దుర్గంబులో, బ్రతికింపఁగ మదిఁ గోరె భర్త యది దప్పం
జూడఁగాఁ బాడియే. 41

సీ. అనవుడు వారితోఁ బెనఁగుట కొల్లక
యప్పటి కోడఁబడి యర్ధరాత్ర
మందఱు నిద్రాపరాధీను లగుటయు
నంత సముత్థశోకానలంబు
సైరింపఁజాలక చపలవిలోచన
యచ్చోటు వెలువడి నల్ల నరిగి
యొకమానికొమ్మున నుద్బంధనముఁ జేసి
కొనియెదఁగాక యే నని గడంగి

తే. వరుని యరదంబు చిక్కినవంక దైవ
యోగమునఁ జేరి మదిఁ బతి నునిచి మగధ
నాథ! యే నీకు భావిజన్మములయందు
ధర్మచారిణి నై యుండుదాన ననుచు. 42

క. తనకట్టినపుట్టముకొం
గనుమానము లేక చించి యావృక్షముకొ
మ్మున నులిచి ముడిచి యురిలోఁ
జొనిపె మొగం బబల ప్రబలశోకముతోడన్. 43

వ. అంతకు మున్న పలితనీహారంబైన మారుతంబునోటునం
జెప్పిటియును బహువ్రణపరిస్రుతశోణితుం డై లావరుటం
జేసి లేవఁజాలకయున్న రాజహంసమహీవల్లభుం డయ్యవ
సరంబున. 44

క. తనసతి తనపై నెయ్యము
దనరఁగ జావునకుఁ దెగుట తనచెవులారన్
విని తాన మెట్టుకేసియు
వనితా! యీసాహసంబు వల దని పలికెన్. 45

చ. పలికిన నుల్కిపాటు మదిఁబట్టుకొనంగ నెలుంగుదిక్కు చూ
డ్కులు పచరించి యాత్మపతిఘోషము చందము కారణంబు
గాఁ, దలఁకక డాయఁబోయి విదితంబుగఁ గాంచె రథంబు
మీఁద ని, ర్మలమణిమండనద్యుతినిరాకృతహంసుని రాజ
హంసునిన్. 46

క. కని సంభ్రమించి నిజపరి
జనులకు నెఱిఁగించుటయును సచివులుఁ బ్రజయున్
జనుదెంచి చూచి యందఱు
ననురాగరసాబ్ధి నోలలాడిరి వేడ్కన్. 47

వ. అనంతరంబ. 48

చ. జనపతి నెత్తి తెచ్చి మృదుశయ్యపయిన్ ముదమొంద
నుంచి నే, ర్పునఁ దనుసక్తశల్యములు వుచ్చి ముఖస్థితుఁ జేసి
యాత్మప, ర్తనములు చెప్పి మంత్రు లనురాగముతోఁ బతిఁ
జూచి దేవ! యీ,వనమున కెట్లు దెచ్చె రథవాజులు సారథి
లేక చీఁకటిన్. 49

చ. అనిన మహీశుఁ డిట్లనియె నాలములోపల మాళవుండవై, చినగవ మూర్ఛితాకృతిగఁ జేసితిఁ దీవ్రశరంబు లేసి య త్తునియలు వచ్చి నాతు వెసఁ ద్రుంచి మదంగములెల్ల నొంచినఁ, మనమరి మూర్ఛవోయితిఁ గ్రమంబున నివ్విధ సేదదీఱితిన్. 50

క. తేఱినయవసరమున నీ
కాఱడవిం గాంత యెలుఁగు కరుణాస్పదమై
మీఱి చెవి సోఁకుటయు నవ
లాఱఁగ నేఁ బలికితిం బ్రయత్నముతోడన్. 51

తే. అరుగుదెంచిన తెఱఁ గిట్టి దని యెఱుంగ
ననిన మంత్రులు కాంతలు నా ప్రజనులు
నఘటమానవిధాయకుం డగు విధాతఁ
బొగడి రానంద మాత్మ నుప్పొంగుచుండ. 52

క. కతిపయదినములకు మహీ
పతి యంగక్షతము లుడిపి భరమైన మనః
క్షత ముడుపఁ దలఁచి మంత్రిస
మితి యతనికి నిట్టు లనియె మితవాక్యములన్. 53

శా. దేవా! మున్ను సమస్తభూపతులలోఁ దేజోగరిష్ఠుండవై యీవింధ్యాచలమధ్యకాననమునం దిబ్బంగి నీయున్కి యుఁ, దైవాధీనము గాక దీనికి విషాదం బందఁగా నేల యం, భోవాహంబులయట్ల సంపద లొగిం బుట్టుఁ జెడుఁ మాత్రలోన్. 54

క. అని బోధించి పదంపడి
జనపతియుం బ్రజయుఁ దారు సకుటుంబముగాఁ

జని వామదేవుఁ డనియెడు
మునివరునిం గని మనఃప్రమోదం బెసఁగన్. 55

వ. తదీయాశ్రమంబునఁ గొండొకకాలంబు నిలిచి నిజమనో రథం బమ్మహామునివలన సఫలంబు గావించుకొనం దలంచి మంత్రివరులు నియోగింప విభుండు వినయావనతశిరస్కుం డై యతని కిట్లనియె. 56

చ. తప మొనరించి మాళవుఁడు దైవబలంబున నన్ను నోర్చి రాజ్యపదవిఁ దాను గైకొనియె నట్లన యేనును బూని చాల నుగ్రపుఁ దప మాచరించి రిపుగర్వ మడంపఁ దలంచి నేను నీ కృపఁ బడయంగ వచ్చితి నకిల్బిషమానస! తాప సోత్తమా!. 57

వ. అనినఁ గాలజ్ఞాని యగుటం జేసి భావిఫలం బెఱింగింపం దలం చి వామదేవుం డిట్లనియె. 58

క. ఆయాసంబుగఁ దపములు
సేయంగా నేల శత్రుజిద్బాహుఁడు దీ
ర్ఘాయుష్మంతుఁడు పుట్టెడు
ధీయుతుఁ డగు సుతుఁడు వసుమతీగర్భమునన్. 59

వ. అని యిట్లు చెప్పునవసరంబున మునివాక్యంబునందు సంశ యింప వలవదు వసుమతికి జన్మించిన పుత్రుండు సంప్రాప్త యౌవనుం డగుడు దిగ్విజయార్థం బరుగవలయు నది నీ కభ్యు దయనిమిత్తం బని యశరీరవాణి యంతరిక్షంబున నేతెంచిన ధరణీశ్వరుండు పరమానందంబునం బొందియున్న కొన్ని దినంబులకు శుభముహూర్తంబున నద్దేవికి సర్వలక్షణలక్షి

తాంగుం డగు సుపుత్త్రుం డుదయించి జాతకర్మాదిసంస్కా
రంబులఁ బ్రదీప్తుం డై రాజవాహనుం డనఁ బరఁగుచుండె
బదంపడి క్రమంబున నలువురుమంత్త్రులు కాంతిమంతు
లైన కొడుకుల నలువురం బడసిరి సుమతికొడుకునకుఁ
బ్రమతి యను నామంబును సుమిత్త్రుకొడుకునకు మిత్త్ర
గుప్తుం డను నామంబును సుమంతుకొడుకునకు మంత్త్రగు
ప్తుండను నామంబును సుశ్రుతుకొడుకునకు విశ్రుతుం డను
నామంబును గావించిన నక్కుమారుండును నయ్యమాత్య
పుత్త్రులును ననుదినప్రవర్ధమాను లగుచుండఁ గొండొక
కాలంబునకు. 60

క. ఒకనాఁ డొకముని యొకబా
లకుఁ దెచ్చినఁ జూచి వీనిలక్షణములు రా
జకుమారత్వముఁ దెలిపెడు
నకటా! నీ కెట్లు చేరె నని పతి యడిగెన్. 61

చ. అడిగిన నానృపాలకున కమ్ముని చెప్పె సమిత్కుశార్థ మే
నడవికి నేఁగి యొక్కయెడ నార్తరవంబు చెలంగుచుండఁ జే
డ్పడి పడియున్న కాంతఁ గని డాయఁగఁబోయి విపన్ని మిత్త
మే, ర్పడ నెఱిఁగింపు మీ వనిన భామిని యిట్లని వల్కె
వెక్కుచున్. 62

సీ. మేటిమగం డగు మిథిలాధిపుఁడు మగ
ధాధిపుతోడి సఖ్యమున నతని
నాతిసీమంతమునకుఁ బుత్త్రదారస
మేతంబు తత్పురి కేఁగి యచట

నున్నంత మాళవుం డుగ్రుఁడై మగధభూ
పతిమీఁద వచ్చిన బంధుభావ
మేర్పడఁ జంపాపురీశుండు సింహవ
ర్మయుఁ దాను మగధేశ్వరునకుఁ దోడు
తే. కడిమి నని సేసి సమరరంగమునఁ బడిన
మాళవేంద్రుఁడు గెల్చియు మహితబుద్ధి
ననిచిపుచ్చె నయ్యిరువురునందు సింహ
వర్మ చంపాపురంబునవలని కరిగె. 63

క. ఘనుఁ డగు ప్రహారవర్మ యుఁ
దనదేశంబునకు వనపథంబున నన్దై
చనుచో నెలుఁగులు దాఁకినఁ
గనుకని తత్పరిజనము వికావిక లయ్యెన్. 64

వ. అమ్మహీవల్లభునకుఁ గవలవారలగు కుమారులు గలరు వారలకు నన్నును నాకూఁతును దాదులంగా నియమించుటం జేసి వారికి సమస్తశరీరరక్షలు నేము నడపుచుండుదుము గావున. 65

క. ఆరాజనందనులఁ గడుఁ
గూరిమిమై *నదిమియెత్తికొని నడచు నెడన్
వారని కలకల మగుటయు
బోరన నే మధిపుపజ్జఁ బోవం బోవన్. 66

ఆ. అపుడు ధరణివిభుని యంతఃపురాంగనా
జనముఁ బొదివి యాప్తజనము కొంత

* దత్తిమి.

యొక్క దిక్కు తొలఁగ నొకభంగిఁ గొనిపోయి
రేటు దాఁకి నొచ్చి యేను బడితి. 67

క. ఆతఱి నుద్ధతుఁ డొక్కకి
రాతుఁడు చను దెంచి యధికరభసంబున నా
చేతికొడుకుఁ జేకొని య
య్యాతతగుల్మములలోనికై చనియె వడిన్. 68

క. తక్కటిబాలుఁడుఁ గూఁతురు
నెక్కడఁ బోవుటయు నెఱుఁగ నిది నాతెఱఁ గే
నొక్కతె నైనను విభుచను
చక్కటికై పోదు ననుచుఁ జనియె నరేంద్రా!. 69

వ. ఏనును భవత్సఖుం డగు ప్రహారవర్మకుఁ బాటిల్లిన యాప
దకు విషాదం బంది తదన్వయాంకురం బైన కుమారుని
రోయుతలంపున బోయ పోయినచొప్పునం బోయి యనతి
దూరంబునఁ జండికాగృహంబుసమీపంబున 70

సీ. చూఱ యెప్పుడు నిట్లు చొప్పడునట్లుగా
నీదేవతకు బలి యిత్త మనుచుఁ
దరుదీర్ఘతరశాఖఁ దలక్రిందుగాఁ గట్టి
వరుస నెల్లలువెట్టి వైత మనుచుఁ
బాదంబు లిసుకలోఁ బ్రాఁతి వెంపర సేసి
పటుసాయకముల పాల్పఱుత మనుచు
దవ్వుదవ్వులఁ బెట్టి తవిడి పాఱఁగఁ జూచి
వెసఁ గుక్కకూనల విడుత మనుచు

తే. బాలకునిఁ జంపఁ దలఁచుట పాప మనక
కోఱడంబున నొండొరుమీఱఁ బాఱి

వేతవేత యుపాయము ల్వెదకి వెదకి
కలయఁ బలుకు కిరాతులఁ గాంచి యచట. 71

క. పాలుఁడ ముడిసినవాఁడన్
గాఱడవిన్ దెరువు దప్పి గాదిలిసుతునిన్
జాఱకు నొప్పించితి నని
చీఱితి నెలుఁగెత్తి వారిచేరువఁ గలయన్. 72

క. పలుమఱు నీచందమునన్
బలవింపఁగ దైవగతిఁ గృపాతత్పరులై
పిలిచి కిరాతులు బాలకుఁ
జాలవక గొనివచ్చి నాకుఁ జూపి ముదమునన్. 73

తే. వీఁడు నీపుత్త్రుఁ డగునేని వెఱవవలదు
పుచ్చికొనిపొమ్ము నాపుడుఁ బూని వారిఁ
బలువిధంబుల దీవించి బాలుఁ దెచ్చి
శిశిరజలసేచనాదుల సేదదేర్చి. 74

వ. నీపాలికిఁ గొనివచ్చితి వీనికిఁ బితృభూతుండవు గావునఁ
జేకొని రక్షింపు మనిన రాజహంసమహీవల్లభుండు. 75

క. పరహితచరితులకు శుభం
బరుదే యను బుధుల పలుకు లమృతంబులు గా
వరయఁగ దైవము మత్సఖు
దురితమ్ములఁ బెట్టె ననుచు దురపిల్లి మదిన్. 76

వ. విపులవిషాదంబుఁ బొందియు నతనినందనుండు సేరుటకు
సంతసిల్లి యపహారవర్మ యను నామంబు గావించి. 77

క. బాలునిఁ గైకొని వసుమతి
పాలఁ బ్రియం బొంద నునిచి ప్రతిదివసము త

త్కేళీసందర్శనసుఖ
లాలసుఁ డై యుండె నిశ్చలప్రేమమునన్. 78

చ. జనపతి యొక్క పుణ్యదివసంబునఁ బావనతీర్థసేవనం
బున కని యేఁగుచో విపినభూమిఁ గిరాతులపల్లెప్రాంతఁ దా
ననుపమమూర్తిమంతు నొకయర్భకు నొక్కతె ముద్దు
లాడఁగాఁ, గనుఁగొని యంతరంగమునఁ గౌతుక మెంతయు
నగ్గలింపఁగన్. 79

క. మీఁబోటులచందము గాఁ
డీబాలుఁడు రుచిరమూర్తి యెవ్వరి తనయుం
డేబాసఁ జేరె ననపుడు
నాబోయతమగఁడు వినతుఁ డై యి ట్లనియెన్. 80

తే. ఆత్మ దేశంబు దెసకుఁ బ్రహారవర్మ
విపినపథమున నడవంగ వేచి తాఁకి
చూఱగొనుచుండి వీని నచ్చోట నొర్త
చేతఁ గొనితెచ్చి పెద్కఁ బెంచెద నరేంద్ర!. 81

వ. అనుటయు. 82

క. ముని చెప్పిన రెండవనృప
తనయునిఁగా నెఱిఁగి సావధానమునఁ గిరా
తునిఁ బ్రీతుఁ జేసి బాలకుఁ
గొనివచ్చె మహీశ్వరుండు కూరిమివెలయన్. 83

వ. ఇట్లు తెచ్చి యుపహారవర్మ యని పేరుఁ బెట్టి వసుమతీ
దేవికి సమర్పించి యుపలాలించుచుండెఁ బదంపడి యొక్క
నాఁడు వామదేవుని శిష్యుండు సోమశర్ముఁ డను ముని

కుమారుం డొక్కబాలకునిం గొనివచ్చి రాజునకుం జూపి
యిట్లనియె. 84

ఆ. ఏను రామతీర్థ మేఁగి క్రమ్మఱి వచ్చి
వచ్చి యొక మహోగ్రవనమునందు
నొక్కవనితచేత నుండంగ నుజ్జ్వలా
కారుఁడగు కుమారుఁ గని నయమున. 85

క. డాయం జని నీ వెవ్వతె
వీయర్భకు నెత్తికొని యహీనాటవిలో
నాయాసంబునఁ దిరుగుట
కేయది గత మనిన నదియు నిట్లని పలికెన్. 86

ఆ. కాలయవన మనఁగఁ గల దొకదీవి యం
దనఘ! కాలగుప్తుఁ డనఁ బ్రసిద్ధ
వైశ్యవరుఁడు గలఁడు వానికి గాదిలి
తనయయగు సువృత్త దాది నేను. 87

సీ. తద్ద్వీపమునకు నేతద్ద్వీపముననుండి
మగధాధినాథుని మంత్రికొడుకు
రమణీయగుణనిధి రత్నోద్భవుం డను
వాఁడు బేహారంబువచ్చి నతని
కులశీలవిద్యలఁ గలపెంపునకు నియ్య
కొని తనకూఁతు నతనికిఁ బ్రీతిఁ
బరిణయ మొనరించి పరమసమ్మదముతో
నతఁ డాత్మసంపద కధిపుఁ జేసె
తే. నాలతాంగియు గర్భిణి యయ్యె నంత
సోదరులఁ జూచువేడ్క రత్నోద్భవుండు

మామ కెఱిఁగించి కౌతుకోన్మాదుఁ డగుచుఁ
గోమలియుఁ దానుఁ గల మెక్కి కుసుమపురికి. 88

శా. రారా నబ్ధిఁ గలంబు డిందుటయు గర్భశ్రీవిలాసంబునన్
గారామైన సుపుత్ర నెత్తికొని దుఃఖం బందుచుం జేరితిన్
దీరం బే నొకపట్టె తెప్ప గొని యీయాద్య గ్వేదనం బెంతకున్
వేరం బెత్తిన ఘాతచెయ్ది యుదుపన్ వె జ్జెవ్వఁ డూహింపఁగన్. 89

క. చెలులును రతోష్టద్భవుఁడును
జలనిధిలోఁ బడిరొ బ్రదికి చనిరో యెఱుఁగన్
బోలఁతి సుపుత్రయు నిడుమకుఁ
గొలువుగ నట్టడవిలోనఁ గొడుకుం గాంచెన్. 90

వ. కని యొకపాదరింటిలోనఁ బ్రసూతివేదనార్త యై యున్న నాతిం జూచి విజనంబగు విపినమధ్యంబున నిలుచుట యనుచితం బని జనపదంబున కరుగు తెరువు పరికింప నిట యరుగు దేరం దలంచి యబ్బాలకుని బరవసయైన తల్లికడ నునిచి వచ్చుట కర్జంబుగామి నెత్తికొనివచ్చితి. 91

సీ. అని తనవృత్తాంత మది చెప్పుచున్నచో
వచ్చె నచ్చోట కొక్కవనగజంబు
తదవన్యగజము రౌద్రస్ఫూర్తిఁ గనుఁగొని
భీతాత్మ యై తనచేతిబిడ్డఁ
బడవైచి యాయవ్వ కడు వేగమునఁ బాఱె
నేనును నొకపాదరిల్లు చొచ్చి
యొదిగి యద్దెసఁ జూచుచున్నంత బాలకుఁ
బల్లవకబలంబు పట్టుకొనిన

ఆ. కరణిఁ బట్టుకొనియె గజము తద్గజముపై
కంత నొక్కసింహ మాగ్రహమున
నులుకుటయును జూచి వెఱఁ గొంది యర్భకు
నెత్తివైచె దివికి మత్తగజము. 92

వ. తదవసరంబునఁ గుమారుని యాయుశ్శేషంబు పరిపాలింపం
బూనిన విధి యఘటమానసంధానచాతుర్యంబున. 93

క. ఆసన్నోన్నతతరుశా
ఖాసీనం బైన యొక్క యగచర మాహా
రాసక్తిఁ జేసి ఫల మని
డాసి పడంబడఁగఁ గరపుటంబునఁ బట్టెన్. 94

తే. పట్టి పండు గాకున్న నాపాదపంబు
పెద్ద తొఱ్ఱసందునఁ బెట్టిపోయె
బాలకుండును సత్త్వసంపన్నుఁ డగుటఁ
జేసి యెంతయు నొచ్చ నాయాసమునను. 95

ఉ. సామజవైరియున్ గజముఁ జంపుచు నెక్కడకేనిఁ బోయె
దే, జోమయుఁ డైన యాశిశువుఁ జూచి దయామతి నల్ల
డించి యే,నామకువన్ వనాంతమున నారసి కానక యేఁగు
దెంచి మ, త్స్వామికి వామదేవునకు సమ్మద మొందఁగఁ
జూపి యింతయున్. 96

క. చెప్పి మునివరునిపంపున
నిప్పుడు కడువేడ్కఁ దెచ్చి యిబ్బాలుని నీ
కొప్పించితి ననవుడు విధి
త్రిప్పుల కచ్చెరువుఁ బాటు దీటుకొనంగన్. 97

తే. అకట! రత్నోద్భవుం డిటు లగునె దైవ
మిట్లు సేయునె యని తనయిచ్చ దూర
వగచియును వానితనయుండు వచ్చి తన్నుఁ
జేరుటకు నెంతయును సంతసిల్లి విభుఁడు. 98

వ. అక్కుమారునిఁ గైకొని సుశ్రుతుని రావించి వీఁడు రత్నోద్భవతనయుం డని యతనికిం జూపి తద్వృత్తాంతం బంతయు నెఱింగించి వానికిఁ బుష్పోద్భవుం డని పేరుఁబెట్టి యొప్పించిన సుశ్రుతుండును దనమనంబున సవిస్మయవిషాదమోదంబులు ముప్పిరిగొన నగ్రజునందనుం గొని నిజమందిరంబునకుం జనియె మఱునాఁడు వసుమతీదేవి యొక్కబాలకుని నెత్తికొనివచ్చి తత్ప్రాప్తిప్రకారంబు దెలియ వల్లభున కిట్లనియె. 99

ఆ. చనినరేయి వీనిఁ గొనివచ్చి యొకదివ్య
*కాంత నన్ను మేలుకాంచి చేరి
యతివినీత యగుచు నత్తఱి నచ్చెరు
వంద నాకు నిట్టు లనియెఁ బ్రీతి. 100

ఉ. ఏ నొక యక్షకామిని నహీనదయాపరతంత్ర యక్షనా
థానుమతంబునం దగ మదాత్మజుఁ దెచ్చితి నీతనూజుఁ దే
జోనిధి రాజవాహను విశుద్ధయశోనిధిఁ జేర్చి మన్పు మం
భోనిధివేష్టితక్షితివిభుత్వ మతండు వహించు నిమ్మెయిన్. 101

వ. నాపేరు తారావళి నీప్రెగ్గడ ధర్మపాలునినందనుండు కామపాలుండు మదీయవల్లభుం డని చెప్పి చనియె ననవుడు. 102

---

* లలన నన్ను మేలుకొల్పి చేరి.

ఆ. కామపాలుఁ డేమికారణమున యక్షి
యొందు గాంచెనొక్క పుత్రు మనలఁ
జేర్పఁ దనవిభుండు చెప్పుట యాకాశ
వాణిపలుకు నిక్కువంబు సేసె. 103

క. అనుచు సుమిత్రుని బిలువం
బనిచి మహీవిభుఁడు వదనపద్మ మలర నీ
యనుజన్ముని తనయుఁడు వీఁ
డనినఁ విని యాత్మ విస్మయం బడరంగన్. 104

వ. సుమిత్రుండును నిది యేమివివరం బని యడిగిన వసుమతీ
దేవివలనఁ దారావళిపలుకులు విని యనుజుం డనపాయుం
డై యునికికిఁ దత్ప్రాప్తికి మనంబున నుబ్బుచు. 105

క. జనపాలుఁ డర్థపాలుం
డను నామము పెట్టి తగ సమర్పింపఁగఁ దాఁ
గొనిపోయె ననుజుతనుజుం
గనుఁగవ నానందబాష్పకణములు దొరుఁగన్. 106

వ. మఱునాఁడు వామదేవశిష్యుండు కీర్తిదేవుం డను నొక్క
విప్రుఁ డొక్కపాపనిఁ దెచ్చి చూపి భూపతి కిచ్చి యి ట్ల
నియె నేను దీర్ఘయాత్రఁబోయి కావేరీతీరంబున నిక్కుమా
రుని ముందటం బెట్టుకొని యొక్కవృద్ధాంగన యేడ్చు
చున్నం గని నీ వెవ్వతె విబ్బాలుఁడు నీ కేమగు నేల
యేడ్చె దనిన నదియును. 107

ఆ. రోదనంబు దక్కి యాదరవృత్తిఁ గం
దోయి కరయుగమునఁ దుడిచి నన్నుఁ

జూచి తనమనంబుశోక మే నార్తునో
యని తలంచి యిట్టు లనియె నాకు. 108

ఆ. మగధవిభుని మంత్రి మతిశర్మ యాతని
పెద్దకొడుకు సుమతి పిన్నకొడుకు
సత్యశర్మ వాఁడు సద్వృత్తిమెయి నిటఁ
దీర్థయాత్ర యరుగుదెంచి ప్రీతి. 109

సీ. అతఁ డర్థిమై నొకయగ్రహారంబునఁ
గాళి నాఁ బరఁగిన కాంతఁ బెండ్లి
యై యపత్యం బెడయైనఁ దత్సోదరి
గౌరి వివాహమై గౌరవమున
సుతుఁ గాంచె నేనుఁ దత్సుతునకు దాదినై
యున్న నాకాళియు నురక నొక్క
నెపమునఁ దెచ్చి యీనిండారునీటిలో
బాలునితో నన్నుఁ బట్టిత్రోచె

తే. నేను నొకచేత బాలుని నెత్తిపట్టి
నొక్కచే నీఁదుచున్నంత నొయ్యఁ జేరె
దైవవశమున నొకమ్రాను దాని నమరఁ
బట్టికొని తత్తఱంబున బాలు నిడితి. 110

క. పిడు గడిచినవానిఁ గొఱవి
వడిఁ జూఁడినగతి నవస్థపడి పోవం బై
నదరి యొకకాలసర్పము
గడగడవడఁకంగ నన్నుఁ గఱచెం బెలుచన్. 111

క. నాపట్టిన ధరణీరుహ
మీూపాదలం జేరెఁ దీర మేఁ జేరితి ను

ద్దీపించె విషము కావఁగఁ
బాపకు వెసలేమి నేడ్పు వాటిలెఁ గొడుకా!. 112

వ. అని చెప్పి విషమవిషజ్వలనజ్వాలాసమాలీఢంబులైన యంగంబు లంతరంగంబునకుం దలకొన *నలవిగామి కారణంబుగా ధారుణిం బడి మూర్ఛవోయిన ముదుసలిం జూచి యపాస్తాంతరంగంబున మంత్రక్రియ మగుడింపం దొడంగి శక్యంబు గాకున్నం బోయి యౌషధవిశేషంబున నైనను దీర్తు ననునాసం దత్సమీపతరుగుల్మంబులం గ్రుమ్మరి క్రమ్మఱి వచ్చునంత నయ్యంతి యుత్క్రాంతజీవిత యగుటయు భవదమాత్యనందనుండగు సత్యశర్మ యపత్యం బగతికం బగుటకు శోకించి యయ్యవ్వచేత నతనివృత్తాంతంబు వినునపు డొక్క యగ్రహారం బనుమాత్రంబె కాని తెలియ వినంబడక మున్న యది మూర్ఛిలుటం జేసి తదన్వేషణాశావిముఖుండనై యన్నియు సంస్కరించి పీఁడు మీకు రక్షణీయుండను బుద్ధిమెయిం గొనివచ్చి నిన్నుఁ జేర్చితి ననిన విని కొండొక తడవు వగఁ జెంది. 113

క. మనసత్యశర్మ పొగడఁగ
వినియుండియుఁ దేటపడఁగ వినఁగానమ యిం
క నతనివలని విషాదము
మనమున నిడనేల యనుచు మానవపతియున్. 114

వ. తదగ్రజుండైన సుమతి రావించి యంతయు నెఱింగించి కుమారునకు సోమదత్తుం డను పేరు పెట్టి యతనికి సమర్పించిన నాతండును దమ్ముండు దన్నుఁ జేరినంతయు సంత

* రింప నిలువ.

సిల్లి కొనిపోయె నిత్తెఱంగునం బ్రాదుర్భావంబునొందిన పదుండ్రు కుమారులు శైశవక్రీడలు సలుపుచుం బెరిఁగి క్రమంబునఁ జౌలోపనయనాదిసంస్కారంబులు వడసిరి తద నంతరంబ. 115

సీ. వేదంబు వాదంబు వీణాదివాద్యంబు
లాలేఖ్యకర్మంబు లాగమములు
మంత్రతంత్రంబులు మందులు మాయలు
సింధురగంధర్వశిక్షణములు
జూదంబు ముచ్చిమి జోస్యంబు గానంబు
ధర్మార్థకామశాస్త్రములు కవిత
కావ్యనాటకములు కథలు పురాణంబు
లాయుధనైపుణ మంజనంబు
తే. నాదిగా నన్నివిద్యలు నన్ని *కళలు
నభ్యసించిరి యౌవన మలరె నిట్టు
లక్కుమారులఁ గనుఁగొని యవ్విభుండు
సమ్మదాంబుధిలోఁ దేలి సలుపుచుండె. 116

వ. అట్టిసమయంబున నొక్కనాఁడు. 117

శా. పారావారపరీతవిశ్వవసుధాభాగంబునం గీర్తి కా
ధారం బై వెలుఁగొందువాఁ డతులసత్యత్యాగశీలంబులం
బారీణుండు విరించివంశవనధిప్రాలేయభానుండు దు
ర్వారాంధఃపరిపంథివర్గనిబిడప్రాలేయభానుం డిలన్. 118

క. ధీరుఁడు కవీంద్రలోకా
ధారుఁడు సకలాగమార్థతత్త్వవిచారో

* కథలు.

దారుఁడు విస్ఫారయశో
హారుఁడు సుజనాభినందితాకారుఁ డిలన్. 119

మాలిని. అతులశుభచరిత్రుం డన్వయాంభోజమిత్రుం
డితరసచివదాత్రుం డిద్ధలక్ష్మీకళత్రుం
డతిదినకరతేజుం డన్యమాంబాతనూజుం
డతనుగుణసమాజుం డార్యభోజుండు ధాత్రిన్. 120

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలసదభినవదండి నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార చరితం బను మహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

---

# తృతీయాశ్వాసము.

---

శ్రీరమణుఁడు దానపయో
ధారా*ఫలవితతవిప్రధాత్రీజుఁడు నీ
రేరుహభవవంశాగ్రణి
ధీరగుణాన్వితుఁడు మంత్రితిక్కం డెలమిన్. 1

మ. మునినాథుండగు వామదేవుఁడు మనోమోదంబుతో వచ్చి
యమ్మనుజాధీశుఁ డొనర్చు నర్చనల నాత్మప్రీతి సంధిల్ల వా
రనిభక్తిం దగఁ జాఁగి మ్రొక్కిన కుమారవ్రాతముం
జూచి దీవన లిచ్చె నమితసత్యాహ్లాద్యవికసద్వాక్యమ్ములం
గూర్మితోన్. 2

వ. దీవించి వారల నెత్తి కౌఁగిలించుకొని మూర్ధఘ్రాణంబు సేసి మగధపతి మొగంబుఁ జూచి భవదభిమతంబు సాఫల్యోన్ముఖం బగునట్లుం గుమారునకు యౌవనం బయ్యె దివ్యవాగుపదేశవిధేయంబగు దిగ్విజయం బతని కిది సమయంబు సంశయంబు దక్కి సహచరవర్గంబుతో నిరర్గళప్రసారంబుగా ననిచిపుచ్చుము వీర లమానుషప్రభావులగుట నాకుఁ దెల్లంబు గావున నప్రతిహతులై యభ్యుదయంబు పొందుదు రనిన విని రాజహంసమహీవల్లభుండు తానును దేవియు దైవవచనాశ్వాసంబును నూఁది నందనునికి విజయప్రయాణంబు నిశ్చయించి యొక్కశుభదిన

---

* పల్లవిత.

మునందుఁ బుణ్యోదయంబున నతనికి యువరాజ్యపట్టంబు గట్టి తక్కినకుమారుల సచివుల రావించి వారలకు వలయు బుద్ధు లుపదేశించి సముచితప్రకారంబుల వీడుకొలిపిన రాజవాహనాదికుమారదశకంబును శుభసూచకంబులగు నుత్తమనిమిత్తంబులును ననుకూలశకునంబులును జేకొనుచు వెలువడి వింధ్యాటవీమధ్యంబునం జనుసమయంబున.

సీ. నిధిసాధనక్రియానిమ్నోన్నతం బైన
ప్రాంతపట్టణమునఁ బాడువోలెఁ
కాలాయసమున నంగములు గావించిన
ప్రాణంబువచ్చిన ప్రతిమవోలెఁ
దోండమ్ము కొమ్ములు తునియ వ్రేటులుపడి
కొదపడ్డ యేనుఁగుకొదమవోలె
డాంబికవిప్రవిడంబనం బొనరింపఁ
బూనిన యొఱపిఁడిబోయవోలె

తే. మేనఁ బోటుగంట్లెంతయు మిక్కుటముగ
నల్లనై తుండుపడి బ్రాహ్మణత్వమునకుఁ
దావలంబైన వెడజన్నిదములు దాల్చి
యున్న యొక్కనిఁ గాంచె నమ్మన్నుఱేఁడు. 4

క. కని యతనిచేతఁ బూజలు
గొని జనపతి యనియె నిట్లు ఘోరాటవిలో
జనసంగరహిత మగు నీ
యునికికిఁ గత మేమి భూసురోత్తమ! చెపుమా. 5

వ. అదియునుంగాక. 6

క. జందెముల బ్రాహ్మణత్వము
చందంబున బోయతనము శస్త్రాహతిఁ బో
ల్పొందఁగ రాచటికము నీ
యందొక్కటిఁ దోఁచుచున్నయది తలపోయన్. 7

వ. అని యడిగిన యమ్మహీపతిమహానుభావంబు లుపలక్షించి నిజాంతర్గతంబున నితండు కేవలమర్త్యుండు గాఁ డనుచుఁ దత్సహచరవర్గంబువలనఁ దదీయజననాభిధానంబు లెఱింగి యతనికిం దనవృత్తాంతంబు లెఱింగింపం దలంచి యవ్విప్రుండు సవినయంబుగా ని ట్లనియె. 8

సీ. చదువులు విడిచి యాచారంబు దిగఁద్రావి
ధర్మువు చెఱచి సత్యంబు మఱచి
మొగమోట తెగఁజూచి తగవు దూరము సేసి
కులము గీటునఁబుచ్చి వలను దప్పి
శౌచంబు వదలి విశ్వాసంబు మొఱఁగి తా
లిమి మాలి పెద్దఱికము దొఱంగి
దయ పిఱిందికి వైచి నయము క్రుమ్మఁడగించి
బాంధవం బురివి పాపమునఁ బొదలి
తే. యెఱుకులకు నొజ్జలై వారియిండ్లఁ గుడిచి
కొలిచి దీవించి యించుక వెలికి బోయ
లనఁగఁ బరఁగిన పాటు లియ్యడవిలోన
నెన్నఁ బెక్కండ్రు గలరు ధాత్రీశతిలక!. 9

క. అం దొకవిప్రుని కూరిమి
నందనుఁడఁ బుళిందరాజనామమువాఁడ౯

నిందాపాత్రచరిత్రుఁడ
మందుఁడఁ జే రడిగెద్దేని మాతంగకుఁడన్. 10

చ. ఎఱుకులఁ గూడి భూములకు నేఁగుచు నూళ్ళను జొచ్చి
వ్రేల్మిడిం, బఱిపఱి సేయుచుణ్ సతుల బాలుర నేపునఁ బట్టి
తెచ్చుచుణ్, జెఱ నిడి దండువుల్ గొనుచుఁ జెట్టలపుట్టి
యితండు నాఁగ నే, గొఱకుఁదనంబుమీఱి ధరఁ గ్రుమ్మరు
చుండుదు నెల్లకాలమున్. 11

క. ఒకనాఁ డొకమునిపాఱుని
నొకచో నాతోడిబోయ లొలిచికొనంగా
నకటా! తగ దని పలికిన
మొకమోడక నన్ను బన్నములఁ బఱచి రొగిన్. 12

క. వారలు పలికినపలుకులు
సైరింపక తొడరి యస్త్రశస్త్రప్రౌఢిన్
బోరి తదీయప్రహారణ
పారంపర్యమున మూర్ఛ పాటిల్లుటయున్. 13

ఆ. ప్రేతపురికి నరిగి పేరోలగంబున
నున్న జముని కెఱఁగి యున్న నన్నుఁ
నతఁడు దెలియఁ జూచి యాసభలోనికిఁ
బ్రీతిఁ జిత్రగుప్తుఁ బిలువఁబంచి. 14

వ. వీనికి నిది యపమృత్యువుగాని కాలమృత్యువు గాదు వీఁడు దుర్వర్తనుం డయ్యును విప్రార్థంబుగాఁ బ్రాణంబు విడుచుటం జేసి పాపంబులు నీఁగికొనియెం గావునఁ బదంపడి శరీరంబు విడిచినను నరకావాసంబు లే దైనను నిటమీఁద

ధర్మరుచి పుట్టవలయు దుష్కర్ములు పడుపాట్లు చూపి మరలఁ
ద్రోపు మనినఁ గొనిపోయి చూపునప్పుడు. 15

సీ. ఎట్టిఁగాఁ గాఁగిన యినుపకంబములతోఁ
గట్టినఁ గమగమఁ గమరువారిఁ
గ్రాఁగిన వెడఁదమంగలములఁ బొరఁటినఁ
బెల్లునఁ బెరపెరఁ బ్రేలువారిఁ
గండలు దిగఁజెక్కి గంట్లను గొఱవులఁ
జూఁడినఁ జుఱ్ఱుచుఱ స్రుక్కువారి
గుదియలు గైకొని గుండెలు ఝల్లంగ
మోఁదిన మురమర ములుగువారి

తే. ముడియకట్టలక్రియఁ గట్టువడినవారి
నోలిఁ దలక్రిందుగా వ్రేలుచున్నవారిఁ
జూపి దుర్వర్తనములకుఁ జొఱకు మనుచుఁ
జిత్రగుప్తుండు బుద్ధులు చెప్పి పుచ్చె. 16

వ. ఏనునుం బ్రాప్తశరీరుండ నై యిమ్మహాటవిమధ్యంబున. 17

క. ఒడ లెఱిఁగియు బలహీనతఁ
బడియుండిన విప్రవరుఁడు బాసటమై నా
కడ నిల్చె నంత నట యేఁ
బడిన తెఱం గెల్ల వినుచుఁ బాయనివగలన్. 18

వ. మాతల్లిదండ్రులు వచ్చి న న్నెత్తికొనిపోవు నెడ నాబ్రా
హ్మణుండు కృతంబు విచారించి తోడనె చనుదెంచి ప్రాణ
నిరోపణం బగునంతకు నిలిచి క్రమంబున. 19

ఉ. అక్షరశిక్షఁ జేసి వివిధాగమతంత్రము లొప్పఁ జెప్పి దో
షక్షయకారణంబు లగు సచ్చరితంబులత్రోవఁ జూపి నూ

క్షేత్రక్షణగోచరుం డయిన యీశ్వరుచందముఁ దెల్పి సత్క్రి
యాదక్షత నాకు నూల్కొలిపి తా నరిగెన్ ముదితాంత
రంగుఁ డై. 20

ఉ. ఏనును నాదుబాంధవుల నెవ్వరి మెచ్చక పాసివచ్చి యీ
కాననభూమిలోనఁ ద్రిజగద్గురుఁ జంద్రకళావతంసుఁ జే
తోనళినంబునం దిడి విఘాతకళంకుఁడ నై వసించెదన్
మానవనాథ! యిట్టిది క్రమం బని యేర్పడఁ జెప్పి వెం
డియున్. 21

క. పతిఁ *బాయఁ బిలిచి యతఁ డే
కతమున నిట్లనియె నేఁడు కలలో గౌరీ
పతి నాకు సన్నిహితుఁ డై
హితుఁడగు బాంధవుఁడువోలె నిట్లని పలికెన్. 22

సీ. దండకారణ్యమధ్యంబునం బాటిన
సెలయేటిదరిఁ బ్రతిష్ఠించియున్న
పటికంపులింగంపుఁ బడమటిదెస సమం
చితగిరిజాపదచిహ్నమైన
శిలక్రేవఁ గల దొక్కబిల మందులో రెండు
సాధనతామ్రశాసనము లుండుఁ
జని చొచ్చి యిష్టశాసనవిధి సాధించి
పాతాళలోకాధిపతివి గమ్ము
తే. నీకుఁ దోడ్పడువాఁ డొక్కనృపకుమారుఁ
డెల్లి నేఁ డిందులకుఁ దాన యేఁగుదెంచు

* తెరఁ.

ననియెం దద్వచనమునకు ననుగుణముగ
నీవుం జనుదెంచి తీచటికి నెమ్మి వెలయ. 23

మ. అనినం బ్రీతమనస్కుండై నృపతి సాహాయ్యంబు గావింతు
నే, నని నిక్కంబుగం బల్కి యచ్చెలులం బాయం బెట్టి యా
రాత్రి తా, నును మాతంగకుండుం వన్యాంతమునకుం మో
దంబు సంధిల్లం బోయినం బ్రాభాతికవేళ నందఱును ధాత్రీ
శాగ్రణిం గానమిన్. 24

వ. విషణ్ణు లగుచుం గూడం బాఱి తత్ప్రదేశంబున నారసి విత
ర్కించి వివిధదేశంబుల వేర్వేఱ వెదకువారై తమకు
నందఱికిం బదంపడి గూడికొన నొక్కసంకేతస్థానంబుం జెప్పి
కొని బహుముఖంబుల నరిగి రంత నిక్కడ రాజవాహన
కుమారుండును మాతంగకుండును నీశ్వరోపదిష్టప్రకారం
బునం బరాజ్ఞాతంబైన బిలంబు సాధించి చొచ్చి శాసనంబులు
పరిగ్రహించిరి తదనంతరంబ. 25

సీ. పాతాళమునకు నిశ్చయమునం జని యొక్క
పురము చేరువ సరోవరము క్రేవ
శాసనక్రమమున సంభావితములైన
చారువస్తువులు ప్రసన్నబుద్ధి
వివిధవిఘ్నములకు వెఱవక యగ్నికుం
డంబున సిద్ధిహోమంబు సేసి
రక్షాకరుండగు రాజవాహనపతి
నూచి నెమ్మనమునం జోద్యమంద
తే. మంత్రపూర్వంబుగాం గ్రాలు మంటలోన
నుఱికి మాతంగకుండు విద్యుత్సమాన

కాంతి నుద్దీప్తగాత్రుఁ డై క్రమ్మఱంగ
వెడలె మహనీయముగఁ బుష్పవృష్టి కురిసె. 26

ఉ. అయ్యెడఁ గన్య యొక్కతె మహామణిమండనమండితాంగి
యై, నెయ్యపుఁబోటికత్తెలు వినీతగతిం జనుదేఱఁ బ్రీతితో,
నొయ్యన వచ్చి కాను కని యొక్క లసన్మణి యిచ్చె విప్రుఁ
డుం, దొయ్యలిఁ జూచి యెవ్వతెవు తోయజలోచన! నీవు
నావుడున్. 27

వ. ఏను దానవేశ్వరుం డైన నముచికూఁతుర గాళి యను
దాన నమ్మహానుభావుం డీలోకం బేలుచుండుఁ దత్పరాక్ర
మాసహిష్ణుం డగు విష్ణుదేవు కారణంబున. 28

చ. అతఁడు నిజాంగనాసహిత మంతకుఁ గూడినఁ దద్వియోగ
సం,భృతమహనీయశోకమున బెగ్గల మందుచునున్న నన్ను
నూ,ర్జితకరుణార్ద్రచిత్తుఁ డొకసిద్ధవరేణ్యుఁడు చూచి పల్కె
ని,య్యతలముఁ జొచ్చి నీకుఁ బతి యై యొకమానవుఁ డేలు
నింతయున్. 29

మ. అనినం దద్వచనమ్ము నమ్మి మహనీయంబైన మోదంబుతో
ఘనశబ్దోన్ముఖచాతకంబుగతి నాకాంక్షించి నల్దిక్కులు౯
జనుచుం జూచుచునున్న చోట నమృతాసారాకృతి న్నీవు
తోఁ,చిన నేతెంచితి *నేఁడు భాగ్యమహిమం జేకూరె
నాకోరికల్. 30

తే. నాకు భర్తవు నీవ యీలోకమునకు
నీవ భర్తవు గైకొమ్ము నెమ్మి వెలయ

* నిండు.

ననిన మాతంగకుఁడు పతియనుమతమున
వనజలోచనఁ బ్రీతి వివాహమయ్యె. 31

వ. ఇత్తెఱంగున శరీరశుద్ధియు నుత్తమాంగనాసాంగత్యంబును రసాతలరాజ్యంబునుం బడసి మాతంగకుండు పరమానందంబునం బొంది రాజవాహననరవల్లభునకుఁ బ్రియం బెఱింగించి తానును సమ్మానినియు వివిధసంభాషనావిశేషంబులఁ దోషితుం జేయుచుండఁ గొండొకకాలంబున కవ్విభుండు చెలుల వంచించి వచ్చుటం జేసి తద్దర్శనకుతూహలంబునం బోవ సమకట్టి యిత్తెఱంగు వారల కెఱింగించిన నతండునుం దనకుఁ గాళి కానుక యిచ్చిన మాణిక్యంబు పరిభవక్షుత్పిపాసాదిక్లేశాపనోదం బగుట యవ్వనితవలన వినుటం జేసి యమ్మణిమానవేశ్వరున కొసంగం దలంచి తత్ప్రభావంబుపన్యసించి సకలరత్నంబులకును రాజు లొడయలు గావున దేవర దీనిఁ బరిగ్రహింపవలయు నని ప్రార్థించి యిచ్చి పాతాళభువనంబు వెలువడ ననిచి వీడ్కొని మరలె ధరణీశ్వరుండును సవితర్కంబుగా నొక్కరుండ యరిగి యెదురఁ బుష్పోద్భవుం గని సంభ్రమంబున గాఢాలింగనంబు సేసి యతని సవినయప్రణతి నాదరించి సమీపతరుచ్ఛాయాశీతలతలంబునందు నాసీనుం డై హర్షవికసితాననుం డగుచు ని ట్లనియె. 32

క. ఎఱిఁగినఁ బోనీ రని మిము
మొఱఁగి మహీసురవరార్థముగఁ బోయితి నం
దలు నా తెఱఁ గేమని మది
నెఱిఁగితి రెబ్భంగి నిశ్చయించితి రచటన్. 33

క. ఎట వోయిరి చెలు లందఱు
నిట నీ వేకతము యేల యేఁగెద వనినన్
నిటలతలంబున నంజలి
పుట మల్లన మోపి పలికెఁ బుష్పోద్భవుఁడున్. 34

తే. విప్రు వెంబడిఁ బడి నీవు వేడ్కఁ జనిన
తెఱఁ గెఱింగియుఁ బోయిన దిక్కు తెరువు
తెలియ నెఱుఁగమిఁ జెలు లెల్ల దెసలు గలయ
వెదక సమకట్టి కదలి వేర్వేఱఁ జనిరి. 35

వ. ఏనును. 36

ఉ. దేవ! భవద్వియోగవనధిం బడి దుఃఖపరంపరోగ్రవీ
చీవశవర్తినై తిరిగి చేడ్పడి యొక్కనగంబు నున్నత
గ్రావముక్రేవ సాంద్ర*శిశిరంబగు నీడను డాసియున్నచో
నావనజాతబాంధవుఁడు నంబరమధ్యముఁ బొందెన త్తఱిన్.

క. ముందట బట్టబయల మ
ధ్యందినగతిఁ గుఱుచలైన యంగంబులతో
నందంబై యొకమానిసి
చందంబున నీడ దోఁచె జగతీనాథా!. 38

ఉ. దానికిఁ జోద్యమంది విదితంబుగ నంబరవీథి నప్పుడే
నానన మెత్తి చూచునెడ నాకులవృత్తి రయంబుతోడ న
మ్మానవుఁ డొక్కరుండు ఘనమార్గమునం బడుచున్నఁ జేరి వే
వే నయ మొప్ప నాతని భువిం బడకుండఁగఁ బ్రీతిఁ బట్టితిన్.

క. అతఁడును ఘనపథపతనము
కతమున మూర్ఛిల్లి తెలిసి కన్నుఁగవ బాష్పా

వృత్తిఁ బొందఁగ ననుఁ గనుఁగొని
యతులితశోకాకులాత్ముఁడై యిట్లనియెన్. 40

తే. ప్రాణసమయైన సతిఁ బెడఁబాసి రోసి
యనఘ! భృగుపతనంబు సేయంగ నిట్లు
నేలఁ బడకుండ నన్ను నీ వేల పట్టి
తభిమతంబున కంతరాయంబు గాఁగ. 41

వ. అనిన నచ్చెరువంది యతని తెఱం గెఱుంగం దలంచి నీ వెవ్వం
డ వని యడిగి యి ట్లంటి. 42

క. సతి నెట్టిభంగిఁ బాసితి
సతిఁ బాసినమాత్రఁ జేసి చావునకుఁ దెగం
గత మేమి దీని నంతయు
వితతంబుగ నెఱుఁగఁ జెప్పవే వినవలతున్. 43

వ. అని యడిగిన నతం డి ట్లనియె. 44

క. ఘనుఁ డగు మగధేశ్వరునకు
ననుఁగై పద్మోద్భవాఖ్యుఁ డగు ప్రెగ్గడకుం
దనుజాతుఁడ రత్నోద్భవుఁ
డనువాఁడ వణిక్క్రియార్థ మంబుధిలోనన్. 45

క. ఓపి మును కాలయవన
ద్వీపమునకు నరిగి యొకసతిం బరిణయ మై
యాపాలఁతియు నేనును నీ
ద్వీపమునకు నరుగుదేఱ విధిచెద్దమునన్. 46

వ. తీరంబున కనతిదూరంబునం గలం బబ్ధిలోన *బిద్దంబగు
టయు నెట్టకేనియు మహార్ణవంబు దరిఁ జేరి నిజాంగనా

* నిర్భిన్న.

వియోగదుఃఖార్ణవంబునం దేలుచుం దిరుగ నొక్కసిద్ధునాదే
శంబ యాధారంబుగా షోడశవర్షంబులు గడపి దురవస్థ గడ
గానక సతీవియోగం బసహ్యం బగుటయు భృగుపతనంబు
సేసితి నని చెప్పం జెప్పం దనజనకుం డను నెఱుక పుట్టు
నవసరంబున. 47

క. సైరింపరాని శోకము
కారణముగ నాదుతనయ కాంతారములో
మారుతసఖుపాల్పడి యెడఁ
జూరే యనుపలుకు చెవులు సోఁకం బెలుచన్. 48

వ. ఏనును దయావిధేయచిత్తుండ నై నీ కెఱింగింపవలయు
కార్యంబు చాలం గల దంతకు రమ్మని యతని మొగంబు
గనుఁగొని. 49

చ. కరుణకుఁ బాత్రమై వినిచెఁ గాఱడవిన్ సతికాంత యి త్తెఱం
గరయుచ మంచు నద్దెసకు నాదటతోఁ జని యొక్కచో
భయం, కరహుతభుక్శిఖాముఖవిగాహనసాహసికత్వ మేర్ప
డం, గరములు మోడ్చియున్న యొకకాంతఁ గనుంగొని
సంభ్రమంబునన్. 50

క. అనలము సోరకుండఁగ న
వ్వనజాననఁ బట్టి వృద్ధవనితాసహితం
బొనరఁగ బోధించుచు మ
జ్జనకుని డాయంగఁ దెచ్చి సవిషాదమునన్. 51

వ. ఇట్లేకాంతంబునం గాంతారంబులో దురంతం బైన యవస్థాం
తరంబుం బొందుటకుఁ గతం బేమి నీ వెవ్వర వనిన నయ్యవ్వ
యి ట్లనియెఁ గాలయవనం బను దీవియందుం గాలగుప్తుం

డను సెట్టికిం బుట్టి సుపుత్ర యనం బరఁగి యీకాంత నిజ
కాంతుండైన రత్నోద్భవుం డను మగధరాజామాత్య
పుత్త్రుండు తోడు తేఱంగలం బెక్కి వచ్చునెడ నేను నీతన్వి
దాసింగాపునం దోడన వచ్చితిం గలంబు బిద్దంబైన నంద
ఱుం గనుకని మునింగిన నాసన్నప్రసవయైన యి త్తరుణి
యేనును దైవయోగంబున నొక్కపట్టె పట్టికొని తీరంబు
సేరితిమి మందభాగ్యయైన యిక్కోమలి కొడుకుం గాం
చిన వాఁడును గోలుమృగంబుల పాల్పడుటయుం బరిభ్ర
మించుచుండి షోడశవర్షాంతరంబునం బుత్త్రసమాగమం
బగు నను నొక్కసిద్ధవచనంబు విశ్వసించి ప్రాణంబులు వట్టి
యల్లపుణ్యాశ్రమంబున నొక్కయుటజంబున వసియించియు
న్నంత నదియును నసత్యం బగుటయు శోకోద్రేకంబున నిలు
పోపక యనలంబు సొర నుద్యుక్త యయ్యె నన నప్పుడు మా
తల్లిం యగుట యెఱింగితిఁ దండ్రి యాందాదిమాటకుం జెవి
యొగ్గి చెదరినచిత్తంబు కూడంబడ నచ్చెరువడి యుపలక్షిం
చుచు నుండె నేను మదీయశైశవప్రకారంబులు జనముఖం
బునను విను తెఱంగు సెప్పి జనకుం జూపి వారలకుం దద్వ
ర్తనంబును దెలిపి యివ్విధంబున మాయంతవట్టును బ్రత్యభి
జ్ఞానంబుగా నొండొరు లెఱింగికొనిన యనంతరంబ రాజ
హంసమహీవల్లభు రాజ్యభ్రంశంబును భవదీయజన్మంబును
సకలసచివకుమారప్రాప్తియు దివ్యవాగుపదేశంబున దేవర
దిగ్విజయార్థంబు వెలువడుటయు మనము గనుకనిం జనిన
కారణంబును సవిస్తరంబుగాఁ దేటపడం బలికి నిన్ను నన్వే
షించుటయ పరమకార్యంబుగా నిశ్చయించి మజ్జనని

వాసంబున కరిగి యందు సర్వార్థసిద్ధినిమిత్తంబు విత్తంబ కా
విచారించి. 52

సీ. భవదనుగ్రహమునఁ బడసిన సాధక
త్వమునకు సత్క్రియాదక్షు లైన
శిష్యుల నవరించి సిద్ధాంజనము గూర్చి
కొని వింధ్యవనమధ్యమునకు నరిగి
పాడుపోళ్ళ[1]ం జొచ్చి బహువిధనిధిసూచ
కము[2]లకు ధరణీరుహములవలనఁ
గందువ లెఱిఁగి రక్షకులఁ గొంచఱఁ జేసి
[3]కొందఱు తోడుగా గుద్దలించి
తే. పెన్నిధులు గాంచి [4]వెరవునఁ బెల్లగించి
కోటిసంఖ్యలమాడలు గూడఁబోయు
నవసరంబున నొక్కసా తరుగు దెంచి
రవము మిగులంగ ననతిదూరమున విడిసె. 53

ఆ. అందులోనఁ [5]జేరు నలవడ్డయెడ్లనుఁ
దడవి విలిచి తెచ్చి ధనము వట్టి
యొండునరకు వేర నుగ్గడించుచు నల్లఁ
జేరి నేర్పుగలుగువారిఁ గలసి. 54

క. ఆపీటికిఁ బతియును సం
భావితుఁడును నైన చంద్రపాలుఁడు మిత్రుం
డై వేడుకతోఁ దోకొని
పోవఁగ నుజ్జయిని కేను బోయితిఁ బ్రీతిన్. 55

1 వసించి. 2 లగుఫలభూ. 3 గొండలుపిండిగా. 4 వఱపున. 5 బండి
కలవడ్డ.

క. సజ్జన తోఁ గొని రమ్మని
బుజ్జగమున నొక్కశిష్యుఁ బుచ్చిన వాఁడుఁ
మజ్జననీజనకుల న
య్యుజ్జయినికిఁ దెచ్చి యం దనూనప్రీతిన్. 56

వ. అట్లున్న కొన్ని దినంబులకు. 57

ఆ. చంద్రపాలుతండ్రి సకలసద్గుణసిధి
బంధుపాలుఁ డనఁగఁ బరఁగువాఁడు
గారవమున రాజుఁ గాన్పించి నింపుగా
వించె మాకు నెమ్మి వెలయుచుండ. 58

ఉ. ఏనును బంధుపాలునకు నిష్టుఁడ నై మనవర్తనంబులుఁ
గాననభూమిలోన నిను గానక రోయఁగఁ బోయిపోయి యు
జ్జేనికిఁ జేరఁబోవుటయుఁ జెప్పి భవద్గతి యారయంగఁ బోఁ
బూనిన నాతఁ డిట్లనియెఁ బొచ్చెము లేని దయాగుణంబు
నన్. 59

ఆ. అంత మెఱుఁగ లేని యవనీతలం బెల్లఁ
గలయఁదిరుగ నలవిగాదు తిరిగి
కాన నలవిగాదు గాన [1]నీదగు మనో
గ్లాని మాను మతనిఁ గను తెఱంగు. 60

క. శకునజ్ఞానబలంబునఁ
బ్రకటంబుగ నెఱిఁగి నీకుఁ బ్రవ్యక్తముగా
సకలము నెఱిఁగించెద నని
యకుటిలుఁ డై పలికె మత్సహాయుం డగుటన్. 61

1 నా దెస.

చ. అతనివచోమృతంబు హృదయంబునకుం బ్రమదం బొన
ర్చినఁ, దదీయహాతురత్వ మెడ దప్పఁగఁ జూపి కరంబు
నెమ్మిమైఁ, బ్రతిదివసంబు నే నతనిపాలఁ జరింపుచునుండి
యొక్కనాఁ, డతనితనూజ రాజముఖి నాదటఁ జూచితి
బాలచంద్రికన్. 62

మ. సమదృష్టిన్ ననుఁ జూచి యచ్చెలువయున్ గారీరకంబైన
కం, బమునే మానసవృత్తి యంతయును విస్పష్టంబుగా
భావసం, గము నాచిత్తము చూఱగొలుకొన రాగవృత్తి
పుట్టించె నా, సుమనోబాణుఁడు నేయఁ జొచ్చెఁ జెలువం
జూతాంకురాస్త్రమ్ములన్. 63

వ. ఇట్లనోన్యజనితస్నేహంబునం దగిలి యమ్మానినియు నేనును
జతురనిగూఢచేష్టలం జిత్తవృత్తు లొండొరుల కెఱింగిం
పుచుఁ బొందు వడయు నుపాయంబుఁ దలపోయు చు
న్నంత నొక్కనాఁడు బంధుపాలుండు శకునజ్ఞానంబున భవ
ద్గతిఁ దెలియ సమకట్టి నిజగృహోపాంతవిహారవనమునకు
నన్నుం దోకొని యరిగి యొకవృక్షంబుక్రేవం బక్షిచేష్ట నిరీ
క్షించునెడ నుత్కంఠావినోదపరాయణుండ నై తత్ప్రదే
శంబునం గలయం దిరిగి యొక్కకొలనితీరంబునఁ జింతా
క్రాంత యై చిన్నవోయియున్న బాలచంద్రికం గని డాయం
జని సంభ్రమప్రేమలజ్జాకౌతుక మనోహరంబైన తదీయా
లోకనంబు ననుభవించి యమ్ముద్దియ మొగంబునఁ దోతెంచు
విషణ్ణభావంబు మదనజనితఖేదంబు గాకునికి నిరూపించి
కలరూ పెఱుంగం దలంచి చేరంబోయి నీవిన్నఁదనంబునకుం

గారణం బేమని యడిగిన నదియును మనస్సంగసంజాత
విస్రంభ యగుచు నిశ్శంక యై యిట్లనియె. 64

సీ. మును మానసారుండు మునిమి వాటిల్లినఁ
 దనతనూభవుఁ డగు దర్పసారు
నభిషిక్తుఁ జేసిన నతఁడు పదంపడి
 యేడుదీవులు తాన యేలఁ గోరి
తపమున కరిగె నాతనియాజ్ఞ వలఁ గొని
 మఱఁదులు చండవర్మయును దారు
వర్మయు ననువారు వసుధాతలం బెల్ల
 శాసింతు రివ్వు డాచండవర్మ

తే. మేటి యై కార్యబలమున మీఱియుండు
దారువర్మ దుష్పథమునఁ దగిలియుండు
నన్నకైనను మఱి మామకైనఁ బూని
వానికొలఁగామి మాన్పింప వసముగాదు. 65

వ. కావునఁ బరద్రవ్యాపహారణంబును బరదారదూషణంబును భూషణంబులుగాఁ బురంబు ముప్పెట్టు వెట్టుచుండు. 66

శా. నిన్నుం జూచిననాఁటఁ గోలె నధికస్నేహంబునం జేసి నా
కన్నుం జిత్తము నొండు చూడఁ దలఁపంగా నేర కిట్లున్న
చో, నన్నుం గోరుచు నున్నవాఁ డతఁడు కన్యాదూషణం
బెగ్గుగా, నెన్నం డెన్నఁడు నీదురంతదురితం బెప్పాట నే
నీఁగుదున్. 67

వ. అని నిజహృదయగతం బైన రాగోద్రేకంబును మనోరథ సిద్ధికిం బుట్టిన యంతరాయంబును సవిస్తరంబుగా నెఱిం గించి బాష్పపూరితనయన యై యున్న యన్నాతి నెట్టకే

నియు నూరార్చి దారువర్మం జంప నుపాయం బూహించి
యిట్లని పలికితి. 68

క. వనితా! యూఱడి నిలువుము
నిన్నుఁ గోరెడివానిఁ జంప నేర్తు భవద్వ
ర్తనమె యుపాయం బగు నీ
వనుమానము లేక నడువు మది యె ట్లనినన్. 69

సీ. బాలచంద్రికఁ బొంది పాయక జేతాళుఁ
డొకఁ డున్న వాఁడు వాఁడునికి తెలియ
నెవ్వరు నెఱుఁగ రే నెఱుఁగుదు నమ్ముగ్ధ
యాకారసంపద కాసనేసి
సంబంధయోగ్యుండు సాహసికుండు నై
చనుదెంచి యెవ్వఁడు జానుమీఁటె
యేకాంతగృహములో నేకసఖీసాక్షి
కముగ సల్లాపామృతమునఁ దేల్చి
ఆ. ప్రాణగోష్ఠములకుఁ బాసి తా వెలువడు
నతఁడ భర్త యమ్మృగాక్షి కనియె
నొక్కసిద్ధుఁ డని దృఢోక్తులఁ బూని మీ
వార లెప్పవలయు నూ రెఱుంగ. 70

చ. అనిశముఁ జెప్పఁ జెప్ప విని యాతఁ డెద[illegible] భయమంది
తాన ని, ల్చినఁ గడు మేలు క్రొవ్వునఁ జలింపక దీనికి నియ్యొ
కొన్న ని, ట్లనునది పర్వసార! వసుధాధిపు కూర్మిమఱందివై
ననీ,కనుచితమస్మదీయనిలయంబునసాహసవృత్తి చేయఁగన్.

క. వేయేటికి నీయింటికిఁ
దోయజముఖి నూ రెఱుంగఁ దోకొని చని దీ

ర్ఘాయుష్మంతుఁడ వై నన్
జేయుదము వివాహ మిష్టసిద్ధిగ నీకున్. 72

క. అనవుడు వాఁ డొడఁబడు నీ
వనుమానము లేక తద్గృహంబునకు ముదం
బున నరుగు మేను నీతోఁ
జనుదెంచెద బోటిక త్తెచందముతోడన్. 73

వ. చనుదెంచి యేకాంతగృహంబులోన వాని నగపడం బట్టి కొని ముష్టిజానుఘాతంబులం దెగఁ జూచి యెప్పటిసఖీ వేషంబున భవదనుగమనంబు సేసెద నిదియ వెరవు దీనికిం దగ నీవు లజ్జాభయంబు లుజ్జగించి భవదీయజననీజనక సహోదరులకు మనయన్యోన్యస్నేహంబు లెఱింగించి రత్నోద్భవుండు సంబంధయోగ్యుం డేని నిన్నుఁ బుష్పోద్భవున కీ నర్హుం బని వారల నియ్యకొలిపి దారువర్మ వలనఁ బుట్టునపాయంబును నీయుపాయంబునం దలంగ నాయియ్య కొనుటయుఁ జెప్పి తదనుమతిం బడసి నాకు మాఱుమాట సెప్పుటయు *మతివిక్రమం బప్రతిహతంబుగా నివ్విధంబు సేసి. 74

మ. తుది నే నిన్ను వివాహ మయ్యెద మదాంధుం గ్రూరకర్మో న్ముఖుం, బ్రిదులం బోవఁగనీక చంపుటయ తా బీరంబు ధర్మంబుని, ట్టిద కార్యస్థితి నిత్తెఱంగున న నీడెందంబునుం గన్న స, మ్మదపాత్రం బగు నంబుజాక్షి! యని యే మానంబు మానించితిన్. 75

---

* మదీయ.

వ. అదియును నాచెప్పిన యుపాయంబు గావింప నొడంబడి యరిగె నేనును బంధుపాలుం డున్న యెడకుం జని భవద్దర్శనంబు కతిపయదినాంతరమ్ముల సమకూరుట యతనిశకునజ్ఞానంబున నెఱింగి నిజగృహంబున కరిగితిఁ బదంపడి మదీయ వాక్యవాగురాపాశంబుల దారువర్మ దగులుటంజేసి బాలచంద్రిక వానియింటికిం బోవ సమకట్టి నా కెఱింగించి పుత్తెంచినఁ బరమానందంబు నొంది. 76

సీ. మట్టియ లుజ్జ్వలమణినూపురంబులు
మొలనూలు వస్త్రముల్ ముత్తియములు
కట్టుపడంబులు గట్టినూళ్లును సద్ద
సరితీఁగె మినుకులు సందిదండ
లంగుళీయకములు హారికంకణములు
చేకట్టుపాలెలు చెన్ను మెఱుఁగు
టాకులు సరిపెణ లాలక్తకము పూఁత
కాటుక తిలకంబు కమ్మపువ్వు
తే. లాదిగాఁ గల మేలిద్రవ్యముల నొప్పఁ
బసదనముఁ జేసి యుచితరూపంబుఁ దాల్చి
బాలచంద్రికబోఁటినై పజ్జ నరిగిఁ
దారువర్మని లోఁగిలి దఱియఁ జొచ్చి. 77

వ. తదీయవాసగృహద్వారమ్మున నిలిచి యెఱింగించి పుచ్చిన వాఁడును సంభ్రమంబున నెదురువచ్చి రాగాంధుఁ డగుటం జేసి యొండు దలంపక సిద్ధాదేశంబున కనుగుణముగాఁ దద్ద్వారోపాంతనివారితసమస్తపరివారుం డై మద్ద్వితీయం బైన బాలచంద్రికం దోకొని చనియె నయ్యవసరంబున. 78

క. బేతాళునికథ ముందర
భూతాక్రోశంబెగాఁగఁ బుట్టిన దానం
గౌతుకము పొంది పౌరులు
నేతెంచిరి దారువర్మయింటికిఁ గలయన్. 79

మ. ఎలమిం బొంది వివేకశూన్యమతి యై యేకాంతసౌధోపరి
స్థలభాగంబునఁ బాన్పు పైకిఁ జని రత్నప్రస్ఫురద్భూషణం
బులు వస్త్రంబులు పూఁతలుం దమలముం బుష్పంబులున్
లోనుగా, లలితద్రవ్యము లెల్ల నా కొసఁగ మేలం బాడు
చుం బ్రీతితోన్. 80

వ. అనంతరంబ. 81

తే. దారువర్మ రాగాంధుఁ డై తరుణిఁ గవియఁ
దివిరి పైఁబడఁ దలఁచినతివుట యెఱిఁగి
కదిసి వెసఁ ద్రెళ్ళఁ ద్రోచి మోఁకాల గుండె
గ్రుమ్మి చంపెతి లావు బీరంబు మెఱయ. 82

వ. ఇట్లు చంపి కలుషితచిత్తయగు బాలచంద్రిక నూఱడంబలికి వికలంబైన శృంగారమ్ము యథాపూర్వంబుగా నలవరించుకొని మందిరద్వారంబు వెలువడి యగ్గలంబగు బెగ్గలంబు భావించి. 83

శా. రండీ! రాజమఱంది నొక్కరుఁడు ఘోరస్ఫారగాత్రుండు
క్రూ, రుం డై చంపెడు బెట్టుగట్టి యని యాక్రోశించి యేఁ
బిల్చినం, దండంబై జను లెల్ల వచ్చి కని యుద్యద్బాష్పు
లై రేసి బ్ర, హ్మాండం బొక్కట మ్రోయ నేడ్చి రచటన్
హాహానినాదంబులన్. 84

వ. ఇట్లు రోదనంబు సేయుచు. 85

క. పోలదు సాహసరుచి యగు
టా లాండొకచోట లేదె యని చెప్పంగా
జేలతనంబున నీ జే
తాళునిపా ల్పడియె నితఁడు దైవము చెయిదిన్. 86

వ. అనుచు బహుప్రకారంబు లగు శోకాలాపంబులు సేయు చుండి రయ్యవసరమ్మున. 87

క. సందడిలోఁ బడి యిరువుర
ముం దత్క్షణమాత్ర నరిగి మోదం బలరన్
డెందమున నూఱడిల్లియుఁ
బొందెడుతలఁ పౌరు లెఱుంగఁ బోలకయుండన్. 88

వ. వర్తిలుచుండితిమి పదంపడి పౌరు లెల్ల నభ్యర్థించి సిద్ధాదేశంబు సేసినవాఁడనై తత్ప్రకారంబు నడపి బాలచంద్రికం బరిగ్రహించితి సముచితవ్యాపారంబులం గతిపయదినంబులు సనిన దేవరవలని తలంపు మనంబునం గదిరి బంధుపాలు శాకునికవచనంబుల నూఱడిల్లక యన్యు లెఱుంగకుండ నేఁడు పురంబు వెలువడివచ్చి యీాపృగ్విధంబైన యానందంబున కర్హుండ నైతి నని పుష్పోద్భవుండు తనవృత్తాంతంబు రాజహంసున కెఱింగించి. 89

క. చెలు లెటు చనుటయు నెఱుఁగక
తలపోఁతలల వాఁడు నృపుహృదయకమలము మి
క్కిలి యలరఁ దత్సహాయము
కలిమికి మొద లగుటఁ బ్రియము గదిరిన మదితోన్. 90

చ. మనసిజమూర్తి యానృపకుమారుఁడుఁ దాను నవంతికాపు

---

* లు పొందు.

రం, బునకు ముదంబుతోడఁ జని భూపతి వీఁ డని బంధుకోటి
క, ల్లన యెఱిఁగించి వర్తనములన్ బెఱలోకుల కెల్ల భూ
సురుం, డనుమతిఁ బుట్టఁ జేయుచు ముదం బెసఁగన్ విహా
రింపుచుండఁగన్. 91

ఆ. దంపతులకు నింపు పెంపార విరహుల
కంతరంగతాప మతిశయిల్ల
సకలజీవులకును సంప్రీతిగా మనో
హారి యగు వసంత మరుగుదెంచె. 92

ఉ. వేఁకువఁ గమ్మతెమ్మెరలు వీవఁగ మాపుల నెల్లిదంపుఁగా
రాకులపాటు డెందముల నాకులపా టొదవింపఁజొచ్చె
శో, భాకరపల్లవప్రచయ మంగజవహ్నిశిఖాసరూపతం
బైకొని వంతఁ జేసెఁ బథికప్రకరంబునకున్ వనంబునన్. 93

వ. తదవసరంబున. 94

క. మొగడలఁ బూవులఁ బూపల
నగణితసమ్యక్ఫలముల నభిరామం బై
జగతీజము లొప్పిదమున
మిగులఁగ భావజుని *క్రొవ్వు మిమ్మటు మయ్యెన్. 95

వ. ఇట్లతిరమణీయం బైన వసంతసమయంబున మానసారనందన
యగు నవంతిసుందరి యను కన్యక నగరోపాంతరమ్యారా
మంబున బాలచంద్రికాప్రభృతి సఖీజనసమేతంబుగాఁ జని
చూతపోతకచ్ఛాయాభిరామం బగు సికతాతలంబున విహ
రించుచున్న సమయంబునఁ దద్దర్శనకౌతుకంబున రాజవాహ

* ప్రోపు.

నుండు పుష్పోద్భవుండు తోడ రా మధుసహాయుండగు
పుష్పబాణుండునుంబోలెఁ దద్వనంబు సొత్తెంచి. 96

సీ. కీరంబులకు జన్మగృహమైన యెలమావి
  జొంపంబు లింపారఁ జూచిచూచి
పరపుష్టములకు నాస్పదమైన పున్నాగ
  ధరణీజరాజిలోఁ దిరిగితిరిగి
భ్రమరంబులకు నాటపట్టైన మాధవీ
  మండపంబులకడ మసలిమసలి
కలహంససమితికి నెలవైన విరిదమ్మి
  కొలఁకులకెలఁకుల నిలిచినిలిచి
తే. రమ్యకేళీవనాభ్యంతరమున సిట్టు
లల్లనల్లనఁ బోలయుచు నబల లున్న
కందువకు డాయఁ బోయినఁ గాంత లెల్లఁ
జూపువేఁదురు గొనిరి రాసుతుని జూచి. 97

క. శంకింపక రండని ముసు
సంకేతము సేసి బాలచంద్రిక చనుటఁ
బంకజముఖి డాయఁగ మీ
నాంకునిగతి రాజవాహనాంకుం డరిగెన్. 98

వ. తదవసరంబున. 99

క. ఆవిభుఁడు నాలతాంగియు
భావజు నంకములమాడ్కిఁ బటువీక్షణశ
స్త్రావిద్ధహృదయు లై నిజ
భావము నొండొరుల కెఱుకపఱచిరి ప్రీతిన్. 100

ఉ. ఎవ్వరినూను( డీత( డిత( డెందులవా( డిట వచ్చు టేమి
యో, యెవ్వరు నాకు నింతయును నేర్పడ( జెప్పెదువారు
పీనిపాం, దెవ్విధి( గాంతు నెచ్చెలికి నేమని చెప్పుదు
నొక్కొ పీని నం, చువ్విళులూరుచుండె వలితోత్పలలోచన
నెమ్మనంబునన్. 101

వ. అయ్యవసరంబున బాలచంద్రిక యయ్యిరువురచిత్తవృత్తు
లుపలక్షించి యత్తెఱఁగ కీతని తెఱం గెఱింగింప నిదియె
తఱి యని యూహించి జనసమాజసన్నిధి యగుట లోక
సామాన్యవచనమ్ముల( గాలోచితకార్యంబు నడపం దలంచి
యి ట్లనియె. 102

ఉ. విప్రకుమారు( డీత(డు ప్రవీణు(డు విద్యల( బల్కునేర్పు
మై,నప్రతిమాను( డాహవవిహారములందు సమర్థు( డాత్మ
శ,క్తిప్రకటీకృతిం గొఱలి దేశము లెల్ల( జరింపుచుండు(
బూ, జాప్రతిపత్తిపాత్రముగ( జాలెడువా(డు పయోజ
లోచనా!. 103

క. అనవుడు నవంతిసుందరి
యనురాగము పొంది సముచితాసన మిప్పిం
చిన రాజవాహను(డు నై
కొని పుష్పోద్భవు(డు( దాను( గూర్చుండె మదిన్. 104

వ. ఇత్తన్వి మదీయపూర్వజన్మపత్నియైన యజ్ఞావతి యగు(
గాని నా(డు దీనియందు నాచిత్తంబు దగులుటకు( గతం
బేమి యని వితర్కించి శాపసమయంబున నమ్ముని యను
గ్రహించిన జాతి[1]స్మరత్వంబు నాకును నమ్ముద్దియకును

1 స్మరణ.

నొక్క సమానంబు గావునం దత్కాలజనితవిశేషసూచకంబు
లగుమాటలాడి యీలేమ కలరూ పెఱుంగుదు నను నిశ్చ
యంబు పుట్టి యున్నంత. 105

తే. అయ్యెడకు వచ్చె నొక్కరాయంచ దాని
బాలచంద్రిక వేడ్కమైఁ బట్టఁ బోయె
జనవిభుండును నిది నాకు సమయ మనుచు
మగువ వారించెఁ గరవిభ్రమంబు మెఱయ. 106

వ. ఇట్లు వారించి యొక్కకలహంసవలన నొక్కరుండు వడిన
పాటు విను మని యి ట్లనియె. 107

చ జలరుహలోచనాత్మజుఁడు సాంబుఁడు దొల్లి వధూటి తో
డ రాఁ, గొలనికిఁ గేలికాంక్షఁ జని కోకనదప్రచయంబు
చేరువం, బొలయఁగ నొక్కయంచఁ గని బోరనఁ బట్టి
సరోజనాళతం, తుల గుదివెట్టి సంతసముతో మృగలోచన
మోము సూచుచున్. 108

క. మన [1]కగపడి యిప్పుడు దా
మునిక్రియ నిష్ఫలుఁగు ముచ్చముడిఁగినయది వేఁ
డినఁ దనకుం బోవచ్చునె
యని యుల్లస మాడె సస్మితాననుఁ డగుచున్. 109

వ. ఇ ట్లవమానించినఁ గోపించి యాహంస మనుష్యవచనమ్ముల
ని ట్లనియె. 110

క. ఏ నొకనైష్ఠికుఁడ నను
ష్ఠానపరత్వమున జలజషండములో నే

1 లం గని.

నానందించెద నను నవ
మానింపం దగునె రాజ్యమదమున నీకున్. 111

క. ఏపున నవమానింపుచు
నీపొలఁతికిఁ జూపిచూపి నిష్ఠురమతి వై
నాపాదంబులు గుదిచిన
పాపంబున విరహవహ్నిఁ బడు వివశుఁడ వై. 112

వ. అని శపియించిన సాంబుండు నిజజీవితేశ్వరిం బాయంజాలక విషణ్ణహృదయుం డై మహాభాగా! యెఱుంగక చేసితి సహింపు మని దండనమస్కారంబు సేసినం జూచి హంస కరుణించి యీజన్మంబున శాపఫలం బనుభవింపకుండునట్లుగా ననుగ్రహించితి నావచనంబమోఘం బగుటంజేసి యవశ్యంబు ననుభవింపవలయు నీ విం కొక జన్మంబున దేహాంతరగతయైన యిమ్మగువకు మగండవై మదీయచరణయుగళంబు నిగళితంబు గావించిన యీమహాపాతకం బుత్తరంబున మాసద్వయంబు నిగళితచరణుండ వై వియోగదుఃఖం బనుభవించి పదంపడి నిజాంగనాసహితుండ వై రాజ్యసుఖంబు లనుభవింపుమని వారియపరజన్మంబునకు జాతిస్మరత్వంబు దయసేసెం గావున మరాళంబుతోడి మేలంబు వల దని కథారూపంబున నిజపూర్వజన్మవృత్తాంతంబు సూచించిన రాజవాహను పలుకులు విని యవంతిసుందరియునుం దనపురాతనజన్మవృత్తాంతం బగుటం దెలిసి యితండు మత్పాణిగ్రహణవల్లభుండగు నని యుల్లంబు పల్లవింపం దన్నునతనికిం దెలుపం దలంచి యెఱుకపడ ని ట్లనియె. 113

క. యజ్ఞాపతి యనుపఁగఁ బతి
యాజ్ఞాపరిపాలనార్థ మటు సేయుట దా
నజ్ఞానమె మొగమోటమిఁ
బ్రాజ్ఞులు చేయుదురు సతులు పనిచినభంగిన్. 114

తే. అనిన విని రాజవాహనుం డాత్మలోన
నమ్మృగాక్షీపూర్వాభిధానమ్ము దొంటి
తనదు చరితంబు నెఱుఁగించెఁ దలఁప నిది మ
దీయవల్లభ యగుట సంశయము లేదు. 115

మ. అని మోహింపుచు నింతిఁ గన్గొనియెఁ ని ట్లన్యోన్యజన్మంబుఁ దా
మను జేశుండు నవంతిసుందరియుఁ బ్రేమవ్యక్తి సంధిల్ల నే
ర్పునఁ జెప్పంగ నెఱింగి కోర్కు లెసకంబుం బొంద నున్నంత
వచ్చె నవంతీశ్వరుదేవికూఁతుకడకుం జిత్తంబు రాగిల్లఁగాన్.

క. ఆసమయమున రహస్యము
గాసిం బడకుండ బుద్ధిగౌరవమున నా
రాసుతుని బాలచంద్రిక
చేసన్నలఁ దొలఁగఁ బంచెఁ జెలితోఁ గూడన్. 117

వ. ఆదేవియుం గూఁతుకడకుం జనుదెంచి తత్సఖీజనంబుల వివిధకేళీవినోదంబు లాచరించి కొండొకసేపునకు విహార విలోకనకుతూహలంబు సాలించి సపరివారమ్ముగా నమ్ముద్ది యం దోడ్కొని మందిరంబున కరుగుసమయంబున. 118

ఉ. తల్లిపిలుందఁ బోక యుచితం బని పోయెద దీన మన్మనో
వల్లభుఁ డెగ్గుగాఁ దలఁచి వారనికోపరసంబు నొందునో
యుల్లమునందు నాతగుల మూఁటెడిపోవునో యంచు నెం

తయుం, దల్లడ మంచెఁ బూర్ణహిమధామనిభానన నెమ్మ
నంబునన్. 119

క. మాటిడ నేరని కూరిమిఁ
గాటుకకన్నీరు దొరఁగఁగాఁ గోమలి ప
ల్గాటునుఁ బెడమరి చూచుచు
నేటికి నెదు రేఁదుమాడ్కి నింటికిఁ జనియెన్. 120

వ. చని కన్యాంతఃపురంబున బాలచంద్రికం గలపికొని తక్కటి
చెలుల వంచించి యచ్చెలియుం దానును నిజవల్లభువలని
మాటలాడునెడ నతనియన్వయనామధేయంబులు దాని
చేతం దెలియ విని సంతసిల్లి పూర్వజన్మదంపతీత్వంబు
హంసకథాప్రసంగంబున నొండొరులకుం దెలుపుట య
త్తెఱవ కెఱింగించి. 121

క. అనురూపరాగవర్ధిత
మనసిజసంతాప యగుచు మఱిఁగి వయస్యా
జను లెఱిఁగి తలరునట్లుగ
ననుదినమును మిగులవంత నలఁదురుచుండెన్. 122

మ. కనుజేటంబున గాటమైన హృదయగ్లానిఁ బయోజాస్య
యి, ట్లునికి న్నెచ్చెలు లిచ్చ నొచ్చి తమలో నూహించి
శీతక్రియల్, పొనరింపఁ సమకట్టి లేఁదలిరులం బుష్పం
బులం బూఁతలఁ, ఘనసారంబు మృణాలవల్లికలు వీఁకం
గూర్చి నెయ్యంబుతోన్. 123

సీ. దర్పకుఁ గర్పూరదళముల నిర్మించి
యెలమితో నర్చన లిచ్చువారు

నీహారజలముల నిండారుకుండలు
శిశిరగంధముల వాసించువారు
బిసతంతుపటము లింపెసలారఁ జంపన
ద్రవమున జొత్తిల్లఁ దడుపువారు
పువ్వుసెజ్జలును లేఁబొరల వీచోపులు
వెరవు పాటించి గావించువారు
ఆ. మలయమారుతంబు నెలమావిజొంపంబు
నమృతకరు వసంతు నళిచయంబు
చిలుకపిండు గోయిలలకును మొఱలిడు
వారు నైరి వీరు వారు ననక. 124
వ. మఱియును. 125
మ. చిలుకా! పల్కకుమీ లతాంతశరుఁడా! చెల్వొం గృపం
జూడుమీ, యళులారా! మొరపంబు దక్కి నిలుఁడీ
యాలోలమందానిలా!,కలయం బాఱకుమీ పికప్రకరమా!
కంఠధ్వనుల్ నల్దెసల్, చెలఁగం గూయక తక్కుమీ
యనుచు రాజీవాస్య లుద్బాష్ప లై. 126
క. ఆరమణీతిలకమునకు
గౌరవమున శిశిరవిధులు గావించినఁ బొం
గారెడు నేతికిఁ బయిపై
* నీ రలికినయట్లవోలె నిష్ఫల మయ్యెన్. 127
వ. అమ్ముద్దియ ననునయింపం దలంచి దానిబహిఃప్రాణంబునుం
బోని బాలచంద్రిక యి ట్లనియె. 128
చ. చెఱకటె విల్లు పువ్వు లటె చిక్కనిచక్కనియమ్ము లేయుచో

* నీరంబుం జిలికినట్లు.

గుఱియై చిత్తముల్ పాఱఁడు కోపమునం గనుఁగొన్న
నంగముం, బఱిపఱి యయ్యె నట్టె తలప్రాణము తోఁకకు
వచ్చె నెవ్వరిం, గఱచు ననంగుఁ డేమిటికిఁ గంపము చెం
దెద వంబుజాననా!. 129

తే. అనిన వెలవెలపాటుమై నల్ల నిగుడు
చిఱుతనగవున నెమ్మోము చెన్నుఁ జేయఁ
నళినలోచనదృగ్దీప్తు లొలసి గ్రాల
నెలుఁగు రాల్పడ నల్లన యిట్టు లనియె. 130

ఉ. సుందరి! రాజనందనుని జూచినచూపులపజ్జఁ బోయి నా
డెందము పూవుఁదూఁపులఁ దొడింబడి మన్మథరాగవార్ధిలో
డిందె మరల్చి తెచ్చుట కడింది దురాశలఁ బొంది పొందియే
నందని మ్రానిపండ్లకును నఱ్ఱులు సాఁచెద నేమి సేయుదున్.

వ. అని యివ్విధంబున నివ్వటిల్లు నెవ్వగలం బొగులు నమ్మృగ
లోచనం జూచి బాలచంద్రిక యాత్మగతంబున. 132

మ. జగతీజాతజయంతుఁడైన మగధక్ష్మానాథుఁ డేకున్న ని
మ్మగువం జిత్తజుఁ డేల మెత్తనిమెయిన్ మన్నించు వే
పోయి నేర్పుగతిం బిల్చెద నిట్లు నాతఁ డిట వచ్చుం దమ్మిలే
తెకులం, జిగురుంబ్రోపులఁ దూండ్లనుం దొలఁగునే చింతా
జ్వరం బింతికిన్. 133

వ. అదియునుంగాక. 134

ఆ. ఏన కాదె విభున కీతన్వి నెఱిఁగించి
దీని కతని తెఱఁగు తెలియఁ జెప్పి
ప్రేమమునకు మొదలు పెట్టినదాన నా
చేత నెట్లు దీఱు నీతెఱంగు. 135

క. వెఱ వేల నాకు నాఁ డీ
తెఱవం గనుఁగొనుచు వలపుత్రిప్పలఁ బడు టే
నెఱుఁగనె యింతకుఁ గైకొని
పఱిపఱిగా నేయకున్నె భావజుఁ డతనిన్. 136

వ. కావునఁ గుమారుకడకుం జని తగినతెఱంగు సేసెద నని సమయోచితకరణంబులకుఁ జతురలైన సఖుల నియమించి.

క. చని మదనాతురుఁ డగు న
మ్మనుజేంద్రకుమారుఁ గాంచి మన మలరఁగ నా
తనిచేయు నుచితసంభా
వనఁ గైకొని ప్రేమగర్భవచనప్రౌఢిన్. 138

వ. లీలోద్యానవర్తనప్రసంగంబున నల్లన కలపికొని యవంతి సుందరి వలవంత యెఱింగించి యి ట్లనియె. 139

ఉ. నేచియు నేరకుండియును నీసుకుమారతనూవిలాసముం
జూచిన రాచకూఁతుఁ డెగఁజూచు తలంపున నంపవానలోఁ
ద్రోచె లతాంతసాయకుఁడు దూఱఁగ నాఱడిచావు మాన్పఁ
గాఁ, జూచుట మేలు వచ్చి దయఁ జూడుము మాగధ
రాజశేఖరా!. 140

క. అనిన విని రాజవాహనుఁ
డనవరతము తోడునీడ నైయె తన్నుం బా
యని చెలియగు పుష్పోద్భవుఁ
గనుఁగొని యి ట్లనియె వదనకమలం బలరన్. 141

క. మది నూఱడు మిఁక నీతలఁ
పు దలంపం గూడె నాడఁబోయిన తీర్థం

బెదురుగ వచ్చిన క్రియ న
మ్మదిరేక్షణ తాన వచ్చె మనకడ కర్థిన్. 142

వ. అని బాలచంద్రిక మొగంబుఁ జూచి యీకార్యలతకు నాల వాలంబు భవదీయచాతుర్యంబ కాదె కావున నీ కెయ్యది ప్రియం బేగతి మనోరథంబు సఫలం బగు నెవ్విధం బుచితం బగు దానిన చేయుదు ననిన నమ్మానిని యి ట్లనియె. 143

క. మరునె త్తికోలు చెప్పితి
వెరవు తగవు నీవె నేర్తు వేయేటికి నా
తరుణీరత్నము చింతా
జ్వరభయమునఁ బెగకమున్న పలయుం గవయన్. 144

క. అను పలుకులకు విపావము
పెనఁగినమోదంబుతోడఁ బృథివీపతినం
దనుఁ డయ్యంగనతో ని
ట్లనియెం బ్రేమార్ద్రసముచితాలాపములన్. 145

చ. మరుఁ డలయింప నామనము మానము దూలిన నయ్యవం తిసుం,దరి కను బేట మేర్పడుట తాఁ దగు కారణ మయ్యెఁ గాక యా, వెరవరి వల్లభుం గలయ వేగిరపాటునఁ జుల్క గాని యి, త్తరుణియు నేను బ్రీతి నుచితంబుగఁ బొందినఁ గాక యొప్పునే. 146

వ. కావున దుష్కరంబైన కన్యాంతఃపురప్రవేశంబున కను రూపంబగు నుపాయంబు విచారించి. 147

క. నేఁ జెల్లి వత్తుఁ బిలిచిన
రాఁ డను వగ దక్క మెన్ని క్రమములనైనన్

బోఁడిగ రక్షింపుము పూఁ
బోఁడిని వేఱొక్కయెగ్గు పుట్టకయుండన్. 148

వ. అనిన విని యత్తన్వి చిత్తంబున నూఱడి మగుడం జనియె
నతండునుం గుసుమబాణతూణీరాయమానమానసుం డగు
చు నిలుపోపక యవంతిసుందరిం జూచినకందువలకుం
బుష్పోద్భవానుగతుం డై యరిగి తత్ప్రదేశంబున. 149

క. ఇచ్చటఁగాఁ జనుదెంచితి
మిచ్చో టచ్చెలువ యున్నయెడ మనలం దా
నిచ్చమెయి బాలచంద్రిక
యిచ్చోఁ దగవు మెయిఁ బిలిచె నింతిం జేరన్. 150

ఉ. ఎప్పుడు చింత వాయునొకొ యిందునిభాననయాననేందు
విం, కెప్పుడు నాదుచూడ్కులకు సింపొదవింపుచుఁదోఁచు
నొక్కొ నా, కెప్పుడు కోర్కు లెల్ల కల వేడఁగ జన్మఫలం
బు నొందఁగాఁ, జొప్పడునొక్కొ యంచు నృపసూనుఁడు
నెచ్చెలిమీఁద వ్రాలుచున్. 151

సీ. లోలాక్షి తన్ను నాలోకించు నెలుకువ
భావించి నెమ్మది బమ్మరించుఁ
బడఁతుక పొందు చొప్పడుటకు నెమ్మెయి
వెరవు గానక మెద విహ్వలించు
నింతికి నింతకుఁ గంతుబాణంబుల
నెగ్గు పుట్టునొ యంచు బెగ్గలించుఁ
దనమ్రోల రాజనందన లీల నున్న యా
చందంబు దోఁచిన సంభ్రమించు

ఆ. నళులమ్రోఁత కళుకుఁ జిలుకలపలుకుల
కులుకుఁ బికనినాదములకుఁ గలఁగు
మలయమారుతంబు పొలయుట కలయు నె
వ్వాగలఁ బొగులు రాజవాహనుండు. 152

వ. ఇట్లు నానాప్రకారంబులగు మారవికారంబులఁ జిత్తంబు త్త
లంపడ నమ్మహీవరుండును వయస్యుండును దానును బరి
భ్రమించుచున్న సమయంబున. 153

ఆ. సోమదత్తుఁ డొక్క భామినియును దాను
నందలంబు లెక్కి యాప్తభృత్యు
లోలిఁ గొలువ వచ్చి యుద్యానతలమున
నిలిచి కలయఁ జూచి నృపతిఁ గాంచి. 154

ఉ. మోము వికాసముం బొరయ మోదమున న్మది పల్లవింపఁ
గా, సోమకళావతంసుఁడు విశుద్ధయశోనిధి రాజవాహన
స్వామి యితండు భాగ్యమున వచ్చితి నీతనియున్న చోటికిం
గాంచితదాయి యయ్యో విధి గన్నులపండువు సేయఁ
గాంచితిన్. 155

వ. అనుచు సంభ్రమంబున నందలంబు డిగ్గి యద్దెసకుం జనిన
వారలుం ద న్నవలోకించి హర్షోత్కర్షంబున నెదు
ర్కొన. 156

క. సరభసపదవిన్యాస
స్ఫురణుం డై యరిగి యతఁడు భూపతిపాదాం
బురుహములు మౌళి సోఁకఁగ
ధరణీస్థలిఁ జాఁగి మ్రొక్కెఁ దద్దయు భక్తిన్. 157

ఉ. మ్రొక్కినఁ గౌతుకంబును బ్రమోదము డెందమునం బెనంగొనఁగ, గ్రక్కున నెత్తి చూడ్కులు మొగంబుపయిం బొలయంగ భూవిభుం,డక్కునఁ జేర్చె నప్పుడు తదంగము లం బులకంబు లెంతయుఁగ, మిక్కుటమయ్యెఁ జెల్లడరె నేత్రములం బ్రమదాశ్రుపూరముల్. 158

వ. తదనంతరంబ పతి యతనికిం బుష్పోద్భవుం జూపిన నయ్యిరువురు. 159

క. విరహాభరదుఃఖితాంతః
కరణంబులు ప్రీతిఁ బొందఁగా రభసమునం
బరిరంభణంబు సేసిరి
నరనాథుఁడు సోమదత్తునకు ని ట్లనియెన్. 160

క. ఇంద్రార్క సేమిగతి నీ
వెందుల వర్తించి యిప్పు డెం దరిగెడ వీ
సుందరి యెవ్వతె ప్రియజను
లిందఱ నెబ్భంగిఁ గూర్చి తింతయుఁ జెపుమా!. 161

వ. అని మిత్రసందర్శనకథాంతరితచింతాతిశయం బగు చిత్తంబునఁ దదీయవృత్తాంతశ్రవణకుతూహలి యగుచు నొక్క చూతపోతంబుక్రేవ సికతాతలంబున సుఖోపవిష్టుం డై యున్న యన్నరేంద్రబృందారకునకు నాత్మీయప్రచారప్రకారంబు సవిస్తరంబుగాఁ జెప్పం దలంచి ముకుళితకరకమలుండగు సోమదత్తుం డి ట్లనియె. 162

ఉ. పండితపుండరీకనవపంకజబాంధవ! నీతిసంపదా
ఖండలపూజ్య! కిల్బిషవికారమదస్మయదూర! పుష్పకో

దండతనుప్రభాచరవిధానవిశారదభవ్యరూప! మా
ర్తాండసమానతేజ! సతతప్రియభాషణ! సత్యభూషణా!.

క. వేదోదితకర్మవ్రత!
భూదేవకులాగ్రగణ్య! బుధబంధుజనా
హ్లాదనతత్పర! సుగుణా
మోదభరితవిభవమదనమూర్తిముకుందా!. 164

మాలిని. అలఘుమహితధామా! యాగవిద్యాభిరామా!
చలనరహితచిత్తా! సజ్జనాయత్తవృత్తా!
సలిలనిధిగభీరా! శ్లాఘనీయప్రచారా!
కులజలరుహమిత్రా! కొమ్మనామాత్యపుత్రా!. 165

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలస దభినవదండి
నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతంబైన దశకుమార
చరితంబను మహాకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.

---

# చతుర్థాశ్వాసము.

---

శ్రీ సంయుక్తకటాక్షా!
భాసురనయశిక్షా! బంధుపాలనదక్షా!
వాసితబుధసాంగత్యా!
ధీసంపత్సారనిత్యా! తిక్కామాత్యా!. 1

తే. దేవ! భవదీయచరణసంసేవ గోరి
చెలుల కెడఁబాసి నిన్ను నీక్షితితలమున
వెదకి క్రమ్మఱుచో నొక్క విపినభూమి
నదితటంబున నొక్కరత్నంబు గంటి. 2

క. కని పుచ్చి ముడిచికొని యట
చనిచని యొక్కెడ దేవసదనములో వి
ప్రుని నొకదీనానను బహు
తనయుం గని నామనంబు దయ పుట్టంగన్. 3

వ. అతని యోగక్షేమం బడిగినం గార్పణ్యవివర్ణంబైన యాన
నంబునం దానసపాటు దోఁప నవ్విప్రుం డిట్లనియె. 4

క. దీనత చొప్పడ మాతృవి
హీనతఁ గడుఁ గందియున్న యీతనయులకుం
బూని యనేకవిధంబుల
నానేర్చినభంగి రక్షణం బొనరింతున్. 5

క. కూటికి నక్కఱపడి యీ
లాటేశ్వరు వీటిలోపలం గలయఁగ భి

తాటన మొనర్తు నని య
చ్చోటు విడిసియున్న వీడుఁ జూపుటయు వడిన్. 6

వ. ఈలాటపతినామం బెయ్యది యతం డిందు వచ్చుటకుం గారణం బేమి యని యడిగిన నతం డిట్లనియె నితండు మత్తకాళాభిధానుండు నిషధవిభుండైన వీరకేతుకుమారుడు వామనయను కామినీరత్నంబురూపాతిశయంబు విని తనకు నమ్ముద్దియ నడుగం బగువారలం బుత్తెంచి కోర్కి సఫలంబు గామిఁ గోపించి. 7

క. పైనెత్తి వచ్చి విడిసిన
నానరపతి యెదురుగా భయంబునఁ దనయం
గానిక యిచ్చిన లాట
త్మానాథుఁడు ప్రమదభరితమానసుఁ డయ్యెన్. 8

ఆ. మరల విడిసె నచట మసలినవాఁ డయ్యె
రణ్యతలమునందు రమణితోడ
వేఁటలాడుటకును; విపినభూభాగసం
చరణరతులు గారె ధరణిపతులు. 9

వ. సబహుమానంబుగా నతనిఁ గన్యారక్షణంబునందు నియమించి వేర విడియించినం జతురంగబలసమేతుండై యతండును దనచిత్తానువర్తనంబులఁ బ్రవర్తిల్లుచునుండు మానధనుండైన యామానపాలుండు నిజమానవాధీశ్వరు నభిమాన ధనంబులు గొలుపోకకు మనంబున ఖేదంబంది యంతశ్ఛిద్రంబులు వెదకుచు నుండు ననుమాటయుం దదీయజనంబుల వలన విని యుండుదు నని చెప్పి మఱియు నాత్మీయదురవస్థాసూచకంబులగు వాక్యంబుల సంభాషణంబు సేసిన. 10

క. పలువురు కొడుకులు విప్రుఁడుఁ
బలుపాటులు వడుట తేటపడ విని కరుణం
దలకొని తనచిత్తమునకు
నెలమిగ నాచేతిరత్న మిచ్చితిఁ బ్రీతిన్. 11

ఉ. ఇచ్చిన నాకు దీవన లనేకవిధంబుల నిచ్చి విప్రుఁడుం
జెచ్చెర నేఁగ నేఁగి యిరుచేతులుత్రాడులఁ గట్టి తేరఁగా
వచ్చి శరీరవేదన నవారితబాష్పజలంబు లొల్కఁగా
మ్రుచ్చును నచ్చు వీఁడె యని మోఁదుల కోపక నన్నుఁ
జూపినన్. 12

వ. ఆవిప్రుని దెచ్చి వారలు నన్నుం బట్టికొని యి ట్లనిరి. 13

క. మ్రుచ్చిలి రాజుల ధనములు
దెచ్చి పరమసాధువోలె దేవరగుడిలోఁ
జొచ్చినఁ బోవునె పెఱధన
మెచ్చో డాఁచితి సహాయు లెవ్వరు నీకున్. 14

చ. అనిన భయంబునం బొరయ కమ్మణి వాహినితీరభూమి నేఁ
గనుటయు విప్రుఁ జేర్చిన ప్రకారముఁ జెప్పితి నెన్ని చెప్పి
నం, గనుకని యొగ్గులాడుచు నకారణబాధ లొనర్చి నన్ను
మ్రుచ్చని వెసఁ గట్టి బంధనగృహంబునకుం గొనిపోయి
యయ్యెడన్. 15

వ. అటమున్న సంకలియ నున్నవారిం గొందఱి నాకుఁ జూపి
నీతోడియయ్యలు వీరె వీరలు నీవును మంచిమగల రై
యుండుం డని శృంఖలానియమితచరణుం జేసి పోయిన
యనంతరంబ. 16

క. తలవరి పలికినపలుకుల
కలరూపిట్టి దని యెఱుఁగఁగా నేరక వా
రలవలనఁ దెలియుతలఁపునఁ
దలపోఁతకుఁ జొచ్చి యేను దగ నిట్లంటిన్. 17

క. మీ రెవ్వ రిట్టిదుస్తర
కారాగృహావాసమునకుఁ గత మెయ్యది యి
య్యారెకులు నాకు మిముఁ నా
వా రని చూపు టిది యేమి వలయుం దెలియన్. 18

వ. అనిన విని చోరవీరు లాలాటపతివృత్తంబు విప్రువలన నామున్న (విన్న)విధంబునఁ జెప్పి తా రక్కన్యారక్షణంబు సేయవచ్చిన మానపాలుభృత్యు లగుటయు నతనిపంపున లాటేశ్వరు పథార్థంబు తద్గృహంబు కన్నం బిడుటయు (వేఁటకరిఁగి?)యతండు దప్పుటయు నతం డమ్మందిరమ్మున లేమియుం దలంపు దప్పి మరలునప్పు డయ్యింటిలోనం గల ధనంబెల్ల దేవికొని వచ్చుటయు నాచొప్పు దప్పించుటకుం దమ వీడు చోరక విపినంబుల కరుగుటయు వేఁకువయైన నాఁటి పగలు గడుపుటకు నొక్కయెడ నిలుచుటయుఁ జొప్పునం బెక్కండ్రు వచ్చినం గని సరకు లెత్తికొని వాఁగుల వంకలఁ బాఱిపాఱి పట్టువడుటయు వీటికిం దెచ్చిన సమస్తవస్తువులు శోధించి యొక్క యనర్ఘ్యరత్నంబు లేదని పలుదెఱంగులం దమ్ము బాధించి కానక సంకలియలం బెట్టుటయు నెఱింగించి యిది మా తెఱంగు మమ్ము నారెకులు నీవా రనునది మాకుం దెలియ దని పల్కిన నేనును మఱిఁ గన్నకందువ తేటపడం బలికి వార లియ్యకొన్న నదియె యిడియని నిశ్చ

యించి తలవరు లట్లనం దగుట తెలిసి యమ్మాణిక్యంబు పాలున కిచ్చి పడినపాటును మదీయజన్మాభిధానంబులును భవదీయాన్వేషణార్థంబు పర్యటనప్రకారంబును సముచి తోక్తుల సూచించి తెలుపుకొని చెలిమిచేసి యాదివసంబు గడపి నిశాసమయంబున. 19

తే. సాంద్రతిమిరంబు చూచి యశంక వారి
చరణబంధనకీలముల్ వెరవు లావు
వెలయఁ దునిమి మదీయశృంఖలయు *విడిచి
యేను వారును వాకిటి కేఁగి యచట. 20

క. రక్షకులు నిద్రవోవుట
వీక్షించి తదాయుధములు వెసఁ గైకొని యే
మాక్షణమున వెలువడి పుర
రక్షకతతిఁ గాంచి పటుపరాక్రమలీలన్. 21

చ. కనుకని తూలఁ దోలి బలగర్వమునం దలపడ్డవారలన్
దునియలు సేసి యొండొరుల దోర్బలసంపద చెప్పికొంచు
బో, రనఁ గటకంబు వెల్వడి నృపాత్మజువేలము చొచ్చి
మంత్రినం, దనుఁడగు మానపాలు నుచితంబుగఁ గాంచి
యనాకులస్థితిన్. 22

వ. మాతెఱం గెల్ల నెఱింగించుచున్న యెడ నతండు నా కులం బునుం బేరునుం బూర్వవృత్తాంతంబును నప్పటిబలపరాక్రమంబులును నిజభృత్యులవలన విని సన్మానపూర్వకంబుగా నన్నుం గైకొనియెమఱునాఁడుమత్తకాళుండు స్వజనంబులఁ బుత్తెంచినం గొందఱు వచ్చి మానపాలుం గని యిట్లనిరి.

* విఱిచి.

క. మీవీటి ముచ్చు లేవురు
మావీటం గన్న పెట్టి మణిభూషణముల్
గోవతనంబునఁ దెచ్చిరి
నీ విటు సేయించు టెల్ల నేరమ కాదే. 24

క. అని యిబ్బంగిఁ బలుక నతఁ
డనియె నిజం బెఱుఁగ కాడ నగునే మీకుఁ
ధన మిది ముచ్చులు వీ రని
కని పలుకుఁడు మిన్న కేల కాఱులు ప్రేలన్. 25

క. అనిన విని వార లి ట్లని
రనుమానము లేదు ముచ్చు లంచఱు నిట వ
చ్చిన నెఱిఁగి వచ్చితిమి నీ
పెనువులు లాటేశు నలుక పెనఁచిన మేలే. 26

వ. అని ముట్టం బలికిన మానపాలుండు కోపించి. 27

క. లాటపతి యెవ్వఁ డాతని
పో టేటికి వాని తోడి పొం దేమిటికిం
జేటికి మాటికి నీక్రియఁ
ద్రోటికిఁ బడనేల వెడలఁద్రోలుఁడు వీరిన్. 28

మ. అని త్రోపించిన వారు త్రోపువడి రోషావేశ మేపార వే
చని నిక్కంబును బొంకునుం బొరయ న స్తవ్య స్తము ల్సెప్పఁ
గా, విని లాటేశుఁడు నీతి పోవిడిచి దోర్వీర్యంబు పాటించి
కో, పనుఁ డై కానక యల్పసైనికులతోఁ బై వచ్చె గర్వం
బునన్. 29

వ. ఇట్లు చనుదెంచి వీడు ముట్టిన నటమున్న కృతనిశ్చయుం
డై పరివారంబునుం దానును సాహసంబు పాటించి యుని

కిం జేసి కలంగక మానపాలుండు మానంబు వాటించి నిజ నామంబు సార్థంబుగా లాటపతిం దలపడి సమరంబు సేయు సమయంబున నంతకుమున్న సబహుమానంబుగా నాకుం జటులఘోటకంబులఁ బూన్చిన తేరును వెరవరియగు సారథియును దృఢంబగు కవచంబును ననురూపంబగు చాపంబును వివిధబాణంబులుం గల తూణీరంబును రథికజనోచితంబులగు తక్కినయాయుధంబులు నొసంగి యమ్మంత్రి తన తీరమి నావలనం దీర్చికొందు నను విశ్వాసంబు దేటపఱుచు మాటలాడుటం జేసి తెంపు సేసి యేనును. 30

ఉ. ఏపునఁ బోరు సేనలకు నెల్లను మీఱి సముల్లసద్భుజాటోపముమై నరాతులఁ బటుప్రదరంబులఁ దూలఁ దోలి యా భూపతి యగ్గమైన రథముం రథముం గదియించి లంఘనప్రాపితతద్రథుండ నయి పట్టి వెసం దెగఁజూచియార్చితిన్.

క. దోర పడుటయు విరిగిన మో
హారముం దోలికొనిపోయి హయగజవివిధా
భరణాదివస్తునికరా
హరణం బొనరించి మంత్రి యత్యున్నతుఁ డై. 32

వ. లాటేశ్వరు పరివారంబు నెల్లం జంపియుఁ గాచియుఁ గాని పించికొనియు మఱియు నెద్దాని కేది యుచితం బగు నవ్విధంబునసమరవిజయపారపారంగతుం డగుచు సమస్తకరణీయంబులు నాచరించి యెడ్డోలగంబున ననేకప్రకారంబుల నన్ను సంభావించి. 33

ఉ. ఇత్తెఱఁ గంతయుం బతికి నేర్పడ నప్పుడె చెప్పిపుచ్చె భూపోత్తముఁడుం రయంబున మహోత్సవ మేర్పడ నేఁగు

డెంచి నా,వృత్త మమాత్యుచేత విని విస్మయమంది కులంబు
శీలముఁ, జిత్త మెలర్పఁగా నతఁడు చెప్ప నెఱింగి మనో
ముదంబునన్. 34

ఆ. మంత్రిబాంధవానుమతి శుభదినమునఁ
బుణ్యవేళ నతివిభూతి వెలయఁ
దనతనూజ నాకుఁ దగఁ బెండ్లిచేసె భూ
జనులు వినుతి సేయ మనుజవిభుఁడు. 35

వ. ఏనునుం బ్రతిదినం బతనిచిత్తం బారాధించి యువరాజ్యాభి
షిక్తుండ నై వివిధసుఖంబు లనుభవించుచుండి భవద్విరహ
వేదనాశల్యహృదయుండ నై వర్తిల్లుచు నొక్కసిద్ధముని
యాదేశంబున నభిమతజనావలోకనఫలంబగు పూజావిశే
షంబున మహాకాళనివాసుండగు పరమేశ్వరు నారాధించు
టకు నేఁడు పత్నీసహితం బిటు వచ్చి భక్తవత్సలుండగు
నద్దేవుని కారుణ్యంబున భవదీయపాదారవిందసందర్శనానం
దంబు వడసి కృతార్థుండ నైతి ననిన విని రాజవాహనుండు
మోదమానమానసుం డై నిరపరాధదండంబునకు విధి
నిందించి వయస్యుపరాక్రమం బభినందించి యాతనికి నాత్మ
వృత్తాంతంబును బుష్పోద్భవుచరితంబునుం గ్రమంబునఁ
జెప్పె నయ్యవసరంబున. 36

క. ధరణీసురుఁ డొక్కరుఁడు చ
తురవేషోపేతుఁ డచటఁ దోతెంచి మహీ
వరు నాశీర్వాదపుర
స్సరముగఁ గాంచుటయు నధికసంప్రీతి మెయిన్. 37

క. కేవలుఁడు గాఁడు వీఁ డని
భావించి నృపాలసుతుఁడు బ్రాహ్మణుఁ డగ సం
భావించి యాదరంబున
నీ వెవ్వఁడ వేమివిద్య నిపుణుఁడ వనినన్. 38

క. హృద్యమగు నింద్రజాలపు
విద్యల మెయిఁ బరిణతుండ విను దేశములం
దుద్యత్ప్రీతిం దిరుగుదు
విద్యేశ్వర నామధేయవిఖ్యాతుండన్. 39

క. అని చెప్పి రాజవాహన
జననాయకుఁ జూచి యతని చతురాకృతి యి
ట్లనయము వెలవెలఁ బాఱుచు
నునికికిఁ గతమేమి యనిన నుల్లం బలరన్. 40

వ. పుష్పోద్భవుం డీవిప్రు నింద్రజాలంబుచాతుర్యంబు గాయకంబు గానోపు నని యూహించి యున్న రూపు చెప్పం దలంచి, 41

ఆ. సజ్జనులకు నెల్ల సఖ్య మాభాషణ
పూర్వ మగుట నీ వపూర్వసఖుఁడ
వకుటిలాత్మకుండ వైన వయస్యుని
కెఱుఁగఁ జెప్పరాని దేమి గలదు. 42

మ. విను మీమాళవనాథుకూఁతునకు నుర్వీశ్వరు నీరాజనం
దనుఁ డాలేమకు నిక్కుమారవరుమీఁదం జిత్త మత్యంతరా
గనిరూఢం బటులుండియుఁ సరసభోగప్రాప్తి కెమ్మైఁ దలం
చిన లేకున్నది నేర్పు దాన నితఁ డీచేడ్పాటునం దూలెడున్.

వ. అనిన విద్యేశ్వరుండు లజ్జాభిరామం బగు రాజవాహను మొగంబు గనుంగొని చిఱునవ్వు నవ్వుచు నాయట్టియను చరుండునుం గలుగ నీకుం జేకుఱని కార్యంబునుం గలదె యని యతని కి ట్లనియె. 44

ఆ. మాళవేంద్రు నింద్రజాలంబువిద్యల
యందు మోసపుచ్చి యతనితనయ
నూ రెఱుంగ నీకు నుద్వాహ మొనరించి
యంతిపురములోని కనుచువాఁడ. 45

క. అటుమీఁద బుద్ధి నీయది
యిటు సేయుట రాజపుత్త్రి కెఱిఁగింపఁగ ముక్త
బటువగు చెలిఁ బుచ్చుము సం
కట మొక్కించుకయు లేదు కార్యస్థితికిన్. 46

వ. అని యనిమిత్తమిత్త్రుండైన యవ్విప్రుం డకృత్త్రిమస్నేహంబునఁ గృత్త్రిమక్రియాపాటవంబు ప్రకటించినఁ బరమానందంబు నొంది గాఢాలింగనతాంబూలదానాద్యుపచారంబులం గలపికొని సోమదత్తుం జూచి భవత్ప్రియయును బరివారంబును మహాకాళేశ్వరారాధనపూర్వకంబుగా నీవీటికిం బోవునట్లు నియమింపు మని పంచిన నతం డట్లు చేసి యరుగుదెంచిన యనంతరంబ రాజవాహనుండు గమిగట్టి పోవ నొల్లక పుష్పోద్భవసోమదత్తుల ముందటఁ బుచ్చి ముందటం బురంబున భూసురమిషంబునం దనవర్తిల్లుట విద్యేశ్వరునకుం జతురతగా నెఱింగించుచు నతండునుం దానును నల్లన నిజనివాసంబునకుంజని బాలచంద్రికం బిలిచి యిత్తెఱం గెల్ల నెఱింగించిన న త్తెఱవయు నవంతిసుందరి

కంతయుం జెప్ప నయ్యింతియుం జింత దక్కి సంతసిల్లి
తానును నదియునుం దత్కార్యానురూపం బగు చాతు
ర్యంబు మనంబున నలవరించుకొనుచుండిరి మఱునాఁడు
రేపకడ నవ్విద్యేశ్వరుండు వేషాంతరపరిగ్రహాగుప్తరాజ
వాహనానుగతుం డై రాజగృహంబునకుం జని యే నైంద్ర
జాలికుండఁ జనుదెంచినవాఁడ నని యెఱింగించి పుచ్చిన
మాళవేశ్వరుండును దద్దర్శనకౌతూహలంబున నవరోధజన
పరివారితుం డై పిలువంబంచినం జని తత్సభామధ్యంబున
ముకుళితనయనుం డై యొక్కింత ప్రొద్దు నిలిచి. 47

క. చట్టలు చఱచుచుఁ బలుమఱు
జిట్టలు మిడుచుచు డివంబు చేతుల విరియం
బట్టుచుఁ గాటుకకన్నులు
జుట్టిన ప్రజ నెల్ల నతఁడు సూచెం గలయన్. 48

క. క్రాలుచు నలు[1]వంకలు ని
ట్టాలోచించుటయుఁ దత్సభాంతమున విష
జ్వాలలు గ్రక్కుచు రోఁజుచు
నోలిని దోతెంచెఁ బాము లుద్గ్రీవము లై. 49

క. ఆపాములపై గ్రద్దలు
కోపముతో వచ్చి యెత్తికొని దివిఁ బఱచెన్
భూపతియు నువిదతండము
చూపరు లాశ్చర్య మొంది చూచుచు నుండన్. 50

ఉ. ఓలిని రామరావణుల యుద్ధము నానరసింహమూర్తియున్
వాలిన దానవేశ్వరుని వ్రచ్చినభంగియు భారతాజియున్

1 ప్రక్కలు.

బోలఁగఁ జూపి యాట తెగిపోవుతటిఁ శుభసూచకంబుగాఁ
జాలు తెఱంగుఁజూపుట ప్రశస్తము గావున నానెపంబునన్.

శా. దేవా! దేవరమూర్తినందన కృతార్థీభూతగా వల్లభున్
భూపర్యున్ వరియించునట్లుగ శుభంబుల్ వృద్ధిపొందంగనే
నావిద్యన్ వరు సర్వులైన జనులన్ నానార్థిసంసారమున్
గావింతుం దగఁ బెండ్లిఁ జూడు మనుడుం గౌతూహలా
యత్తుఁ డై. 52

క. పతి యియ్యకొనిన విప్రుం
డతిశయమోదంబు నొంది యాత్మగతమునన్
జతురోపాయము మార్గ
స్థితి పొందఁగఁ గార్యసిద్ధి సేకురు నింకన్. 53

మ. అని శంకింపక మాళవేంద్రసుతకల్యాణార్థమై తత్సభా
జను లెల్లం బ్రియ మంది చూడఁగ జనశ్లాఘ్యాంజనం బిమ్ము
గాఁ, దన కన్నుంగవఁ గూర్చి యార్చుటయు సాంద్రంబై
వివాహోత్సవం, బునకుం గూడినమాడ్కిఁ దోఁచెఁ బ్రజ
సద్భావానువేషంబుతోన్. 54

వ. తత్సమయంబున. 55

క. కృతసంకేతుండగు నృప
సుతుఁడు నిగూఢంబుగాఁగ శోభనసమయో
చితముగఁ గైసేసి రమా
సుతుకై వడి నాయవంతిసుందరి డాసెన్. 56

సీ. రాగపల్లవిత మై రాజనందను చూపు
తీఁగె లతాంగిమైతీఁగెఁ బెనఁగ

లజ్జావిభూత మైన లలనచూడ్కి మెఱుంగు
పతిమూర్తిమేఘసంగతిఁ జరింపఁ
గౌతుకావహాలీఢకాంతు చిత్తము నాతి
డెంద మత్తఱి నున్నచంద మరయ
సంక్షోభకలిత మై సతిసమ్మనము పతి
హృదయవికాసంబు నెఱుఁగ కుండ
తే. లోలతాలోలమానవిలోచనులును
మన్మథాధీనపరతంత్రమానసులును
నగుచు నేకాసనాసీను లైరి తగ వ
ధూవరులు సౌఖ్యరసముల దోయివోలె. 57

వ. విద్యేశ్వరుండును. 58

క. భావారాధితహరి యై
వైవాహికమంత్రతంత్రవైదగ్ధ్యమునన్
భూవరునకు నమ్మగువను
దేవిని గావించె నగ్ని దేవునిసాక్షిన్. 59

వ. తదనంతరంబ. 60

క. మీఁ రరుగుఁడు మీఁ రేఁగుఁడు
మీరు చనుఁడు మీరు పొండు మీమీపను లొ
ప్పారఁగఁ జలుపుఁడు నావుడుఁ
బోరన నయ్యింద్రజాలపుంబ్రజ వోయెన్. 61

క. భూపతియు నింద్రజాలపు
రూపులతోఁ గలిసి మును నిరూపించిన గూ
ఢోపాయమునం దగ క
న్యాపురమున కేఁగె నామనం బలరంగన్. 62

వ. మాళవేంద్రుండును నయ్యైంద్రజాలికునకుఁ బసదనం బొసంగి యాస్థానమండపంబు వాసి చనియె నవంతిసుందరియు నాప్తసఖీసమేతంబుగా భూపాలుం డున్నకందువ కరిగె నివ్విధంబున దైవమానుషంబులు సంయుతంబులుగాఁ గార్యసిద్ధి వొంది రాజవాహనుండు సరసమధురంబులగు చతురచేష్టలం జేసి మెత్తన యుత్తన్విసిగ్గునగ్గలిక వారించుటయు.

సీ. విభుమూర్తి యేమియు వెలివోవఁగా నీక
తనకన్నుఁగవఁ ద్రావికొనఁగ నిచ్చు
రమణు లీలాలాపరసము విచ్చలవిడి
వీనులఁ దనియంగ నాన నిచ్చు
భూవల్లభుని మేనిపొందు లింపెసలార
సొగయ మైతీఁగెకుఁ జూఱ యిచ్చుఁ
బ్రాణేశపికమును బడయ నానందభ
రావేశ మర్థిఁ గెమ్మోవి కిచ్చుఁ
ఆ. జొక్కి సతిమనంబు సొచ్చు నుల్లంబున
నొదవు*కప్పు తనకు నొజ్జ గాఁగ
మదనతంత్రములు క్రమక్రమంబునఁ దగ
నభ్యసించు బాలహరిణనయన. 64

వ. ఇట్లు మరగియున్న యవంతిసుందరియును రాజనందనుండును జతురసఖీవిరచితకరణీయు లగుచు నభిమతసుఖంబు లనుభవింపుచున్నంత నొక్కనాఁడు. 65

క. సురతసుఖవ్యతికరమునఁ
బరవశు లై నిద్రవోయి పశ్చిమయామాం

* నయ్యె.

తరమున బిసగుణనిగళిత
చరణము నొకహంసఁ గనిరి జంపతులు కలన్. 66

వ. అంత నిద్రావసానం బగుటయు. 67

ఉ. రాజతశృంఖలం బెనఁగి రాజపదద్వితయంబు తారకా
రాజకరావృతం బయిన రక్తసరోజయుగంబువోలె ని
స్తేజము నొందియున్నఁ గని చేడ్పడి తానెలుఁగెత్తి యేడ్వఁ
గాం, తాజనరాజి బెగ్గడిలఁ దామరసాక్షి విషాదవేదనన్.

క. పరు లెఱిఁగిన నాఱడికిం
గరి యగు నను తలఁపులేక గతధృతి నవనీ
శ్వరసుత విరివేనలితోఁ
బురపురఁ బడి యేడ్చుచుండె భూభాగమునన్. 69

క. అంతిపురము జను లెఱిఁగి య
నంతభయభ్రాంతిఁ బొంది యప్పుడె తద్వృ
త్తాంతంబు చండవర్మున
కంతయు నెఱిఁగించి రాగ్రహంబున నతఁడున్. 70

క. విని కినిసి యదిరిపడి చ
య్యన నంతఃపురముఁ జొచ్చి యతికోపనుఁ డై
కనుఁగవ నిప్పులు రాలఁగ
వనితాపరివృతుని రాజవాహనుఁ బలికెన్. 71

క. నాతమ్మునిఁ జంపిన*యఱ
జాతికి వీఁడికి బాలచంద్రికకు మగం
డై తిరిగెడు పుష్పోద్భవుఁ
డీతనికిం బ్రాణబంధుఁ డెల్ల నెఱుఁగుదున్. 72

---

* దుర్జాతికి.

క. రూపున వివేకమున వి
ద్యాపరిణతి కీర్తి డధికుఁ డన నతిమిథ్యా
రోపితమహానుభావుం
డై పురమున వీఁడు భూసురాకృతిఁ దిరుగున్. 73

ఉ. ఈకుటిలాత్మునిం గవిసె నింత వివేకము లేక మాదృశా
నేకనరేంద్రనందనుల నెవ్వరి మెచ్చక దానికేమి దో
షాకరుఁ డైన వీని నిశితాయుధశూలమునం దవిల్చెదం
జేకొని చూచుఁగాక ప్రియుఁ జిత్తము దృష్టియు నూఱడి
ల్లఁగన్. 74

వ. అని యధిక్షేపించి. 75

క. కరి ఘనతరతుండంబున
నరుణసరోజంబు వట్టి యతిసిష్ఠురతన్
దెరలఁగఁ దిగిచినపరుసున
నరపతి చేసేతఁ బెనఁచి నయమరి తిగిచెన్. 76

వ. అయ్యవసరంబున. 77

ఉ. ధీరగరిష్ఠుఁ డైన జగతీపతి దైవము సేయు దుర్దశల్
పైరణఁ గాని తీఱ వని శౌర్యము దక్కి యవంతిసుందరిం
జేరఁగఁ బిల్చి యిట్లనియెఁ జిత్తవిషాదము మానినిల్వు మీ
నీరజనేత్ర! హంసకథ నిచ్చలు నెమ్మదిలోఁ దలంపుచున్.

క. అనుటయు నతండు కోపము
తనమది రెట్టింపఁగా నదయుఁ డై వీనిం
దునుమవలయు నగరు వెడలఁ
గొనిరం డని యాత్మసేనకుల నియమించెన్. 79

వ. అయ్యవసరంబున. 80

తే. విభుఁడు దేవియు నవ్వార్త విని తలంకి
యతిరయంబునఁ జనుదెంచి యల్లుఁ జూచి
యతనిఁ జంపినఁ దారును నాక్షణంబ
చత్తు మని కాచి రాత్మల సంతసిల్లి. 81

సీ. కాచిన వారలఁ గడచి చంపుట పతి
హితము గా దని తనమదిఁ దలంచి
యారాజనందను దారుపంజరమున
నునిచి పుష్పోద్భవు ధనము లెల్లఁ
గొని వాని నలిపెట్టి కొఱగాము లెన్ని యొ
నెన్ని పత్రికల వ్రాయించి దర్ప
సారుపాలికి నొక్క జంఘాలుఁ బంచి వాఁ
డీసింహవర్మమహీశసూనుఁ

తే. దనకు నడుగుటయును సముదగ్రవృత్తిఁ
ద్రోపు సేసిన విక్రమాటోప మొప్ప
నతనిసాధింప సమకట్టి యాగ్రహంబు
మిక్కుటముగఁ జంపాపురిమీఁద నడిచె. 82

వ. ఇట్లు నడుచు చుండి యొరుల నమ్మక దారుపంజరగతుం డైకిశోరకేసరి ననుకరించు రాజవాహనకుమారుఁ దోడన కొనిపోయి కతిపయప్రయాణంబుల నంగపురము డాయం జనిచుట్టుముట్టి విడిసి యనుదినంబు కయ్యంబు సేయుచునుండెసింహవర్మయు సుహృన్మహీపతుల కెఱింగించి పంచిన వారుచంపాపురంబునకు సన్నాహంబు మెఱసి వచ్చుటం దడవులేకున్నను దాలిమిమాలి కోటతలుపులు తెఱపించి. 83

శా. చంపాపట్టణ మేత్తెఱఁగ వెడలి యుత్సాహోగ్రుఁడై
శాత్రవుల్, కంపింపంగ గజంబునెక్కి యవలీలం బోరిలోఁ
గిట్టి సా, ధింపం జాలుదు నేన వాని ననియుద్రేకించి శుంభ
చ్చమూ, సంపద్వైభవ మొల్ల కేఁగెఁ దనయజ్ఞానంబు
చేదోడుగన్. 84

వ. ఇవ్విధంబున నక్షమాపరిణతుం డై నడచి నగరోపకంఠం
బునం దలపడి యతిఘోరయుద్ధంబు సేయం జొచ్చిన. 85

ఆ. అపుడు చండవర్ముఁ డలిగి యంగాధీశు
సేన పాఱిన మఱి సింధురంబు
మీఁదనుండి యతనిమీఁదికి లంఘించి
పట్టికొనియెఁ జలము బలము మెఱయ. 86



ఆ. పట్టి యతనికూర్మిపట్టి నంబాలిక
నర్థిఁ బెండ్లియాడ నతఁడు దలఁచి
యునికిఁ జేసి చంప నొల్లక బలుచెఱ
నునిచి సంతసమున నుండి యంత. 87



వ. దర్పసారకడ[1]కుఁ దనవుచ్చిన [illegible] జంఘా
లుండు పఱతెంచి యాజ్ఞాపత్రి[illegible]యిచ్చినఁ బుచ్చికొని
చండవర్ముండు విచ్చి చూచె నందలి[illegible]ట్టి దనిన.

సీ. స్వస్తి సమస్తరాజన్యచూడామణి
కిరణరంజితపదసరసిజాతుఁ
డగు దర్పసారధరాధీశుఁ డానతి
చండవర్మున కిచ్చె సంతసమునఁ

1 నుండి తనయొద్ద కేఁ.

గన్యాపురముఁ జొచ్చి గాసి సేసిన దుష్టుఁ
జంపెడుచోట విచార మేల?
దుశ్శీలయగు కూఁతుతోడి నెయ్యంబునఁ
దల్లిదండ్రులు మతి తప్పి యేమి
తే. పలికిరేనియు మదిలోన భయముగొనక
దుష్టకన్యకఁ జెఱఁ బెట్టి ద్రోహియైన
వాని లేఖ గన్నప్పుడె వధ మొనర్చి
చెవులపండువ మా కర్థిఁ జేయవలయు. 89

వ. ఇట్లున్న లేఖ తనలోనన చదివి నిజమనోరథంబు సఫలం బగుటకుఁ బ్రీతచేతస్కుం డై రాజవాహను నేనుంగుకాలి పీనుంగుం జేయఁ దలంచి చూడామణిప్రభానిరంజనపద మస్తకుం డై యున్న యన్నరేంద్రుఁ డొడ్డొకని రాఁ బనిచి చండపోతకం బను మాతంగపతిం దెప్పించి యంబాలికావివాహంబున కెన్నిన లగ్నం బాసన్నం బగుటయు నశుభప్రసంగంబు నని వివాహానంతరంబ చంపించువాఁడై యప్పటికి నుడిగి నగరద్వారంబుచేరువం గుమారు నునిచి యచ్చట నగ్గజంబు నిలుప నియమించి వివాహగేహంబున కరిగె నంత. 90

క. దారుణతరశాపము నది
సేరినఁ గీ లెడలి రజతశృంఖల కాంతా
కారము గైకొని లబ్ధమ
నోరథుఁ డగు రాజవాహనున కి ట్లనియెన్. 91

క. నరనాథ! యేను సురమం
జరి యను సురకాంత నాకసమున విమాన

స్ఫురితగమనమున నొక్కెడ
కరుగఁగఁ బ్రతికూలదైవయత్నముకలిమిన్. 92

క. నావచనము కమలంబని
తావికి నొకమత్తషట్పదము సుడిసిన నే
నావేగంబున దానిం
బోవఁగఁ జూపఁగఁ బ్రమాదమున నాచేతన్. 93

తే. తగిలి హారంబు గ్రక్కునఁ దెగిన ముత్తి
యములు రాలె నాచక్కటి హిమనగంబు
పొంతఁ గమలాకరముతీరభూమి నియతిఁ
దపము సేయు మృకండునందనునిమీఁద. 94

వ. ఇట్లు దొరఁగుటయు. 95

క. చేయునది లేక యమ్ముని
నాయకు దెస సంభ్రమంబునం గనుఁగొనఁగా
నాయున్న దెసకు మార్కం
డేయుఁడు చూచుటయుఁ దల్లడిల్లితి నతఁడున్. 96

వ. అతికుపితచిత్తుం డై. 97

క. చైతన్యశూన్యయగు నీ
వీ తెఱఁగి ట్లాచరించి తీక్ష్ణమున ని
శ్చేతన వై తగ లోహపు
జాతి భజింపు మని తీవ్రశాపం బిచ్చెన్. 98

క. ఏనును శాపభయమున వి
మానము డిగివచ్చి మెయి సమస్తము సోఁకం
గా నెరఁగి యమ్మునీశ్వరు
తో నల్లన యిట్టు లంటిఁ దొట్రులుపడుచున్. 99

క. ఇచ్చట *నకామకృతమున
వచ్చిన యపరాధమునకు వావిరి శాపం
బిచ్చితి దీనికి నేఁ గడు
నొచ్చితిఁ గరుణింపు లోకనుతసచ్చరితా!. 100

వ. అని ప్రార్థించిన నతం డిట్లని యనుగ్రహించె రాజవాహ నుం డనురాజు పూర్వజనితంబైన శాపంబువలన రెండు నెల లు(ండు)వాఁడు గావున నీవును నింద్రియశక్తిసహితం బుగా వెండిసంకిలియ వై యతనిచరణంబు లాశ్రయించి మాసద్వయానంతరంబున నిజాకారంబు వడయు మనినం బ్రసాదం బని యాక్షణంబ శాపంబున కనురూపంబు సేసి కొని తత్ప్రదేశంబున నున్నంత. 101

సీ. వీరశేఖరుఁడను విద్యాధరుండు క్రీ
డార్థంబు చనుదెంచి యచట నన్నుఁ
గని ముదంబునఁ బుచ్చికొనిపోయెఁ బదపడి
యాతండు దర్పసారాభిధాను
మహితతపోవీర్యమహనీయు మీబావఁ
జేరి యాతనితోడఁ జెలిమి సేసె
నతఁడు నెయ్యంబు తియ్యంబునఁ జెలియలి
నిచ్చెద నన దాని కియ్యకొనియె
తే. వాఁడు నిష్ఫలమగు తనవాంఛ పేర్మి
నాసరోజాక్షిఁ గనుఁగొను నాసఁ జేసి
వచ్చి యుజ్జయినీపురిఁ జొచ్చి యన్యు
లెఱుఁగకుండ నంతఃపుర మెల్ల నరసి. 102

---

* వా భ్రమ

శా. ప్రాసాదోపరిరమ్యభాగమున సాంద్రంబైన చంద్రాతప
శ్రీసౌధామలదీప్తులం జెనయఁగా జిత్తోద్భవక్రీడన
వ్యాసంగంబున డస్సి మీరు సుఖనిద్రాయత్తులై యున్నచో
రోసం బెక్కిన వీరశేఖరుఁడు నీరూపం బొగిం జూచుచున్.

వ. డాయం జనుదెంచి భవదీయమహానుభావంబుచేతఁ బ్రతి
హతుం డై యెం జెద్దియుం జేయఁజాలకుండి దైవదత్తో
త్సాహుం డగుటంజేసి నిజఖడ్గముష్టిశిఖరంబున రజతశృంఖ
లారూపంబున నున్న నన్నుఁ బుచ్చికొని భవచ్చరణయుగ
ళంబునఁ గలితంబుఁ జేసి యతిత్వరితంబున నెక్కడికేనియుం
బోయిన. 104

క. అది యాదిగాఁగ నే నీ
పదయుగళం బాశ్రయించి బ్రదికితి నిట యె
య్యది సేయఁదగిన కార్యం
బది సేసెద నన్నుఁ బనుపు మద్భుతచరితా!. 105

క. అన విని భూమీశుఁడు మన
మున ఘనవిస్మయము మోదముం బెనఁగొనఁగా
ననిమిషకామినితో ని
ట్లనియెం బ్రియ *దెస దలంచి యాదరవృత్తిన్. 106

క. నాకుం బ్రియ మొనరింపఁగ
నీ కిష్టము గలిగెనేని నీరజనేత్రా!
యీకథ యింతయుఁ జెప్పుము
శోకాతుర యగు నవంతిసుందరితోడన్. 107

---

* దేవిఁ దలఁచి.

క. అని యనిచిపుచ్చి దైవము
తనపైఁ గృపసేసి యాపదలు తలఁగుటకుఁ
జనపతి నెమ్మదిలోపల
ననురాగముఁ బొందుచుండి యాసమయమునన్. 108

వ. తత్ప్రదేశంబున. 109

శా. అంగంబుల్ ప్రమదంబునం బొదలఁగా నౌత్సుక్యవృత్తిం దగన్, శృంగారం బొనరించి సర్వజనసంసేవ్యోత్సవాగారవే, దిం గన్యన్ వరియింప నున్నెడ బలోద్రేకంబుమైఁ జండవ, ర్మం గూలం బొడిచెన్ భటుం డొకఁడు క్రూరుం డై కఠారంబునన్. 110

క. అని సంభ్రమించి పలుకుచుఁ
గనుకని చెడి పాఱు జనులఁ గని రాజసుతుం
డును జండవర్మ చావున
కనుమానము లేమి నిశ్చయము సేసి వెసన్. 111

చ. వెరవు జవంబు సత్త్వమును విక్రమమున్ విలసిల్లుచుండఁగాఁ
గరిపతి నెక్కి మావతునిఁ గ్రక్కునఁ గీటణఁగించి త్రోచి నిష్ఠురసృణిపాతభేదిగజకుంభధరుం డిభబృంహితధ్వనిం
బరుపడి మూఁక పాయ విడఁ బార్థివగేహము డాసి యిట్లనున్. 112

చ. వగవ మనుష్యమాత్రమున వారికి దుష్కరమైన యట్టియాఁ, మగతన మెవ్వఁ డిప్పుడు సమస్తజనస్తుతికారణంబుగా
విగతభయాత్ముఁ డై నెరపె వేగమె వాఁ డిట యేఁగుదెంచి వే, మొగపడునేని నియ్యెడ సముద్ధతిఁ గైకొని కాతు నాతనిన్. 113

చ. అనుడు నొకండు వచ్చి వినయంబున మ్రొక్కినఁ జూచి రాజవాహనుఁడపహారవర్మ్ముఁడగు టాత్మ నెఱింగి ముదంబు వొందిర, మ్మని కరసంజ్ఞ చేసి చరణాయతికుంచితకుంజ రంబు నె, క్కినచెలిఁ గౌఁగిలించెఁ బనకేలు పిఱిందికిఁ జాఁచి వేడుకన్. 114

వ. మఱియును. 115

క. అతనికరంబులు కక్షా
ద్వితయంబున నిగుడఁ జిగిచి వికసితముఖుఁ డై
పతి యన్యోన్యాలింగన
వితతసుఖం బనుభవించె వేడుకతోడన్. 116

వ. అపహారవర్మయుఁ జిరవియుక్తుం డైన రాజవాహనుం గలయఁ గనుంగొని పరమానందంబు పొందుచుండె నయ్యిరువురు నన్యోన్యకుశలసంప్రశ్నంబులు సేయునెడ నెడలేకుండఁ జండవర్మ పరివారంబు శస్త్రాస్త్రఘోరంబుగాఁ బొదివినం బతి కరిపతిం బురికొలిపిన దొరలేని కూటువమూఁకలు విరియఁబాఱిన మంచువిరియించినపతంగుండుంబోలె వెలింగి వీటిలోని సంకటంబున గొల్లక బయలు మెఱసియున్నంత సింహవర్మకుం దోడుపడుటకు నరుగుదెంచిన నరపాలుఁ డతని పరిభవంబు విన నరవాయి గొనక యురువడించి చండవర్మ తోడి భండనంబున కియ్యకొని వచ్చివచ్చి యాతండు చచ్చుట యెఱింగి యచ్చెరువందుచుఁ బురంబు డగ్గఱి.117

చ. తెగువ జనంబు లెల్ల వినుతింప దొరం దెగఁ జూడఁ జాలు ని,మ్మగటిమిఁ జేసి క్రందుకొన మార్కొను వైరిబలంబుఁ దోలియ, ల్లగజముమీఁద విక్రమవిలాసము సొంపెసఁగంగ

నున్నవా, రగణితశౌర్యు లిద్ద అని యాదటఁ జెప్పఁగ
వించు వేడుకన్. 118

ఉ. అందఱుఁ గూడఁ బూఱి కడు నచ్చెరు వెట్టి మహాత్ములాక్యా?
వీ,రిం దగఁ గానఁగావలయుఁ బ్రీతి మెయిన్ వెస నిప్డ వింత
మైఁ, గ్రందుగఁ బోక యొప్పదని గ్రక్కున నొక్కని బుద్ధి
మంతుఁగా, ముంపర దారిచుట్టుటెకముం గొనియాడఁగఁ
బంచి రర్థితోన్. 119

వ. తదనంతరంబ తొల్లి రాజవాహను నన్వేషింపం జని పుణ్య
వశంబున నొక్కొక్కదేశంబున కధిపతు లై యుండి చం
పాపురీశ్వరునకు సహాయ మనుష్ఠింపం దమసైన్యంబులతోఁ
జనుదెంచిన యపహారవర్మయు నర్థపాలుండును బ్రమతియు
మిత్రగుప్తుండును మంత్రగుప్తుండును విశ్రుతుండును నొం
డొరుం గనుంగొని గాఢోపగూఢసౌఖ్యం బనుభవించునెడ
నర్థపాలుండు నపహారవర్మయు నిజజనకులైన కామపాలునిం
బ్రహారవర్మునిం జెలులకుం జెప్పిన నయ్యిరువురకు నందఱు
నుచితాలాపంబులఁ బ్రియంబు సేయుసమయంబున ముంద
టం బోయిన దూత రాజవాహను ననుమతి రాజలోకంబు
నతనిపాలికిం బిలువ వచ్చిన సమస్తమహీశ్వరులుం బోవఁ
గదలుటయుఁ గుమారులు విధియత్నంబున లోకోత్తరచ
రిత్రులగు నయ్యిరువురు మనవార యగుటకు దైవయో
గంబు గలుగునో యని యన్యోన్యకుశలవార్తాశ్రవణకుతూ
హలంబు శోభిల్ల వీరపురుషదర్శనోత్సుకు లగుచు నతిత్వరి
తంబున నరిగి వారలం జూచి రాజవాహనుండును నపహార
వర్మయుఁగా నెఱింగి. 120

క. వినయము సంభ్రమముం దమ
మనముల నెలకొనఁగ నక్కుమారులు నృపనం
దనునకు మ్రొక్కిన నతఁడుం
గనుఁగొని వారల వయస్యగణ మని యెఱిఁగెన్. 121

తే. ఎఱిఁగి యపహారవర్మకు నెలమిఁ జూపె
నెట్టి భాగ్యంబు నెచ్చెలు లెల్ల (నిచటి)
కరుగుదెంచిరి చూచితె యనుచు సమధి
కాదరంబున గజపతి నవతరించి.  122

వ. వారిం గౌఁగిలించుకొని వారల నెఱింగింపఁ బ్రహారవర్మ కామ
పాలుర సర్వప్రతిపత్తి *ప్రీతులం గావించి వారికి నపహార
వర్మ నెఱింగించి వారలు నక్కుమారులు నతండును నుచి
తాచారంబులు నడపిన యనంతరంబ యితరధరణీశ్వరుల
నాలోకనసంభాషణంబుల సన్మానించి సింహవర్మను రావించి
లజ్జావనతవదనుండగు నతనిఁ బ్రియాలాపంబులం దేర్చి
పుచ్చి చెలులతోడిసల్లాపంబులు సేయువేడ్క చిత్తంబు వేగిర
పఱుపఁ దదీయసైన్యంబులు సముచితప్రదేశంబుల విడియు
నట్లుగా నియమించి తక్కినరాజుల నెల్ల నిజపురంబులకుం
బోవం బనిచి.  123

తే. చెలులుఁ దానును గౌతుక మెలమి మిగుల
నొక్క రమ్యోపవనములో నుల్లసిల్లు
చూతపోతంబుకడ నికతాతలమున
మానవాధీశ్వరుఁడు సుఖాసీనుఁ డయ్యె.  124

వ. ఇట్లు సుఖోపవిష్టుం డై.  125

* ప్రేమలం గారవించి.

క. సవినయమున వా రడుగఁగ
నవనీనాయకుఁడు చెప్పె నాశ్చర్యకరం
బవు తనచరితము పుష్పో
ద్భవు వృత్తాంతంబు సోమదత్తుని కథయున్. 126

వ. చెప్పి సుహృద్వర్తనంబులు వినం దలంచి యపహారవర్మ మొగంబుఁ జూచి నీవృత్తాంతంబు సవిస్తరంబుగా నెఱిం గింపు మనిన. 127

ఉ. పోషితసత్కవీంద్రునకుఁ బుణ్యచరిత్రునకు న్నిజప్రభా
దూషితవాసరేశునకు ధూతకళంకునకుఁ గుణావళీ
భూషితకీర్తికాంతునకుఁ బుష్పశరప్రతిమానమూర్తికిం
దోషితబంధువర్గునకు దుర్గమశాత్రవపార్శ్వభేదికిన్. 128

క. నీతినిపుణమతిజితపురు
హూతామాత్యునకుఁ బుణ్యయుతకృత్యునకుం
బూతచరిత్రసముజ్జ్వల
గౌతమగోత్రునకు నుభయకవిమిత్రునకున్. 129

మాలిని. జనవినుతవివేకక్షాంతిసంపత్తిసౌమ్యా
త్మునకు నిఖిలలోకామోదసంపాదివిద్యా
ధనున కసమదానత్యాగలీలాసముద్య
ద్వినయనిధికిఁ గీర్తిస్థేమనిర్వర్తి కుర్విన్. 130

గద్యము. ఇది సకలసుకవిప్రసాదవిభవ విలస దభినవదండి నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార చరిత్రం బను మహాకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

# పంచమాశ్వాసము.

---

శ్రీయుతున కర్థిజనరా
ధేయునకు నపారవిభవదేవేంద్రునకున్
దోయజభవనిభునకుఁ గరు
ణాయత్తాత్మునకుఁ దిక్కనామాత్యునకున్. 1

వ. రాజవాహనమహీవల్లభునకుం దనచరితంబు చెప్పం దలంచి యథరాసనుం డగుచు నపహారవర్మ యిట్లనియె. 2

సీ. ధరణీశ! నాఁడు వింధ్యములోన మము డించి
పోయిన నీచొప్పు రోయఁ దిరిగి
యందఱు నెచ్చెలు లఖిలదేశములకు
నరిగిన నేను నియ్యంగదేశ
మునకు నేతెంచి సజ్జనుఁడు మరీచి వి
జ్ఞానలోచనుఁడు విశాలబుద్ధి
గంగాతటంబునఁ గాననాంతరమున
వసియించు నని యెల్లవారిచేత
తే. వినుట నమ్మునిచే భవద్విధ మెఱుంగఁ
(దలఁచి) తత్తపోవనములోపలికి నరిగి
విన్ననై వెల్లఁబాఱుచు నున్నవాని
దైన్యపరిగతముఖు నొక్క తపసిఁ గంటి. 3

క. కనుఁగొని మరీచి యనియెడు
మునినాయకు పాదపద్మములు దర్శింపం

జనుదెంచితి నాపుణ్యా
త్ముని యున్నెడ నూఁపు నాకు మోహం బెసఁగన్. 4

వ. అని యడిగి వెండియు ని ట్లంటి. 5

ఆ. అతఁడు దివ్యబోధయుతమానసుం డని
జనులు చెప్ప వింటి ననఘ! యతని
వలన నాదు కూర్మి చెలిశుభాశుభములు
గోరి వినుట నామనోరథంబు. 6

చ. అన విని యాతఁ డిట్లనియె నారయ నమ్ముని యట్టివాఁ
డగుట,విను మొకకారణంబున వివేకవిహీనతఁ బొంది యత్త
పో, ధనవిభవంబు గోలుపడి దైన్యదశాపరిపాకతప్తచే
తనుఁ డగుచున్న వాఁడు విదితంబుగ నత్తెఱఁ గెల్లఁ జెప్పె
దన్. 7

వ. అది యె ట్లనిన నొక్క నాఁ డిత్తరుమూలవేదికాతలంబున
నత్తపోధనుండు సుఖాసీనుం డై యున్న యవసరంబున
(నొక్క యువతి) యొక్కతియ యనుదెంచి ప్రణమిల్లి నిలిచిన
యనంతరంబ తద్బంధువర్గం బెల్ల దానిపిఱుందన పఱతెంచి
యుమ్మలికంబు దోఁప నొండొరులం గడవ దండప్రణామంబు
సేసి నిలిచినయెడ నవ్వేలంది విషాదంబును లజ్జయుఁ దోఁప
ని ట్లనియె. 8

క. ఈసంసృతిదుఃఖమునకు
వేసరి పరలోకసౌఖ్యవిపులప్రీతిం
జేసి భవత్పాదంబులు
డాసితిఁ గరుణింపు మక్కటా! యని నన్నున్. 9

ఆ. అనిన దానిబడిన యరుగుదెంచిన బంధు
జనులలోన నొక్క జలధి మ్రొక్కి
యిట్టు లనియె దేవ! యిది నాదు నందన
వేశ్యధర్మ ముచితవృత్తి మాకు. 10

వ. ఇక్కోమలి కులాచారంబులు డిగంద్రావి. 11

క. తపమునకు వచ్చె నాపై
నపరాధము వెట్టి లంజియల తల్లులు సే
యుపనులు వెలిగా నొండక
విపరీతము లేదు దాని వినుము మునీంద్రా!. 12

క. తనయఁ గని గారవంబున
ననుదినమును సావధాన నై యొడికమునం
బెనిచి పదంబడి యలజ
వ్వాన మగుటయు వేడ్కతోడ వారిజముఖికిన్. 13

సీ. పరిమితాహారంబు వాటించి యొడియంగ
ములనాఁడునాఁటికి నలుఁగువెట్టి
చదురైన మాటలు సడిసన్నఁ జెప్పి శృం
గారంబు గావించు క్రమము దెలిపి
మెత్తని విద్యలు మేలుగా నెఱిఁగించి
యుపచారములు సేయు నొఱపు గఱపి
సౌభాగ్యమునకునుం జాలిన నోములు
నోమించి పడయంగ నూలుకొలిపి

తే. పేరుఁ బెంపునుఁ గలవాఁడు ప్రియముతోడ
నడిగి పుత్తెంచె నేని నెయ్యంబెఱింగి

రేపు మాపని యాసలు చూపిచూపి
యింపు పుట్టించి తుదిఁ బిలుపింపవలయు. 14

క. ధనవంతుఁ డైనవానిం
దన యిచ్చిన దిరుగువాని దానగుణమునం
బనుపడువానిం గైకొని
యనుషంగావలయుఁ గూఁతు నాతనికడకున్. 15

క. మగలం బలువురఁ దన్నుం
దగిలింపఁగ నొఱపు గఱపి తా నొక్కనిపైఁ
దగులము సేసిన నొకమెయి
మగిడింపుచుఁ గూఁతుఁ బడపు మరపఁగవలయున్. 16

సీ. ఒరుఁ డొసంగినయీగిపురుడుసూపుచు లోభి
చే నర్థ మొయ్యనఁ జేఁడికొనుచుఁ
బురుడు సూపిననైనఁ బుడుక నేరనివాని
నంగడిఁ బొచ్చెపో నాఁగికొనుచు
నాఁగిన సరకు సేయనివాని ధనము భూ
తలనాథునకుఁ జెప్పి బలిమిఁ గొనుచు
ధన మెల్ల నిచ్చి పేదఱికె మొందినవాని
కీగిగా ధన మిచ్చి యేడికొనుచుఁ
తే. బందువులు శోభనంబులు బహువిధంబు
లైన నోములు సమకట్టి జానుమీఱి
యల్లుతండంబుచే ధనమెల్లఁ గొనుచు
మెలఁగుటలు వారసతుల తల్లులకుఁ బనులు. 17

ఉ. కావున నివ్విధంబునన గారవ మొప్పఁగ నేఁటిదాఁక వే
శ్యావలిలోనఁ దన్ను వెలయం గొనియాడితి నేఁ డళీకసం

భావనుఁ డైన యొక్కరునిపాలికి లోలతఁ బోవ వచ్చినం
బోవకు మంటి నావుడుఁ దపోవనభూమికి వచ్చెఁ జెచ్చెరన్.

తే. తపము వడయుదు నని వెఱ్ఱితనము మిగిలి
వినదు నామాట దేవ! నీ వనునయించి
యెన్నిభంగులనైన *[ను హితము సెప్పి
కూఁతు నింటికిఁ బంపి మాకులము నిలుపు. 19

మ. అని దైన్యంబున వేశ్యమాత మిగులం బ్రార్థింప నార్ద్రాత్ముఁ
డై, వనవాసంబునఁ గష్టముం దపము సాఫల్యంబునుం జెప్పి
జ, వ్వని నవ్వేశ్య బహుప్రకారముల నిర్బంధించి పొమ్మన్న
న, మ్మునివాక్యంబుల నాలకించి యనియెం బూఁబోఁడి
నార్యాఢిగన్. 20

క. దేవా! మీపదసేవను
భావించియ వచ్చియుంటి వలదని యనుచోఁ
బావకుఁడే శరణం బగుఁ
దావక సన్నిధిన] యింత తథ్యము సుమ్మీ!. 21

వ. అనిన విని యొండెద్దియుం బలుకనేరక దానితల్లి మొగంబు
గనుంగొని యమ్ముని యిట్లనియె. 22

ఉ. కోపము పొంగుఁ గ్రుంగు నొకకొన్ని దినంబులు కాననాం
తర, వ్యాపితఖేద మొందిన నవశ్యము నంత ననంతదుఃఖ
సం, తాపిత యై తుదిం దెలిసి తాన మదిం దలపోసి

---

* ఇచట కుండలీకరణము చేయఁబడిన భాగము వ్రాఁతప్రతిలో లేకుండుటం జేసి యూహన్మాలాధారముతోఁ గథాసందర్భమునఁ బూరింపఁ బడినది.

చూచి ని, లోఁపక వచ్చు నింద్రియసుఖోత్సుకమైన తలం
పు పెంపునన్. 23

క. మీ రొం డెద్దియుఁ జెప్పక
బోరనఁ బొం దనిన వారు వోయినతుది నా
చారవిశారద యై ముని
నారాధింపం బొడంగె నమ్మగువ దగన్. 24

వ. ఒక్కనాఁ డయ్యింతి యేకాంతంబునం జతుర్వర్గవిషయంబు
లగు సంభాషణంబులు పుట్టించినయెడం దదాలాపమాధు
ర్యంబునం ధైర్యం బెడలి యత్తపోధనుండు కామప్రకా
రంబు దానివలనం దెలియం దలంచి తక్కినపురుషార్థమ్ములు
వేఱువేఱ దాని కెఱింగించి యుల్లంబున నను రాగంబు గదుర
నల్లన యి ట్లనియె. 25

క. కామం బను పురుషార్థము
నామము వినియు నిది దక్క నలినానన! యే
నేమియు నెఱుంగఁ జెపుమా
యేమిట నది నడుచు సిద్ధి యెమ్మెయిఁ బొందున్. 26

తే. అనిన విని వికసిల్లి యి ట్లనియె నింతి
యేను మీఁకు నెఱింగింప నెంతదాన
నైన నామది నెఱిఁగినయంతవట్టు
విన్నవించెద నేర్పడ వినుఁడు దాని. 27

చ. అలరులుఁ బూఁత లంబరము లాభరణంబులు దమ్ములంబు
నెచ్చెలులు మృదూపధానములు సెజ్జలుఁ గేలిగృహంబు
లాదిగాఁ గలుగు పదార్థము ల్నడుపుఁ గామము దాను

మనోహరంబు తత్ఫలమగు సౌఖ్యసిద్ధిఁ దెలుపఁగా వశమే
యనుభూతిఁ దక్కఁగన్. 28

క. అనిన విని యత్తపోధనుఁ
డనయము రాగాంధుఁ డగుచు నంగనతో ని
ట్లని యెం గామంబున వ
ర్తనమును సిద్ధియునుఁ జూపు తరుణీ! నాకున్. 29

వ. అనవుడు నవ్వనిత యతనిధృతి గోలుపోవుట యెఱింగి
తేఁకువ సెడి యిట్లనియె. 30

క. రమణీయములగు నుపకర
ణములన కామము ప్రవర్ధనం బగు నని యే
నమితకృపాకర! చెప్పనె
సముచితముగ రండు నాదుసదనంబునకున్. 31

క. అచట మనోహరవస్తు
ప్రచయంబునఁ గామతంత్రపాండిత్యము మీ
కుచితంబుగఁ దెలిపెదఁ ద
ద్రచనకు సిద్ధికి మనంబు ప్రమదం బొందన్. 32

వ. మీ రందు వేంచేయుటకు నామీఁదికారుణ్యంబు కారణం
బుగా నెపంబు వెట్టి జనుల వంచించి వాంఛితంబు సఫలంబు
సేసికొని మగుడ వత్తు మనవుడు ననంగవికారపారవశ్యం
బున నొడంబడి చుంబకశిలాప్రతిమం దగులునయోరూపం
బునుంబోలె ముని తనపజ్జ నరుగుదేరం దరుణి రాజ
మందిరంబునకుం జని యంగనాపరివృతుం డగుచు నున్న
యంగాధీశ్వరునకుం బ్రణమిల్లిన నమ్మహీవల్లభుండు విస్మితుం
డగుచు నయ్యరుపురం గనుంగొని యిమ్మహాముని యిట

రాకకుం గారణం బేమి యని యక్కోమలి నడిగిన న
క్కొలువులో నొక్కలేమ లేచి యిట్లనియె. 33

క. వనమున కరిగి మరీచిని
మనసిజమదమత్తుఁ జేసి మనవీటికిఁ దె
చ్చినవనితకు వరుప్రుడ నని
జననాథా! పన్నిదంబు సఱచినదానన్. 34

సీ. నాతోడఁ బురుడించు నాతు లందఱు వినఁ
బ్రతినలు గొని వనాభ్యంతరమున
కరిగి మేడ్పఱచి కామాతురుఁ జేసి యి
మ్మునినాథు నిట దెచ్చె ముదముతోడఁ
గావున నేఁ డావెగాఁ గామమంజరి
వరుసతోఁ బనిచినపరవ్రుఁబనులు
దప్పక చేయుచు దాసినై యుండెద
ననవుడు జననాథుఁ డపహసించె
తే. నాతు లందఱు మునిఁ జూచి నవ్వఁదొడఁగి
రతఁడు లజ్జించి క్రమ్మఱి యరుగుదెంచె
నిట్టి పాలసుఁ జూడంగ నేల నీకు
నెఱుఁగఁ జెప్పెద విను మాతఁ డేన సుమ్ము. 35

వ. ఈదృశుండైన నావలన సాధించు మనోరథంబునుం గలదె
యైనను. 36

క. కలఁగినచిత్తము దృఢముగ
నిలిపి విచారించి యేను నీచెలికాఁడి
మ్ముల నున్న చంద మేర్పడఁ
దెలిపెద నేతెమ్ము కొన్నిదివసంబులకున్. 37

వ. అనిన విని విషాదం బంది సుంవరులదెస యాసక్తి యింత
కీడగునే యని తలంచుచు సవినయంబుగా నమ్మునిపతికిం
బ్రణమిల్లి. 38

తే. వీడుకొని వచ్చివచ్చి యవ్వీటియొద్ద
భాసురంబైన యొక జైనపల్లెపొంతఁ
ద్రోవచేరువఁ గొండొక మ్రానిక్రేవఁ
జూడఁ బోలుపారి తనువగు నీడ నిలిచి. 39

సీ. భూరేణుపటలంబు పొదివిన వక్షంబుఁ
గన్నిటఁ దోడ్తోడఁ గడుగువాని
డాకేలు సెక్కున డాపిడి తనలోనఁ
దలపోసి తలపోసి యలయువాని
ధరలోనఁ గలుగు నొప్పరమిండలకు నెల్ల
మొరలు నాఁ జాలిన మూర్తివాని
బరివోవ నూఁచినఁ బలుచనై తేఁమిాఁదఁ
దూఁగాడు వెండ్రుకతోఁకవానిఁ
తే. గాటికుంచెయు వెడచింపిచేట కెలన
దొంతిబుజ్జల చిక్కంబు పొంతఁ బెట్టి
వగలఁ బొగిలెడువాని నిర్వాణి నొక్క
తరుణతాపసిఁ గాంచితి ధరణినాథ!. 40

క. కని కృపయు వితర్కము నా
మనమున ముప్పిరిగొనం గ్రమంబున నే నా
తనికొలఁది దెలియుతలఁపున
జనపాలకతిలక! డాయఁ జని యి ట్లంటిన్. 41

తే. ఎగ్గు గాదేని యెఱిఁగింపు మిష్టమేని
నన్ను నడిగెద నొకమాట నిష్ఠ నిట్లు
తపసివేషంబు గైకొని తగవుగాని
శోకమున నేల పొగిలెదు నాకుఁ జెపుమ!. 42

వ. అనిన నతం డిట్లనియె నే నీచంపానగరంబున సంపన్నుం డైన నిధిపాలుం డను వైశ్య నగ్రనందనుండ వసుపాలితుం డను విరూపకుండును నను నామధ్వయంబులకు ననురూపంబు లైన ధనరూపంబులు గలుగువాఁడ నిందొక్కరుండు సుందరక నామధేయుండు సుందరాకారంబు గలిగి హీన ధనుం డగువాఁడు గలండు నాకును వానికి ధనరూపంబుల నీసువైరంబు గావింపం దలంచి వైరోపజీవులయిన పౌరధూర్తులు వేశ్యావిషయంబు లైన యాలాపంబులు ప్రసంగించి.

క. ధనమునకు రూప మధికము
ధన మధికము రూపమునకు ధనమును రూపం
బును సరి యని పలుకుచు దు
ర్జనభావము వెలయ వాదు సమకట్టి రొగిన్. 44

ఉ. సుందరకుండు నేనును నసూయతనంబున వారి త్రిప్పులం
గ్రందొనరించి యొండొరులఁ గష్టపుఁదిట్టులు దిట్టుచున్న చో
నందఱుఁ గూడి యొక్కసమయంబు క్రమంబున నిశ్చ
యించి మా, మంచట మాన్చి యి ట్లనిరి మానుగఁ దా
రనుకూలశత్రు లై. 45

క. ధనవంతుఁడు రూపసియును
మనమునఁ దలపోయ నధికమాన్యులు ప్రౌఢాం

గన నెమ్మది కనురాగము
పొనరింపఁగఁ జాలు నతఁడ పురుషుం డెందున్. 46

వ. కావున. 47

తే. లక్ష్మికూరిమిసుతు రాజ్యలక్ష్మివోని
కావ్యమంజరి యను వారకాంత గలదు
దానిచేత మీయర్థసౌందర్యతార
తమ్య మేర్పడు మీరలు దాని కిపుడు. 48

వ. రో యిచ్చి పుచ్చుం డిదియ సర్వజనసమ్మతంబైన కార్యం బిట్లు సేయనినాఁడు మీయన్యోన్యవివాదంబులకు నిర్ణయింప నశక్యం బని యొక్క శుభగపతాక గల్పించి కుంటెనీలుగా నిరువుర సమకట్టి. 49

క. మీరలు పీ రిద్దఱికై
యారాజీవాక్షియింటి కరిగి ప్రియముమైఁ
జేరి చతురులై రో యీఁ
గోరుట యెఱిఁగించుటయును గోమలి ప్రీతిన్. 50

ఉ. ఎవ్వనిదూతఁ గైకొనియె నెవ్వనియున్నెడ కేఁగుదెంచెఁదా, నెవ్వనిఁ బ్రీతిఁ గైకొనియె నెవ్వనితోఁ బలికెం బ్రియంబుమై, నెవ్వనిచెట్టఁ బట్టెఁ దగ నెవ్వని నింటికిఁ బిల్చె వాఁడునేఁ, డివ్విజయధ్వజంబునకు నీశుఁ డగుక్ సుభగత్వ మేర్పడన్. 51

వ. అని పలికినం గపటమతు లైన విటజనంబుల మాటలకుం దగులువడి మచ్చరంబున నజ్జోటికూటంబు వాటింపం దలంచి యేము గుంటెనీయులం బుచ్చిన నచ్చెలువయు. 52

మ. సభలో నాకడ కేఁగుదెంచి నిజదృగ్జాలంబు నీలోత్పల
ప్రభల న్నింపఁగ *మోవి లేనగ విగుర్పఁగా నన్ను వీక్షించి మ
త్సుభగత్వంబు [1]నుతించి సుందరకుఁ దేజోహీనుఁ గావిం
చినఁగా, సభికవ్రాతము పిచ్చలించె నను నానాస్తోత్రవాక్యం
బులన్. 53

వ. అప్పు డత్యంతరాగాక్రాంతచిత్తుండనైన నన్నుం దన
యింటికిం దోడ్కొని చని సముచితకరణీయంబులను మదన
వికారానురూపప్రకారంబులను నాసక్తుం జేసి. 54

క. నాయింటి మొల్లమునకును
నా యొడలికిఁ బ్రాణములకు నావారికిఁ దా
నాయిక యై (వల) నేర్పడ
నాయంబుజనేత్ర నన్ను నడగో ల్గొనియెన్. 55

క. ధన మంతయుఁ గొని కతిపయ
దినములలో గోఁచి యిచ్చి ధృతి మాల్చి మదిం
గనికరము మాలి కోమలి
వినువారలు గేలిగొనఁగ వెడలం ద్రోచెన్. 56

వ. అట్టియెడ. 57

క. గురుజనధిక్కారణంబులు
పురజనపరిహాసవచనములు బంధుజన
స్ఫురితోల్లాసములు విననగ
విరసము లగుటయు విషాదవేదనతోడన్. 58

క. మిండాట మాడి పోలిసిన
మిండలకును జైనవృత్తి మే లని మదిలో

* మేలి. 1 నటించి.

నొండు తలఁ బుడిగి జినముని
మండలికృప వడసి యొక్కమాంత్రికుచేతన్. 59

వ. దీక్షితుండ నై దౌర్భాగ్యంబు కారణంబుగాఁ బుట్టిన వైరాగ్యంబునం గట్టిన కచ్చడంబునుం బుచ్చివైచి జైనవర్తనంబులు నిర్వర్తింపం దొడంగి నడపం జాలక వనంబులోపలం దన వలచినట్లు దిరుగు కరి పట్టువడి యాఁకటి కోర్వక తలరువిధంబున. 60

సీ. అందంద బూడిద యప్పళించుచు వెండ్రు
కలు పీఁకు వేదన కలసియలసి
కడుపార నశనంబు గానక తొల్లింటి
కడుపు లారట దోఁపఁ గుందికుంది
నిరతంబు బ్రహ్మాదిసురకోటి నిందించు
దోసంబు మదిఁ దలపోసిపోసి
శీతాతపంబులచే రేయుఁ బగలును
బెగడొంది తోడ్తోడ వగచివగచి

ఆ. ధనము గోలుపోక కనయంబు వెరవేది
యిహపరార్థసుఖము లెడలియెడలి
యేడ్చుచున్న వాఁడ నేమని చెప్పుదు
నన్నుఁ గరుణ నిట్టు లంటి నేను. 61

ఉ. సమ్మద మంది కొన్ని దివసంబులు వేదన దక్కి నిల్చు నీ
సొమ్మది యెంత యెంతయునుఁ జోద్యతరంబుగఁ దెచ్చి నీదు
పాదమ్ములకుం బ్రియం బడరఁ దల్లియుఁ దానును మ్రొక్కి
వేశ్య వై, కొమ్మని యిచ్చునట్లుగను గోరి యుపాయము
సేయ నోపుదుణ. 62

వ. అని యిట్లూజడిలం బలికి నీ పీజైనపల్లియ వసియింపు మని
నియమించి యచ్చోటు వాసి నగరంబు దరియం జనిచని
యొక్కయెడ నక్షధూర్తుల వెంటంగని యచ్చోటికిం బోయి.

సీ. *(ఇరవారు నిరువదియేను జూదములందు
నెనలేని నేర్పరితనము చూపి)
కైయధికంబుగఁ గల్లసారెలు వైచి
యెక్కుదాయంబుల యెడలు గడపి
యరుదైన తాలుకతనము పాసికలను
వలసినదాయంబు వైచికొనుచుఁ
దప్పనాడినఁ గని తప్పార్ప వచ్చిన
లేదు లే దని తుది వాదు వెట్టి
తే. చావునకుఁ దెగినంతియ సంభ్రమించి
సత్యములు సేసి సభికుల సాక్షి గోరి
యంతఁ బోవక తద్వాదు లైనవారిఁ
బాడి యడుగుచు మంపట లాడియాడి. 64

సీ. బలియుఁ డోడిన ధనములు గొనఁజాలక
పుడికిన(దానితోఁ) బోవువారు
ననదలు గెలిచి వా రడిగిన నేమియు
విడువక ధనములు వడయువారు
నోడిన ధన మింక నాడినం గాని యేఁ
బెట్టఁ జూ పొమ్మని పెనఁచువారు

* ఈకుండలీకృతభాగము వ్రాఁతప్రతిలో లేనందున మూలాధారమునఁ బూరింపఁబడినది.

గెలిచినధన మెల్లఁ బలకప్పె నప్పుడ
పెట్టక పోనీక కట్టువారు
తే. బొత్తుగా నాడి యోటమి పొత్తువారి
మీఁద లెక్కించి వంచన మెఱయువారు
లంచములు గొని యెడఁ బొరలంగఁ బలికి
పెద్దవెలయాటఁ దెగ గెలిపించువారు. 65

వ. ఇట్లనేకప్రకారంబుల నక్షకేలిం దగిలి యున్నవారలం గనుంగొనుసమయంబున నొక్కరుండు దనకు వచ్చిన దాయంబు దప్ప నాడంబోయిన. 66

తే. ఆట చూపంగఁ దగమి నే నల్ల నవ్వి
యతనిమోము వీక్షించిన నాగ్రహమున
నెదిరిజూదరి కనుఁగవ నెట్టి మిగుల
నన్నుఁ గనలునఁ దేరకొనంగఁ జూచి. 67

ఆ. వలను మెఱసినట్టివాఁడవ పోలె నై
యాట చూపి తిపుడు తేటపడఁగ
వాఁడు నేరఁ డీవు వలఁతివి నాతోడ
నాడు మనిన భాగి యనుమతమున. 68

క. సారెలుఁ బలకయుఁ గైకొని
నేరిమిమై నాడి ధనము నెరయఁగఁ గొని దు
ర్వారుం డగు నాజూదరి
నోరు మడిచి తద్జ్ఞజనవినుతి చెలఁగంగన్. 69

వ. భాగంబు మేరకొలందికి మిక్కిలి యిచ్చి తక్కినధనంబు సగంబు చాగంబు సేసి విమర్దకాహ్వయుండైన యబ్భాగి వేడుకపడి తనయింటికిం బిలిచినం బోయి సముచితమజ్జన

భోజనంబు లాచరించి ధనంబు నపహరింప మనంబునం జలం
బెత్తి ముచ్చిమి వెలిగా శీఘ్రోపాయం బొండు లే దని
నిశ్చయించి. 70

ఉ. వానికతంబునం బురమువారలలోపల నర్థవంతులన్
హీనుల నేర్పడం దెలిసి యిండులకందువ కేఁగి పొందులుం
గోనలుఁ జూచునంత రవి గ్రుంకి పదంపడి తోడుతోడఁ బె
ల్లై నిఖిలంబునుం దనమయంబుగ సంతమసంబు వచ్చినన్. 71

చ. పొఱి తల నీలిదిం డొలికిబూడిద ముండులబంతి గాలచీ
రయు సెలగోల కత్తి భ్రమరమ్ముల క్రోలును మైలమందు గొ
య్యయు నురి గ్రొంకినారసము నాదిగఁ గల్గిన సాధనంబుల
న్నియు సమకూరఁ జేసికొని నేర్పున నేఁగితి ముచ్చు
ప్రొద్దునన్. 72

క. చన గంటి వెట్టి యే నొక
ధనవంతుని యిల్లు సొచ్చి ధన మంతయుఁ గై
కొని వచ్చివచ్చి మణిగణ
కనదాకల్పయగు నొక్కకాంతం గంటిన్. 73

వ. కని డాయం బోయి. 74

శా. ఈకాంతం బగు భూషణప్రతతితో నీచీఁకటిన్ శంక లే
కేకాంతంబున నిట్టి నట్టనడురే యెచ్చోటికిం బోయె దా
లోకింపం గడుఁ జోద్యమైనయది వాలుంగంటి! సంప్రీతితో
నాకుం జెప్పుము నావుడున్ వడఁకు మేనం బుట్టఁగా ని-
ట్లనున్. 75

శా. అన్నా! యిన్నగరంబులోపల ధనాఢ్యుండునుంబోలె సం
పన్నశ్రీయుతుఁ డై వణిగ్జనులలోఁ బ్రఖ్యాతచారిత్రుఁ డై

యెన్నంజాలు కుబేరదత్తసుత నే నింపార మాతండ్రి తా
నన్నుం బెండిలి సేయ వేడ్కపడి నానాబంధుసంప్రీతితోన్.

క. ధనమిత్రుం డను సెట్టికి
నను వాగ్దత్తంబు సేసినం దద్గుణవ
ర్తనరూపవిలాసంబులు
వినియుం గనియును మనంబు వేడుక పొందెన్. 77

వ. అంత. 78

క. తనతండ్రి యైన వసుమి
త్రునిపిమ్మట నతులకీర్తిదోహలి యై త
ద్ధనవర్గంబుం గతిపయ
దినములలోనన యతండు దీనుల కిచ్చెన్. 79

వ. ఇట్లుదారతారూఢుం డై సూరిజనంబులచేత నుదారుం
డను పేరు వడసి. 80

క. తనకుం గల యర్థ మంతయు
ననురాగముతోడ నిచ్చి యర్థులచే ని
ర్ధనవృత్తిఁ బెట్ట గొనియెనొ
యనఁగ నుదారుండు లేమి కనుగల మయ్యెన్. 81

వ. ఇవ్విధంబున హీనధనుం డైన నీ నొల్లక మదీయజన
కుండు. 82

క. అర్థపతి యనఁగ నిం దొకఁ
డర్థపతిప్రతిముఁ డున్న నతనికి సతిఁ గాఁ
బ్రార్థించి యిచ్చువాఁ డై
యర్థాదేశమున నుచిత మారయఁ డయ్యెన్. 83

క. ఇమ్మెయి మజ్జనకుఁడు న
న్నమ్మికొనం దలఁచి పరిణయానుగుణోద్యో
గమ్ము ప్రవర్తిల్లఁగఁ గడు
నెమ్మిగ నర్థపతితోడ నెయ్య మొనర్చెన్. 84

క. తెల తెలవేగెడునప్పుడు
తలఁబ్రాలకు లగ్న మనినఁ దద్వార్తకు బె
గ్గలి కెల నెఱుంగకుండఁగ
వెలలితి ధనమిత్రు మీఁది వేడుక పేర్మిన్. 85

క. కావున నాయభిమానము
గావుము భూషణము లెల్లఁ గైకొని నన్నుం
బోవిడువు మనుచుఁ దోడవులు
ప్రో విడి యొప్పించి యశ్రుపూరము లొలుకన్. 86

వ ప్రార్థించుటయును సకరుణంబైన యంతఃకరణంబుతోడ. 87

సీ. ధనమిత్రు గుణము లావనితచేఁ జెవులార
విని వానిఁ గనుఁగొనువేడ్క దగిలి
మును వసుపాలితు ధనము వెద్దునఁ గొన్న
తరుణి మేడ్పెట్టెడు వెరవు గొఱలి
ప్రాభవంబున నర్థపతి యన్యభామిని
నడిగిన వానిత్రుళ్ళడఁపఁ దలఁచి
కోరిక తుద ముట్ట నీరజాననఁ దగు
మగనితో నొడఁగూర్చి మనుపఁ జూచి
తే. వెఱవ వలవదు నీ పని వెలఁదిమనము
భీతి యంతయుఁ బెడఁబాపి ప్రియునికడకు

నడవఁ బనిచి పైఁ జీర నత్తోడవు లెల్ల
ముడిచి యేనును దోడన నడుచునపుడు. 88

వ. సముచితసంభాషణంబులలోన నబ్బాలిక పేరు కులపాలిక
యగుటయు నెఱింగితి నట్టియెడ. 89

తే. కోలదివియల్లవెలుఁగు దిక్కులకు నిగడి
తొడరి పురవీథిఁ జీఁకటిఁ దొలఁగఁ దోలఁ
బటుభయంబునఁ దలవరిబలము రాక
చూచి యొక్కింత చిత్తసంక్షోభ మెసఁగ. 90

సీ. ఈబాలయును నేను నెదురుగాఁ బోయిన
నలజడిఁ బెట్టుదు రని తలంచి
యిక్కొమ్మ నడపించునెడ వీరిఁ బఱపుదు
ననుట మోఱక మగు నని తలంచి
యీలేమయును నేను నోలంబు సొచ్చినఁ
గనిరేని నవకార్య మని తలంచి
యిన్నాతిఁ దిగఁద్రావి యేను బాఱిన మగ
తనము నిష్ఫల మగు నని తలంచి

తే. తప్పఁ గ్రుంకెడు వెర వాత్మఁ దలఁచితలఁచి
యీయవస్థకు నూహింప నిదియ మాకు
బ్రదుకుఁదెరు వగు నని సుఖోపాయవృత్తి
గాంచి యి ట్లని పలికితిఁ గాంతతోడ. 91

తే. విషము భావించికొని పడి వీథి నేను
బొరలుచుండెద నిది పోలుఁ బోల దనక
యెదురుగాఁ బోయి వెడయేడ్పు లేడ్చి వారి
తోడ ని ట్లని పల్కుమీ తోయజాక్షి!. 92

శా. ఏ మీవీటికి వచ్చి నేఁడు చోరఁ జో టెచ్చోట లేకార్తి
మై, నీమార్గంబునఁబొంత నీయరుఁగుపై నిచ్చోట నిద్రింప
మ, త్స్వామిం గ్రూరమహోరగంబు గఱచెం దద్వేద
నాలీఢుఁ డై, తా మూర్ఛిల్లినవాఁడు వీఁడె విషవైద్యం
బిచ్చి రక్షింపరే!. 93

వ. అను మని పనిచి యేనును లాలాజలార్ద్రింబైన వదనగహ్వ
రంబును భూరేణుదూషితంబైన కేశకలాపంబును వైవర్ణ్య
కలితంబు లైన యంగంబులుం దాల్చి. 94

క. మున్ను విష మెక్కినట్లన
కన్నులు దెఱవక శరీరగతవాయువులన్
సన్నముగ నడపకొని యా
సన్నమరణుకరణి ధరణిశయనుఁడ నైతిన్. 95

వ. అంత నాయారెకులు చేరం జనుదెంచిన నయ్యింతియు
గత్యంతరాభావంబు కారణంబుగా ధీర యై మదుక్తప్రకా
రంబునం బలికిన నందఱు ముసరికొని చూచుసమయంబున.

ఉ. వారలలోన నొక్కరుఁడు వైద్యవిధిజ్ఞుఁడు మంత్రతంత్రసం
స్కారపరాయణుండు కృతకంబులు నిక్కము గాఁ దలంచి
దు, ష్టోరగదష్టుఁ డయ్యె నని యోడకు కోమలి! యీక్ష
ణంబ ని, ద్రారకు నిద్రఁ దెల్పినవిధంబున నీపతి మూర్ఛఁ
దేర్చెదన్. 97

క. అనుచుఁ దగ డాసి చేష్టలు
కనుఁగొని ప్రజ విరియ నడచి గారుడమంత్రం
బున దోషంబుం దీర్చెద
నని యిడుమలు గుడిచి మంత్ర మఫలం బైనన్. 98

ఆ. మందు నలిచి కన్నులం దిడి ముక్కునఁ
బిడిచి చెవులఁ బోసి యొడలఁ దుడిచి
విషము డిగనిభంగి విషవాది గని విస్మ
యంబు పొంది యిట్టు లనియె సతికి. 99

ఉ. కోమలి! పూర్వజన్మమునఁ గ్రూరపుఁ జెయ్వులు పాముఱూప
మై, యేమఱి యున్నఁ బట్టికొనియెం దలపోయఁగ నిక్క
వంబు నీ, స్వామి గతాసుఁ డయ్యెఁ బురసంహరుఁ డైనఁ
బురాకృతంబులం, దా మిగులంగ నేర్చునె వృథారుదితం
బులు తక్కు మిక్కడన్. 100

వ. ధీరతాపరిణతంబగు నంతఃకరణంబు తోడుగా విధివర్తనం
బప్రతికర్తవ్యం బగుట దలంచి యాపద కోర్చి భవత్స్వామి
కళేబరంబుకడ నిలువుము రేపకడ చనుదెంచి యగ్ని
సంస్కారంబు సేయించెద మని చెప్పి తానునుం దోడి
వారును నెడ దవ్వగాఁ జనినయనంతరంబ యేను నొక్క
యింటిపంచ డాఁచిన మదీయోపకరణంబులు నత్తరుణియా
భరణంబులుం బుచ్చికొని యుదారు నగారంబునకుం జని.

ఆ. అతని నిద్ర దెల్పి యంగనారత్నంబు
చూపుటయును జాలఁ జోద్య మంది
నన్నుఁ జూచి పలికె నన్న! నీ వెవ్వడ
వీలతాంగిఁ దెచ్చు టేమివిధము. 102

వ. అనినం గలరూ పెఱింగింపం దలంచి యి ట్లంటి. 103

ఉ. ఏ నొకతస్కరుండఁ గడు నేకత మీవిరిఁబోఁడి చీఁకటిం
దాను భవత్సమాగమసుధారసలాలసమానసంబుతో
మానము వాయఁ బెట్టి కుసుమప్రదరుం డొకరుండ తోడు

గా, రా నడుమం గనుంగొని కరంబు విషాదము పొంది
యుత్తలిక్. 104

క. ఇమ్ముద్దియ దెస యక్కటి
కమ్మును భవదీయసఖ్యకౌతూహలముక్
నెమ్మేిం బిరిగొనుటయు నా
యిమ్ములం జను టుడిగి రాక యిది మిత్రనిధీ!. 105

క. అని యింతిచీరతల ముడి
చిన మణిమండలము లతనిచే నిచ్చితిం ద
ద్ఘనఘృణినికరము చీంకటి
వెనుకొని విరియించె గగనవీథులం బర్వన్. 106

వ. ఇచ్చుటయు. 107

క. తోడవులు గైకొని మదిలో
ముడివడు సంభ్రమము హర్షమును లజ్జయు నె
క్కుడు వినయంబును మోమున
నడరంగా నిట్టు లనియె నాతండు నాతోన్. 108

తే. నీవు నాప్రాణసమమైన నెలంతం దెచ్చి
యిచ్చి వాకట్టితేను నీయెదుర నింకం
బ్రియము లేమేని పలికినం జేలుందనమ
యింత నిక్కున మూహింప నెట్టు లనిన. 109

క. పొచ్చెంబు లేని మగటిమి
నిచ్చోటికి నింతిం దెచ్చు టిది యంతయుం దా
నచ్చెరు వని పలుకుదు న
యచ్చుగ నైజంబు దలంప నద్భుతకరమే. 110

క. ప్రాణసమానం దెచ్చితి
ప్రాణము రక్షించి తింకఁ బ్రతికారము నా
ప్రాణమ యని నీయిచ్చిన
ప్రాణము నీ కీర్తి నను‌ట పౌరుష మగునే. 111

క. ఇమ్ముల నీసుకృతమ్మున
కమ్ముడువో యెడు భటుండ నయ్యెద విస్ఫా
రమ్ముగ నాపలుకులు సదృ
శమ్ముగ నేఁ బలుకు టరయ సముచిత మగునే. 112

వ. ఉపకారంబునకుం బ్రత్యుపకారంబు గావింపం బూని పలుక నశక్యంబు నేఁతయంతదవ్వు భవద్భృత్యనిర్విశేషంబున నేఁడు మొదలుగా నరసికొని యుండు మని వినయావనత శిరస్కుం డై కేలు మొగిచి వెండియు ని ట్లనియె. 113

క. విను దీని తల్లిదండ్రుల
యనుమతి వెలిగా వివాహ మగుట చనదు వా
రును నాకు నీరుఁ గొనిపో
దు నె యొం డొకభూమి కైన దుఃఖము లడఁగన్. 114

వ. అని విషణ్ణవదనుం డై పలికినం దదీయహితలేశంబు నిర్వహింపం దలంచి యి ట్లంటిఁ బురుషునకు నిట్టివిచారంబు పౌరుషంబునకు న్యూనం బదియునుం గాక. 115

ఉ. బాలికసౌకుమార్యము నపారనిరంతరకాననోగ్రశా
ర్దూలమదేభసింహపరిదూషితమార్గములం దలంచినం
బోలునె నీవిచార మిది పోలదు పోవుట బుద్ధి గాదు నీ
కేల చలింప నేఁ గలుగ నీ సతి నీసతిఁ జేసి నిల్పెదన్. 116

వ. ఇ ట్లూఱడం బలికిన నేఁటి లగ్నంబు దప్పుటకుం దగినవిఘ్నం
బాచరించి పదంపడి కార్యాలోచనంబు సేసికొంద మీ
లలన నీతలంపులోనిదయగుటం జేసి వలసినయప్పు డిష్టంబగు
తెఱంగు గావించుకొన నగు దీనిచిత్తంబు నీదెసం గలు
గుటయు నిది సాహసంబున నియ్యేడకు వచ్చుటయు వీరు
వా రెఱింగి రేనిం గార్యంబు దప్పుం గావున నిప్పుడ యి
ప్పొలఁతి నిజగృహంబున కనుపవలయు వివాహప్రత్యూహం
బును జౌర్యంబుననకాని యీయావేగంబున నొం డుపాయం
బు గలుగనేర దీవేళయం దిదియ వెరవుగాఁ జొత్తమని నిశ్చ
యించి కుబేరదత్తు గృహంబునకుం జని యక్కన్నియ లో
నగుట కారణంబుగా నేము నిర్భయంబున 117

ఉ. కన్నము వెట్టి యింటఁ గల కాంచనరౌప్యవిభూషణాదు లె
ల్లన్నిమిషంబులోన వెడలం గొనిపోయి యడంచి వచ్చి
య, క్కన్నియ నూఱడం బలికి క్రంతల నల్లన నేఁగి యేఁగి
యు, ద్యన్నిశితాసిఖేటకశరాసనబాణసనాథపాణులన్. 118

క. ఆరెకులం గని భయ మెడఁ
గూరక యుండియును మాఱుకొనక పఱచినన్
వారలు వెన్నడిఁ దఱిమిరి
పౌరులు గలబెల యనంగఁ బటువేగమునన్. 119

వ. ఇవ్విధంబునం దలవరులు వెను తగుల ముట్టంబడి పాఱు
చున్న సమయంబున. 120

క. తెరువుబడి నొక్కయున్మద
కరిపతి యుండంగ దాని గనుఁగొని కలఁకం

బోరయని మనంబుకలిమిం
బరమోపాయంబు గాంచి బంధుఁడు నేనున్. 121

ఆ. అగ్గజంబు నెక్కి హస్తికుచేతియం
కుశము దివిచి పుచ్చికొని రయమున
నతనిఁ గూలఁ ద్రోచి యారక్షిబలముపైఁ
గొలుపుటయును నదియు గోల్పుమసఁగి. 122

సీ. ఎడలేనిక్రంతల నెగిచి చాల్పడఁ ద్రోచి
చరణాగ్రమున బారి చమరిచమరి
కడకాళ్ల నందంద యొడిసి చేకుఱఁ బట్టి
విసరి కంబములతో వ్రేసివ్రేసి
గోడలదాపున గుమిఁగట్టి నిలిచినఁ
బ్రక్కలం జదియంగఁ బ్రామిప్రామి
యీడఁబోవక చక్కి నెదిరిన బిరుదులఁ
గొమ్ముల గుదివడ గ్రుచ్చిగ్రుచ్చి

ఆ. కసిమసంగి విలయకాలకాలుని లీలఁ
దఱిమి వారి నెల్లఁ దనమదంబు
పెల్లునం జెలంగి పీనుంగుపెంటగా
నగ్గజంబు చంపె నప్పు డేను. 123

వ. వెరవున నమ్మనకరి మరల్చి పెండ్లి గజిబిజి సేయుటకుం గుబే
రదత్తుగృహంబు కన్నంబున గాసి సేయుటయ కాక యర్థ
పతియిల్లును వారణంబుఁ గొల్పి పఱిపఱిసేయం గంటి మని
సంతసిల్లి యుదారకుండు కందువ యెఱుంగుటం జేసి. 124

ఆ. పరిణయోత్సవమునఁ బరిశోభితం బగు
తద్గృహంబుమీఁద దంతిఁ బఱపి

క్రుమ్మి చిందరమార్చి గూలంగఁ ద్రోపించి
పురసమీపవిపినభూమిఁ జొచ్చి. 125

క. తరుశాఖాలంబితకర
చరణుల మై యచట నాగజంబు విడిచి మం
దిరమున కరిగితిమి రహః
పరతంత్రత నంతటం బ్రభాతం బయ్యెన్. 126

వ. తదనంతరంబ. 127

సీ. ప్రాచీనశైలాగ్రభాగస్థమగు నశో
కంబునఁ జిగురుజొంపం బనంగ
వర్షాధిపతి యని వాసవుఁ గొలువఁ జే
రిన యింద్రగోపకశ్రేణి యనఁగ
సురుతరపూర్వభూధరము నెత్తంబునఁ
బొలుచు గైరికగండశిల యనంగఁ
గాశ్మీరపటమునఁ గావించి సురపతి
విడిచి యాడెడు వాలుఁబడగ యనఁగ
తే. నరుణకిరణుండు దోతెంచె నంబుజాత
నర్మసచివస్మితాపాదనంబునందుఁ
జతురుఁ డై యుష్ణకరములఁ జక్రవాక .
తాప ముడుపుట నాశ్చర్యధాముఁ డగుచు. 128

వ. అయ్యవసరంబున నేను దినముఖోచితక్రియలు నిర్వర్తించి యస్మదీయవర్తనంబులం దుములబహుళంబైన నగరంబు గలయం గనుంగొనుచుం గుబేరదత్తు మందిరంబునకుం జని కన్నపుమాటలఁ గ్రందుకొన నొండొరులతో నాడుసందడి నిలిచి. 129

సీ. ఇక్ష్వాకు లిబ్బంగి నింటిలోఁ దిరుగంగ
సరకుసేయక వచ్చు టరిది గాదె
సందడి గ్రబ్బడి పొంది పెక్కోలంబు
లరసి కన్నము పెట్టు టరిది గాదె
తనయిల్లు తాను జొచ్చినయట్ల సొచ్చి సొ
మ్మంతయుఁ దెచ్చుట యరిది గాదె
డిగఁద్రావి పోవక యగపడ్డ వస్తువు
లన్నియుఁ గొనిపోక యరిది గాదె
ఆ. బాపు! కన్నకాఁడ! బాపు! నిశ్శంకుఁడ!
బాపు! బల్లిదుండ! బాపు! ముచ్చ!
యనుచుఁ జౌరు లెల్ల నగ్గించి యగ్గించి
వినుతి సేయుచుండ వింటి నచట. 130

వ. అట్టి సమయంబున నయ్యర్థపతి యయ్యెడకుం జనుదెంచి వివాహవిఘ్నఖిన్నుం డైన తనమామ నుచితాలాపంబులం దేర్చి భూషణాంబరాదు లొసంగి సాంవత్సరికుల రావించి లగ్నాంతరం బడిగిన వారును మాసావధిగా నిశ్చయించిన విని చనియె నేనునుం దదనంతరంబ యరిగి యుదారకునకుం దద్వృత్తాంతం బంతయు నెఱింగించి యెల్లకార్యంబులకు ననుగుణంబుగా మనంబున నొక్క తెఱంగు నిశ్చయించి మఱియు నతనితో ని ట్లంటి. 131

క. విను మనముచ్చిమి సొమ్ములు
మనుజేంద్రుఁడు పౌరజనసమాజము నెఱుఁగం
దనరిన వైభవమున నను
దినము ననుభవించునట్టి తెఱఁగు వయస్యా!. 132

క. ఒకచర్మభస్త్రి రుచిరక
నకరేఖలు గలుగఁ జేసి నరనాయకుసా
లిశ్రీఁ గొనిచని నిశ్శంకత
నకుటిలమతివోలెఁ దత్సభాంతరభూమిన్. 133

ఉ. నిర్మలమార్గవృత్తిరమణీయునకుజ్ఞ సతతాధ్వరక్రియా
కర్మఠపాణిపద్మునకుఁ గావ్యకళాజనిభూమికిం దమో
దుర్మదవిస్ఫురద్వికృతదూరవిచారున కంతరద్విష
న్నిర్మథనప్రభావమహనీయవివేకవిశాలబుద్ధికిన్. 134

క. నిఖిలకళాసంవేదికి
మఖసంతోషితమరుత్సమాజునకుఁ గృపా
సఖచిత్తునకు నుదారున
కఖిలజగత్పూర్ణకీర్తి కద్భుతమతికిన్. 135

మాలిని. వినయనిధికి నానావేదవేదాంగతత్త్వ
జ్ఞునకు నియమతుష్యత్సూరి కవ్యాజలీలా
మనసిజునకు లక్ష్మీమందిరాత్మీయవంశాం
బునిధిశశికి హృద్యస్ఫూర్తిసత్కీర్తి కుర్విన్. 136

గద్యము. ఇది సకలసుకవిప్రసాదవిభవ విలస దభినవదండి నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార చరిత్రం బను మహాకావ్యంబునందుఁ బంచమాశ్వాసము.

# షష్ఠాశ్వాసము.

శ్రీకాంతచరణయుగళీ
కోకనదమధువ్రతునకు గుణజాలికర
త్నాకరునకు మదనసమా
నాకృతిహృద్యునకుఁ డిక్కనామాత్యునకున్. 1

వ. అతని కిట్లని విన్నపంబు సేయుము. 2

క. వసుధేశ! బహుధనంబుల
వసుమతిలోఁ జేరు గొన్న వసుమిత్రున కే
కసుతుఁడ ధనమిత్రుఁడఁ ద
ద్వసునిచయం బెల్లఁ గీర్తివాంఛానిరతిన్. 3

వ. అర్థివర్గంబున కిచ్చి పదంపడి పేదఱికము కారణంబుగాఁ బురంబులో దైన్యవృత్తిం జరింపం జాలక వనాంతరంబునకుం జని నిజశిరఃకృంతనోద్యుక్తుండ నైన యవసరంబున. 4

చ. జడలును బూదిబొక్కణము జన్నిదముం బులితోలు చీరయుం, గొడుగును గ్రిక్కయుఁ వెదురుగోలయుఁ గృష్ణమృగాజినంబుఁ బొ, ల్పడరఁగఁ దాల్చి దృష్టిగతుఁడైన నిశాకరమౌళి వోలె నా,కడ నొకతాపసోత్తముఁడు గ్రక్కున వచ్చి కృపాసమేతుఁ డై. 5

శా. వాలుం గేలున నంటఁ బట్టుకొని జీవం బింత నిస్సారమే?
యేలా? సాహస మింత క్రూరమతి వై యేకాంత మిక్కాన

లోఁ, గాలిం బుచ్చెదు పౌరుషం బిది వినం గానం గడుఁ
దోస మీ, జేలుం జెయ్యి కతంబు చెప్పు నిను సంప్రీతాత్మునిం
జేయుదున్. 6

చ. అనవుడు లేమికంటె నరయఁ మృతి మే లగు నర్థసంయు
తుం, డని మును నాకు నిచ్చె నొకయంగన జేసఆకంబు
గాంచి త, జ్జనకుఁడు వేఱ యొక్కనికి సంపద గల్గుట నీఁ
దలంచినం, గని ప్రతికార మెద్దియునుఁ గానక కానకు వచ్చి
చెచ్చెరన్. 7

వ. సాహసంబున నిజశిరఃఖండనంబు సేయుట కనుమతించితి
ననిన. 8

క. దరహాసము సేయుచు నా
కరవాలము పుచ్చివైచి కరతలమున నా
కరయుగళ మలమి పట్టుచుఁ
గరుణ నతం డిట్టు లనియె గారవ మెసఁగన్. 9

క. తనుఁ దానె హత్య చేసిన
మనుజున కిహపరసుఖములు మాలుట తథ్యం
బన వినవె? యిట్టి పాతక
మునకుం దొడరుదురె? యింత మూర్ఖులు గలరే?. 10

క. వెడఁగుఁదన ముడుగు ధనములు
పడయు నుపాయములు గలవు బహువిధములఁ దా
మెడఁ దునిమివైచి క్రమ్మఱ
నొడఁగూర్చి సజీవుఁ జేయ నొఱపులు గలవే. 11

వ. ఇవ్విధంబునం బలికి యనంతరంబ చర్మభస్త్రిక చూపి యిది
కల్పక్రమంబున లక్షదాయి యై యుండు దీనివలన నర్థంబు

వడయు నుపాయంబు సెప్పెద విను మని యి ట్లనియె. 12

క. వణిజులకు నొండె నొండెను
గణికలకుం గాని దీనఁ గాంచిన లాభం
బణుమాత్ర మైన నొరులకు
గణియింపఁగ రాదు వా రకల్మషబుద్ధిన్. 13

సీ. ధర్మమార్గంబునం దడవినసొమ్మెల్ల
ధరణీసురల కర్థి దాన మిచ్చి
యన్యాయమునఁ గొన్న యర్థంబు దమచేతఁ
గోల్పడ్డవారికె కోరి యిచ్చి
తొలుతగా నొకతీర్థజలములం బరిశుద్ధ
దేహు లై తగ నిష్ట దేవపూజ
లొనరించి నాఁ డెల్ల నుపవాసముగ నుండి
యజినరత్నమునకు నర్చ లిచ్చి

తే. యొండు దలఁపుఁ దలంపక నిండుమనము
తోడ నున్నంత మఱునాఁడు తొలుతఁ దత్తి
లక్షధన మిచ్చుఁ బ్రథమకల్పమున కిదియ
తెఱఁగు నెలనెల నియతిమై మఱియుఁ గోరి. 14

క. వ్యయ మై మిగిలిన ధనములు
దయ భూసురకోటి కిచ్చి తా రవనిఁ గుశా
శయనమున నున్న నాల
క్షయముఁ దప్పక యిచ్చుచుండు శాశ్వతవృత్తిన్. 15

తే. అని కృపారసపరిపూరితాత్ముఁ డగుచు
నన్నుఁ గనుఁగొని వెండియు నమ్మఁ బలికె

యతివిచిత్రచరిత్రుఁ డై యాక్షణంబ
తపసి దర్శనమార్గంబు దప్పఁ గ్రుంకె. 16

సీ. ఇత్తెఱంగున నమ్మునీంద్రుచేఁ గాననాం
తరమున నజినరత్నంబు వడసి
సాహసికత్వంబు సాలించి యింటికిఁ
జనుదెంచి యత్యంతసమ్మదమున
మేలు చేరిన మహీపాలున కెఱిఁగించి
యనుభవించుట నీతి యని తలంచి
ధరణీశ! నీకు నింతయుఁ జెప్ప వచ్చితి
నుత్తమద్రవ్య మై యున్న దీని
తే. నెన్నిభంగులనైన న న్నేమఱించి
కొనఁగఁ దలఁతు రనేకులు క్రూరకర్మ
లట్లు గావునఁ గరుణ నీ వరసి వారి
చేతఁ గోల్పడకుండ రక్షింపవలయు. 17

క. ఇది విన్నపంబు క్రమ మి
ట్లు దడంబడ కధిపుమ్రోల లోకులు వినఁగా
మృదువాక్యంబులఁ బలుకుము
మది దీనికి సమ్మతించు మనుజాధిపుఁడున్. 18

వ. పదంపడి *కార్యచాతుర్యంబునం జౌరులధనంబు లప
హరించి. 19

ఆ. అజినరత్నలబ్ధ మైన ధనం బను
పేర ననుభవించి చోరవృత్తి

* శౌర్య.

నోరు లెఱుంగకుండఁ బురములో మనకు వ
ర్తింపవచ్చు సంశయింపవలదు. 20

క. ధనవంతుఁ డైన నిన్నుం
గని మీమామయును నిచ్చుఁ గన్నియ నిది దా
ననుమానింపఁగ వలవదు
కనియవలయు నర్థపతికిఁ గీడొనరింపన్. 21

క. చలమున మనము దగు మా
యలు పెట్టుచు గాని నేసి యాతనికలిమిం
బొలియింత మిదియ కర్జము
తలకొను మీపనికి నొండు దలఁ పుడిగి మదిన్. 22

వ. అని కఱపి పుచ్చిన ధనమిత్రుండును మదుక్తప్రకారం బనుష్ఠించి యతిప్రకాశంబుగా నమ్మహీశ్వరుకారుణ్యంబు వడసి వచ్చి విచ్చలవిడి నభిమతభోగంబు లనుభవించుచుండె. 23

క. మును చెలియైన విమర్దకుఁ
డను భాగమువానిఁ బిలిచి యర్థ మతనికిం
దనివోవ నిచ్చి తగ నేఁ
బనిచితిఁ గపటమున నర్థపతిఁ గొలువంగన్. 24

వ. పనిచిన. 25

ఉ. వేడుకతో విమర్దకుఁడు విశ్వసనీయుఁ డనంగఁ జూచి తా
నీడయుఁబోలెఁ దోఁ దిరిగి నెయ్యముకల్మివిధంబు దెల్పఁగా
నీ డగు మాటలం బనుల నిచ్చలు నిచ్చకు వచ్చుభంగి గి
ల్పాడి తదంతరంగము బయల్పడ మా కెఱిఁగించు నిచ్చ
లున్. 26

వ. అంత నొక్కనాఁడు. 27

తే. కామమంజరి చెలియలు కమలనయన
రాగమంజరి యనియెడు తీఁగఁబోఁడి
యొక్కసత్సభ నర్తించుచున్న నేము
నచటి కరిగితి మర్థితో నాట చూడ. 28

వ. చని యవలోకించుచుండి. 29

ఉ. దానితనూవిలాసములు దానియపాంగవిలోకనంబులుఁ
దానిమృదుప్రియోక్తులును దానివివేకము దానిగానవి
ద్యానుగవర్తనంబు హృదయంబున నెక్కొన నప్పుడచ్చటం
దేనియఁ బడ్డ యీఁగగతి ధీరతఁ గోల్పడి బిట్టు *చొక్కితిన్.

క. మగువయు నాదెస చిత్తము
దగులంగా నృత్తచతురతావైభవముల్
డిగ విడిచి మదనుబారికి
నగపడి పవనావధుతలతాకృతి యయ్యెన్. 31

వ. అయ్యతివ యతిచతుర గావున నిజప్రకృతి బయల్పడకుండ నృత్తప్రకారంబు నడపి తత్సమయావసానంబున విలోల మానసంబున బోటికత్తియలు దోడ్కొనిపోవ నరిగె నేను నుదారకు నర్మాలాపంబులకు సిగ్గును మదనతాపంబునకు బెగ్గలంబు నొందుడెందంబుతోడ మందిరంబునకుం జను దెంచి సముచితకరణీయంబు లెట్టకేనియు నాచరించు. 32

ఉ. భావజు బాణపంచకముబారికి వెన్నెలవెల్లివారికిన్
గోవపికవ్రజంబునునుఁగూఁతకుఁ దుమ్మెదపిండుమ్రోఁతకున్
మావిడిమోఁకలేఁదలిరుమంటకుఁ గోర్కులు కోసితింటకున్
భావగతుల్ కరం బలరఁ బల్వగలం దురపిల్లుచుండితిన్. 33

* చిక్కితిన్.

వ. మఱునాఁడు. 34

క. సంతాపవేదనాభర
మంతయు మది నిగుడ మందిరారామసరః
ప్రాంతలతాగృహమున నే
కాంతమ యేఁ జిగురుసెజ్జ నలయుచు నున్నన్. 35

క. మారవికారప్రతిక్రియ
పారంగతుఁ డంతరంగబంధుఁడు కరుణా
పూరితసరళస్వాంతుఁ డు
దారకుఁ డేతెంచి కాంచి తా నిట్లనియెన్. 36

మ. చెలికాఁడా! భవదీయచిత్తమునకుం జేడ్పాటు వాటిల్లెఁ గో
మలియాలోలకటాక్షవీక్షణములన్ మందస్మితజ్యోత్స్నలం
దెలియం జూచితి నాసరోజముఖియుం దెల్లంబు గావించె సం, చలతం బొందెడు వృత్తభంగుల నిజస్వాంతంబు
చిక్కంతయున్. 37

క. ఇరువుర చిత్తంబులు నొం
డొరువులపై నిట్లు దగిలి యున్నకతమునన్
సరసమగు పొందు చేయఁగ
వెరవగు నెబ్భంగి నైన వేగమ నీకున్. 38

వ. అని పలుకుటయు. 39

తే. కాంత యెఱిఁగియు నామదిఁ గాంతతగులు
కలిమి నమ్మంగఁ జాలక తలఁచుచున్న
చిత్త మొక్కింత యూఱడి సేదదేరి
యెలమి పొందంగ నతనితో నిట్టు లంటి. 40

క. నీయట్టి *సఖుఁడు జగమున
నేయెడలం గలఁడె కూర్మి యెసకం బెసఁగం
దోయజముఖి ననుఁ గూర్పుము
కాయజు పెందాల్మి గాసి కాకుండంగన్. 41

వ. అనిన విని ధనమిత్రుం డమ్మైత్రి వాటించి యప్పనిఁ బూని నన్ను నూఱడం బలికి యొకింత వితర్కించి యి ట్లనియె.

ఉ. వేవురు సెప్పినన్ వినక వేశ్యలచొప్పునఁ బోక యర్థముల్
ప్రోవులు సైచినం గొనక రూపగుణాస్పదమైనఁ జూచి మ
ద్భావము పొందు ముం దెఱుఁగఁ బోఁడిగఁ బెండ్లికి నియ్యకొందు నం, చావనితాలలామ దెగనాడి విటావలి నోళ్ల
దెన్నఁడున్. 43

వ. ఇవ్విధంబునం బ్రతినలు పట్టియున్న కూఁతు ననేకవిధంబుల బోధించి (త్రిప్పఁ) జాలక తల్లి యుల్లంబునం దల్లడిల్లి మహీశ్వరుం గానం జని దేవా! దేవరపిన్నవరవుడు రాగమంజరి లంజియలచొప్పు దప్పి వివిధధనంబు లిచ్చు భుజంగకోటి నొల్లక తనవలచువాని నెవ్వానినేనియుం బెండ్లియగుదు నని ప్రతిజ్ఞ చేసి మాచేత మాన్పరాకున్న యది మరలుఁదనం బున నింక నొక్కని తెప్పునం బడి పోవంగలయది గావున మమ్ముం గరుణించి యి ట్లని యాజ్ఞ సేయవలయు మాధవ సేన వెలిగా రాగమంజరి నెవ్వఁడు గోరు వాఁడు నాచేత సర్వప్రాణాభిమానంబుల దండితుం డగువాఁ డని చాటించు నది యని దండప్రణామంబు చేసిన నతండును సకలజనం బులు నెఱుంగునట్లు సాటించిన నది కారణంబుగా విట

* చెలుఁడు.

జనంబులు విచ్చలవిడి నమ్మదిరాక్షి యెదురం బొలయ మా
టాడనెత్తరువునం జేరంగ నోడుదురు *మన తెఱం గెట్లో
యని శంకించెద ననిన విని యిట్లంటి. 44

తే. చేయుకార్య మెయ్యది యను చింత యేల
చెలువ నాదెసఁ దగులుట చెప్పి తీవ
యిట్లు దలఁపులు దలకూర్తు నెగ్గులాడు
తల్లి నొకభంగి వంచించి యెల్ల రెఱుఁగ. 45

వ. అది యెట్లం టేని. 46

క. ఆనందంబున మాధవ
సేనకు మనతోలుతిత్తి చేర్చెద నని సం
ధానము పుచ్చి తదాత్మజ
నే నడిగెదఁ గపటవిద్య లెన్నటి కింకన్. 47

వ. అని నిశ్చయించి వారియింటికడ నుచితసమయంబుల నెడ
యాడి పొడసూపి యెఱింగించుకొని యజ్జఱభిపాలికింజని.

తే. తగిలి ధనమిత్రు నజినరత్నంబు మీకు
నేన ముచ్చిలి యిచ్చెదఁ బూని మీరు
రాగమంజరిఁ జిత్తానురాగ మెసఁగ
నాకు నిం డని పుచ్చితి నయము మెఱసి. 49

వ. అదియును నప్పలుకులకు మోసపోయి చర్మభస్త్రికవలనం
ధనదానంబులు సేయువిధం బడిగి పుత్తెంచినలోకం బెఱుంగ
నుదారకుండు విన్నవించిన తెఱం గెఱుంగుదుర కదా
తమజాతికిం గోమట్లకు నిదిపసిండి యొసంగుట నిశ్చయంబు
దీనిం గైకొని రహస్యంబుగాఁ గల్పవిధానంబు నడపునది

* అట్లగుటఁ.

యని పుచ్ఛికొన నియ్యకొలిపి మేము నిద్దఱముం గార్యా
లోచనంబు సేసి యర్థపతికి నపాయంబగునట్టి యుపాయం
బుం గని దనమిత్రునకుం గుబేరదత్తతనయం జేర్చికొనుట
ప్రకాశంబుగా నడపువార మై తదనురూపంబు లైన కరణీ
యంబులు నడపం బ్రవర్తిల్లుచుం గొల్లి మాపంపున నర్థపతిం
గొల్చి యలవడ మెలంగి యాప్తుండపోలె నున్న విమర్ద
కుం బిలిచి కఱపి నియోగించిన వాఁడును బలువురుఁ గూడి
యున్న యెడ నుదారకుం జేరి యి ట్లనియె. 50

క. తివిరి యొకరుండు ము న్నం
కువ వెట్టినదాని నడుగఁ గూడునె కలవా
రవుదుర గా కివ్విధమున
నవియంగాఁ బడుట కర్జ మగునే మీకున్. 51

వ. నన్నేలినవానిం జీరికింగొనక కులపాలిక కట్టడతలఁపు వినుము.

తే. అర్థపతి (నాబహిః) ప్రాణ మగుట యెపుడు
నెఱుఁగవే దానికొఱకుఁ జిచ్చుఱికియైనఁ
బాప మొనరించి యైనను నోపి నిన్ను
మసఁగి మర్దింపకున్నె విమర్దకుండు. 53

ఆ. తొలుతి త్తి వడసి తోరంపుఁగావ వై
నీవు చిఱుమ నేల నేఁటిరాత్రి
కంటఁ బిడుకఁ బ్రామి గర్వంబు గిర్వంబు
నుడుప నైతినేని నొట్టువెట్టు 54

క. అని బెట్టిదములు పలికిన
విని సభ్యులు తన్నుఁ గినియ వెండియు నచ్చో

ననుచితములు పలుకుచుఁ బో
యె నతం డుద్ధతుఁడపోలె నెక్కడకేనిన్. 55

క. అరిగిన నుదారకుండును
బరిభూతుఁడపోలె సాధుభావముతోడన్
దొరల కెఱిఁగించి వారలఁ
గరి గొని యేతెంచె నింటికడకుఁ గడంకన్. 56

వ. అంత. 57

క. జక్కవలు చెదరఁ గమలము
లొక్కమొగిన్ మొగుడఁ గైరవోత్కరములకున్
మక్కువలఁ దేంట్లు మునరఁగఁ
గ్రక్కున నినుఁ డపరశిఖరికడకుం జనియెన్. 58

వ. తదనంతరంబ. 59

ఉ. దూరమునం బదార్థములు దోఁపక యుండఁగ మున్ను పర్వె
నన్, జేరువవానిఁ గస్తలువు సేయుచు లోచనవృత్తి మా
న్పుచున్, జారులు చోరులుం గరము సంతస మందఁగఁ
జీకువాలు పెం, పారె జగంబు వెగ్గలము నచ్చెరుపాటునుఁ
బొంద సాంద్రమై. 60

వ. అట్టియెడ. 61

క. మామందిరంబుకుడ్యం
బేమిరువురుఁ గూడి కన్న మిడి యడుగుల చొ
ప్పేమియు నెఱుఁగకయుండం
గా మాటితి మప్పుడేను గడు నుత్సుకతన్. 62

సీ. ధనమిత్రునకు నందుఁ జనియెద నని చెప్పి
నవ్వుచు నజినరత్నంబు పుచ్చి

కొని మఱి ప్రియాగృహంబున కేఁగి యచ్చోట
మున్న సంకేతించి యున్న యెడకుఁ
జొచ్చి మాధవసేన నిచ్చమై నల్లన
తెలిపి దానికిఁ దోలుతిత్తి యిచ్చి
కామమంజరికి నొక్కతెకు నెఱింగించి
రాగమంజరి ననురాగ మెసఁగ
తే. నపుడ వరియించి వారల యనుమతమున
నేను నదియును మాయింటి కేఁగుదెంచి
మదనుఁ జరితార్థుఁ గావించి మగుడ మగువ
ననిచిపుచ్చితి వేకువ యయ్యె నంత. 63

క. మును నిగిడెడు నరుణాంశులు
వనజంబుల కెంపు గలసి వన్నియ మిగులం
దనుఁ గని లోకం బలరఁగ
నినుఁ డుదయాచలముశిఖర మెక్కెం బ్రీతిన్. 64

వ. ఇట్లు సూర్యోదయం బగుటయుం దత్కాలోచితకరణీయంబు లాచరించి యిల్లు ముచ్చులు చొచ్చుట పౌరు విండ్లవారు విన నాఘోషించి రాజు నవసరం బెఱింగి యేను గఱపి పుచ్చ నుదారకుండు నగరికిం జని తన యజినరత్నంబు కన్నంబునం బోయె నని ఖిన్నవదనుం డై విన్నవించి వెండియు నిట్లనియె. 65

క. కారణము లేక నాతో
వైరము గొని యర్థపతి వివేకవిహీనుం
డై రేయుఁబగలు నుడుగక
పోరాడుచు నుండు నర్థమునగర్వమునన్. 66

క. అతనికిఁ బ్రాణముకం బైను
హింతుఁడు విమర్దకుఁడు పౌరు లెల్లను వినఁగా
నతిమానుషములు పలికెను
గతభయుఁ డై క్రొవ్వి గన్నుఁ గానక నన్నున్. 67

వ. అని పలికి సభ్యులు గన్ను వారించుచుండ నంతం దని వోవక. 68

ఆ. తోలుతిత్తి వడసి తోరంపుఁగాఁప వై
నీవు చిలుమ నేల నేటిరాత్రి
కంటఁబిడుకఁ బ్రామి గర్వంబు గిర్వంబు
నుడుప నైతినేని నొట్టువెట్టు. 69

వ. అని యిడుపులు సాటుచుం జనియె. 70

క. కావున నాతఁడు మ్రుచ్చగు
నావిజ్ఞాపనము బొం కనం జన దిటమీఁ
దే వెఱతు విన్నవింపఁగ
నావుడుఁ గరుణించి ధరణినాథుం డనియెన్. 71

చ. అడలఁగ నేల యీక్షణమ యర్థపతిం బిలిపించి తెల్లఁగా
నడిగెదఁ జొప్పు దప్పు నతఁ డాడిన నప్పుడ పట్టి కట్టి పెక్
మడువునఁ ద్రొక్కఁ బంచెద విమర్దకు నాలుక వ్రయ్యఁ గోసి
త్రు, ళ్ళడచెదఁ జర్మరత్నము రయంబునఁ దెచ్చెద నీకు
నిచ్చెదన్. 72

మ. అని యర్థాధిపతుల్యు నర్థపతి నన్యాయాత్మునింగా మనం
బున గాఢంబుగ నిశ్చయించి యలుకన్ భూపాలకుం డప్పు
డాతని నచ్చోటికిఁ బిల్వఁబంచి మృదులోదారోక్తి శోభిల్ల

ని, ట్లనియె న్నీకు విమర్దకుం డను భటుం డాప్తుం డటే? చెప్పుమా. 73

క. నావుడుఁ బతితలఁ పెఱుఁగక
దేవా! యగు ననిన రా జతిత్వరితముగఁ
రావింపు మనుడుఁ బోయె ని
జావాసంబునకు నతని నారసి తేరన్. 74

వ. చని యయ్యెడం గానక వానిగృహంబునుం దత్సంచారప్రదేశంబులు నరసియుం గపటప్రకారం బని యెఱుంగ వెరవు లేక పురంబు గలయం బరిభ్రమించి తల్లడం బడర మహీవల్లభుకడకు మరలం జనుదెంచి దేవా! వాని వెదకితిం గాననినఁ గోపించి యతం డర్థపతిం జెరసాలం ద్రోయించె నిట్టు కామమంజరి చర్మభస్త్రికాకల్పక్రమం బాచరింపం దొడంగి యన్యాయార్జితధనంబు లయ్యైవారిక యిచ్చుచుండి జినమునివేషంబున నున్న విరూపకు రావించి వాని వసునిచయం బెల్ల నిచ్చి వసుపాలితనామం బన్వర్థంబు గావించిన వాఁడును మదీయోపాయలబ్ధధనుండై నావలనం బ్రీతిం బొంది నిజవ్యవహారంబుల వర్తిల్లుచుండె నజ్జఅభిజంతయు నజినరత్నమోహాశంజేసి కలకలిమి యెల్ల మృద్భాండశేషంబుగా వ్యయంబు సేసెం దత్సమయంబున నేను విచారించి యింక నొండుభంగి సేయక యెడ సేసితి నేనిం దోలుతిత్తి పసిండి గురియుట బొంకగు టెఱింగినఁ గర్జంబుగా దని యొక్కయుపాయంబు దలంచి ధనమిత్త్రుం గలపి పుచ్చిన వాఁడును జనపతిపాలికిం బోయి నాస్వామ్ము చేరిన

దెస కొంత యెఱింగితిం బోలునేని నవధరింపు మనుచుం
దండప్రణామంబు సేసి చేతులు మోడ్చి యిట్లనియె. 75

మ. ధరణీవల్లభ! విన్నపంబు ధనలుబ్ధస్వాంత యై లోభమం
జరి నాఁ జేర్కొను కామమంజరి కృపాసంపూర్ణచిత్తంబు
తో, విరియం జల్లెడు వేనవేలు విధి సుర్విం జేద లై యున్న
భూ, సురబృందమ్ములమీఁద నచ్చెరువుగా సొమ్మెల్ల
నానాఁటికిన్. 76

తే. అజినరత్నకల్పంబుల కనుగుణంబు
లైన చెయ్వులు మాధవసేనయింటఁ
జెల్లుచున్నవి వీటివా రెల్ల నెఱుఁగ
దేవ! *యిట నిర్ణయింపంగ నీవ నేర్తు. 77

క. అనిన నది వోలు మ్రుచ్చిలి
ధనములు లంజియఁ జేరఁ దథ్యముగా నో
పునె యరసి చూత మని య
మ్మనుజేంద్రుఁడు పిలువఁబంచె మాధవసేనన్. 78

క. అదియును గార్యముఖం బి
ట్టిది యని తా నెఱుఁగ కునికి డెందములోనన్
బెదరక తొల్లిటిక్రియ నృప
సదనమునకుఁ బోవ నధికసరభసవృత్తిన్. 79

వ. ఉన్నట్టియెడ నంతకుమున్న చొచ్చి యేమి పుట్టునో యని
యేను మాధవసేనమందిరంబునన యునికిం జేసి. 80

క. చదురుందనమున మును దా
మదిఁ గనిన యుపాయ మీసమయమునఁ దగఁ జే

---

* యిది.

యుదు నని యేకాంతంబున
ముదిజఱభిం బిలిచి నిపుణముగ ని ట్లంటిన్. 81

తే. వెల్లవిరిగాఁగ భూజను లెల్ల నెఱుఁగ
మీరు దానధర్మంబులు మేర దప్పఁ
జేసి యేకాంత మంతయుఁ గాసి పెట్టఁ
గడఁగి చిడిముడిపడుటయ కారణముగ. 82

వ. చర్మరత్నంబు మీ యొద్దన యునికి యూహించి పిలువఁ బంచెనో యని శంకించెదం గల్పక్రమంబున నడపుటకు మీరునుం గడువేగిరపడితిరి రాజులు తోడరిన ధనంబు లొప్పింపవలయు వసుమతీశ్వరుండు నిన్ను రావించినపని యదిగాక తప్పె నేనియు మనభాగ్యంబ య్యేడు నిదియ యగు నేని యేమి సేయంగలవార మనిన విని మాధవసేన వడవడ వడంకుచుఁ గామమంజరిం గూడఁ బిలిచి యిత్తెఱం గెల్ల నెఱింగించి శంకాకులమానస యయ్యె నంత నదియునుం దానును నాతో ని ట్లనిరి. 83

మ. ఇది నేఁ జెప్పినయట్ల వెల్లవిరియయ్యెన్ గూఢకార్యంబు వో లదు నాఁ బోలు ననా దురాశలకు మూలం బయ్యె లోభం బు రా, జదయుం డై పొడువుండుకొట్టుఁ డని యాయాసం బునం బెట్టినం, దుది నీ కిచ్చు తెఱంగు చెప్పవలయున్ ద్రోహంబు గాకుండఁగన్. 84

వ. అనిన నే ని ట్లంటి. 85

ఆ. ఏను జోరవృత్తి నిచ్చితి నేనియు
మేలివస్తు వైన తోలుతిత్తి

డక్కు నెట్టు మీఁకుఁ గుక్కకుఁ డెంకాయ
దక్క దనిన పలుకు నిక్క మయ్యె. 86

ఆ. నయము సూపిరైన భయముననైనను
ధరణివిభుఁడు దాని నరయనట్టు
లడఁపరాక యిచ్చునప్పుడు ననుఁ జూపి
యిచ్చి యేమి వడయవచ్చు మీకు. 87

వ. అని మాధవసేనమొగంబు చూచి మఱియు నిట్లంటి. 88

క. ఇది మిముఁ జేరినవిధ మె
య్యది యని భూవిభుఁడు మిమ్ము నడిగిన మదిలో
బెదరక లంజెలతల్లుల
చదురుఁదనము మెఱయవలయు సభ లియ్యకొనన్. 89

ఉ. కావున వేయునేటికిఁ బ్రకాశముగా మును తస్కరత్వసం
భావితుఁడైన యర్థపతిపై నిడి మ్రుచ్చిమి నన్నుఁ దప్పఁగాఁ
ద్రోవుము దిట్టవై వెఱపుతో నటు సేయఁగఁ జాలకుండినన్
భూవరుచేఁతలన్ బ్రదుకఁబోలునె మీకును నాకు నెమ్మెయిన్.

క. నను నొకమెయిఁ గాచిన నీ
తనయయు మది సంతసించు దానికినై జీ
వన మే వెదకుదుఁ బదపడి
మనుగడ దొరకొనుఁ గ్రమక్రమంబున మనకున్. 91

వ. అనిన విని మాధవసేన నాచెప్పినది కార్యంబుగాఁ గైకొని
యిట్లు చేయుదాన నని పూని నగరికి నరిగి నరపతియాస్థా
నంబు దఱియం జొచ్చి నిర్వికార యై ప్రణమిల్లిన సంతసిల్లి
సింహవర్మ యమ్మాధవసేనం జూచి యిట్లనియె. 92

తే. మీగృహంబున నీధనమిత్రు నజిన
రత్న మున్నది దెలియ నారసి యెఱింగి
నిన్ను గాంచితిమి నీవు నున్న రూప
మేర్పడంగ జెప్పు మది మీకు నెట్లు సేరె?. 93

వ. అనిన విని యదియును దేవా! దేవర పిలిచి యడుగ బొంకు
పలుకుట ప్రాణగోడ్డంబు చర్మభద్రిక మాయొద్ద నునికిగల
దనధరింపు మని యి ట్లనియె. 94

సీ. కన్నంబు వెట్టి తెక్కలిగొని యంకంబు
పలువురతో నాడి బందివట్టి
జూదంబునకుం జొచ్చి చూఱకాండ్రం గూడి
పరదేశముల కేగి తెరువు లడిచి
యాలి రో యిడి తల్లి నాంగి బిడ్డల నమ్మి
కన్న తండ్రులతోడం గయ్యమాడి
రాజులం గొల్చి క్రూరంపుంజెయ్వులు సేసి
లజ్జాభిమానంబు లుజ్జగించి

తే. ధనము లార్జించి మిండాటమునకుం జొచ్చి
యిచ్చుం గ్రీడింతు రింతవ ట్లెటెఱింగి యెఱింగి
యజినరత్నంబు మీ కిచ్చినాతం డెవ్వం
డతని నెఱింగింపు మని నన్ను నడుగం దగునె. 95

క. అనవుడు నది యగు నైనను
మన నెఱింగిన తెఱంగు నీకు మా టిడంగా వ
చ్చునె చెప్పకున్నం ద ప్పని
మనుజాధిపుం డాజ్ఞ సేసె మాధవసేనన్. 96

వ. ఆజఱభి భయంబు నటించుచు ని ట్లనియె. 97

ఉ. ఈతఁడు మాకు నిట్టి ధన మిచ్చినవాఁ డను టెల్ల లంజికా
మాతకు నీతి గా దుచితమార్గము దప్పుటఁ జిట్టుపాటు నీ
చేతఁ బరాభవంబు వడి చెప్పుట కష్టము చెప్పకుండ రా
దీకెఱుఁ గెల్లఁ జెప్పెద మహీశ్వర! యెయ్యది యెట్లు
వోయినన్. 98

క. నాకూఁతుఁబొజుఁగు వినుము నృ
పా! కట విటవైశ్యుఁ డర్థపతి యను నాతం
డేకతమ యజినరత్నము
చీఁకటి నొకనాఁడు దెచ్చి చెచ్చెర నిచ్చెన్. 99

క. అనిన విని యర్థపతిఁ దలఁ
దునిమించెద ననియె నలుకతో నధిపతి యా
తనికిఁ గృప పుట్ట నయ్యెడ
ధనమిత్రుఁడు సాఁగి మ్రొక్కి తా నిట్లనియెన్. 100

చ. వణిజులు తప్పు చేసినను వారల దండువ పెట్టఁ బంచి త
న్మణికనకాదివస్తువులు *మానక గైకొని వీటిలో సుహృ
ద్గణములఁ బొందకుండ నెడ గా నడుపం దగుఁగాక వారు
దు, ర్గుణు లని మేదినీశ్వరుఁడు కోపమునం దెగఁజూడఁ
బాడియే?. 101

క. అను పలుకు లమ్మహీశుఁడు
విని యతని దయాగుణంబు వేడుకతోడన్
గొనియాడి యర్థపతి ని
ర్ధనుఁ జేయుచుఁ బురము వెడలఁ దడయక యడిచెన్. 102

* మానకఁ.

వ. ఇట్లు నిష్కారణంబుగ నాదుమాయోపాయంబుల మోస
పోయి సింహవర్మ యర్థపతిం జండించి యజినరత్నంబు
కల్పక్రమంబున దరిద్రుఁడైన మాధవసేనకు వానియర్థంబు
నందుఁ గొండొక యిచ్చి దానియింట నున్న చర్మభస్త్రికఁ
దెప్పించి ధనమిత్రున కిప్పించిన నేము రహస్యంబున నమ్మహీ
పతిమాధవసేనార్థపతుల నపహసింపుచు నిశ్చింతంబున
నుండితిమి. తదనంతరంబ కతిపయదినంబులకుఁ గుబేరదత్తు
నకు నభిమతార్థంబు లొసంగి యుదారకుండు కులపాలికం
బరిణయం బయ్యె. నేనును రాగమంజరివలన భోగాయత్త
చిత్తుండనై నానాఁటికి. 103

క. పురుషార్థము వెలిగా నీ
పురమున ధనవంతు లైన పురుషుల నెల్లన్
దిరిపరుఁ జేసి ముచ్చిమి
వెరవున నిక్కంపు సాధువేషముతోడన్. 104

వ. ఇట్లు కుశలుండనై వర్తిల్లుచుండియు నగపడ్డతెఱం గవ
ధరింపుము. 105

మ. మనుజుం డెంతటివాఁడు దైవకృతముల్ మానింప లేఁ డొ
క్కనాఁ, డనురాగంబున మద్యపానరతిమై నన్యోన్యగండూ
షసం, జనితప్రీతి మనోరమాసహిత మిచ్ఛాలీల వర్తిల్లి చే
తనవైకల్యముఁ బొంద నిల్వెడలి యుద్యత్తీవ్రఖడ్గంబుతోన్.

వ. అర్ధరాత్రసమయంబున రాజవీథిం జనిచని యొక్కయెడ.

మ. మదిరోన్మాదము మిక్కుటం బగుడు నున్మార్గప్రవర్తుండనై
యిది కార్యం బవకార్య మిట్టి దని యూహింపం దలం పేది

బె, ట్టిదులై వచ్చుచున్న యారెకులం గంటిం [1]గంటి నే
డెందు వ, చ్చెదరంచుం జనం జొచ్చి యల్కాక కరాసిం
గ్రారచేష్టుండనై. 108

క. కొందఱం జంపియుఁ గొందఱ
జిందఱవందఱలుగాఁగఁ జెడఁ దోలియు ను
న్నం దొలఁగియున్న యారెకు
లందఱు నొండొరులఁ గూడి యతివేగమునన్. 109

క. పఱతెంచి పట్టి యెమ్ములు
నెఱచియు నొక్కంతగాఁగ నీడ్చియుఁ బెలుచం
జఱచియుఁ బొడిచియుఁ దాఁచియు
గుఱుమూఁకలు గూడఁ గిట్టికొని తమలోనన్. 110

వ. మదీయవృత్తాంతంబు సెప్పికొనుచున్నంత. 111

క. ఒడలెఱిఁగి విధికృతమునకుఁ
గడుఁ జోద్యం బంది పూర్వకర్మఫలంబుల్
గుడువక పో వని చిత్తము
నొడఁబఱచుచు బ్రతుకునాఱపు లూహించునెడన్. 112

వ. రాగమంజరియాప్తపరిచారికయుఁ గూఢకృత్యనిపుణయు
శంఖసంభాషణయు నగు సృగాలిక యనునది నావెనుక
వచ్చినం జూచి తత్కాలోచితంబగు నొక్కయుపాయంబు
గని యది డాయం జనుదెంచిన దానిమొగంబు గనుంగొని
నీవు పిఱుందన పఱతెంచినదానికిం [2]జే రేమి మత్ప్రాణ
వల్లభ యగు రాగమంజరితోడ నాకుం గృత్రిమమిత్రుండైన

1 జేరి యుండెదు. 2 మేలేమి.

ధనమిత్త్రునకు సమాగమంబు సేసితివి గావున వానియజిన రత్నంబును ని న్నేలినదాని యాభరణంబులు నపహరించితిఁ బెక్కుచోట్లు ముచ్చిలి తెచ్చిన ధనంబులు ప్రాణభయంబునం జూపితి నేనియు రెండుదెఱంగులు నొప్పింపం జలంబు సాధ్యం బయ్యె నింక నెట్టైనను వగపు లేదు నీయడియాసలుడిగి పొమ్మనిన నదియును నప్పటిచావు దప్పింపఁ దలవరులకు ధనంబునాస సూపుటకు నాఘటించిన కపటసూత్త్రంబు గనుంగొని దైన్యంబు భావించి. 113

సీ. ధనమిత్త్రు నజినరత్నంబు గ్రమ్మఱ వాని
కిచ్చిన నొకటి మే లీనినాఁడు
రెండు మే లది యటు లుండని [1]మ్మేను ని
న్నర్థితో వేఁడెద నాదరింపు
చిరకాలపరిచర్య చేసిన రాగమం
జరికి నీ వొకతప్పు సైఁపవలయుఁ
దొడవులు వెలిదైనఁ బడపు పుట్టదు వెల
యాలికి నింతయు నాత్మ నెఱిఁగి
తే. యీరసము దలపోయక యీవు తొల్లి
మెలఁత ప్రీతితోఁ జేసిన మేలు దలఁచి
యకట! యిచ్చోట నడఁచితి ననుచు దాని
నిక్క మెఱిఁగింపు మని చాఁగి మ్రొక్కుటయును. 114

వ. ఏను గరుణ భావించికొని తొడవులున్న కందువ సెప్పెద రమ్మని సృగాలికం జేరం బిలిచి నాబ్రతుకుఁదెరువునకుం దగినమాటలు గఱపి యిట్లంటి నిమ్మాటలు ధనమిత్త్రునకుం

[1] మ్మొకటి.

జెప్పినది యీవృత్తాంతంబు రాగమంజరికి నెఱింగించునది నీవు క్రమ్మఱ వచ్చి తోడవులు గాననిదాన వై నన్ను దూఱి పలుకునది యని యప్పటికిం దోఁచిన కార్యంబు గఱపెద ననిన నది తోడవులు గనినయదియ పోలె సంతోషించుచు నన్ను దీవించి చనియె నా రెకులు నాచేత ధనంబులు చూపించుకొనువా రై పతి కెఱింగించువా రై సంకలియలం బెట్టిరి మఱునాఁడు కారాగృహాధ్యక్షుండగు కాంతకుం డను వాఁడు నాకడకుం జనుదెంచి. 115

ఉ. తర్జనసాంత్వనక్రియల దండము సామముఁ జూపిచూపి చౌర్యార్జితమైన సొమ్ము గొనునాస ననేకము లాడి యస్మదీయోర్జితగర్వయుక్తకఠినోక్తులకుం జెఱునవ్వు నవ్వుచుఁ గర్జము చెప్పి నామనసు గానక యప్పుడె పోయెఁ గ్రక్కునన్. 116

ఉ. అక్కట! మాయ వెట్టి కలయాభరణంబులు దెచ్చి డిట్టయై నిక్కమపోలె న న్నిలిచి నెట్టన కందువ చెప్పినట్లు వే ఱొక్కెడ చూపె వీఁడు మొఱయో యనుచుం జెఱసాల లోనికిఁ, గ్రక్కున నేఁగుదెంచిన సృగాలికఁ జూచి తలారులందఱున్. 117

తే. మంచి నిక్కముగలవాని మాట నమ్మి
తోడవులకుఁ బోయి తేర్పడ నడుగు మింక
నైన నెట్లునుఁ జెప్పక మానఁ డాతఁ
డని యనేకవిధంబుల నపహసింప. 118

క. పడఁతుకయును దీనత న
న్నడుగుచు నుండంగ నేను నదియొఱుఁగవు గా

వెడమాట లాడి పెద్దయుఁ
దడ వునిచితి దాని నచటఁ దగ వై యుండన్. 119

వ. ఆలోన నదియు నల్లన నాతోడ ని ట్లనియె దైవంబు నీ కను కూలం బయ్యె వెఱవ కుండు మె ట్లనిన నేను నీపనిచినట్లు ధనమిత్త్రు పాలికిం జని మద్యపానంబునం బుట్టిన యున్మాదం బునుం దన్మూలంబగు నవమానంబునుం జెప్పి నీవు రాజు సన్నిధికిం బోయి దేవా! తొల్లి యర్థపతియపహరించిన యజిన రత్నంబును నీకారుణ్యంబునం జేరె నిప్పుడు రాగమంజరికి మగం డైనవాఁ డొక్క జూదరి నాకుం గపటమిత్త్రుం డై యుండి మిన్నక నన్ను వానితోడి పొందు గల్పించి యెగ్గు లాడి నాయజినరత్నంబును రాగమంజరియాభరణంబులు ముచ్చిలికొని పోయి రాగమంజరిపరిచారికకుం దొడవు లున్న కందువ సెప్పె నజినరత్నంబుఁ గను తెఱంగు దేవర యవ ధరింపవలయు నని విన్నపంబు సేయు మివ్విధం బొనర్చిన నీచెలికానికిం బ్రాణభయం బెడయు నంతకు నాతండును దగిన కపటోపాయం బొనర్చికొన నేర్చు నని యెఱింగించిన వాఁడును నట్ల చేసె రాగమంజరియునుం దలవరులచేత నీ పట్టువడుట నావలన విని వికలచిత్త యై భవదీయచాతుర్యం బున మరణంబు దప్పి యుండుటకుం గొండొక యూఱడిల్లి యున్న యది యని యారెకులసందడిమాటల క్రందునం జెప్పిన నేనును బ్రియం బంది తలవరులు విన నాజఱభి పలు మాఱు నెడఁదాఁకుటకుం దగినయట్టి వెడము లాడ్డి పలికి సృగాలిక నెడ గూర్చికొనుచుండితిఁ బదంపడి శృంఖలా

మోక్షణంబునకు నొకవెరవు గాంచి తగినయవసరంబున నమ్మగువ కి ట్లంటి. 120

సీ. భూనాథనందన యైన యంబాలికఁ
జేరి నీ శోకభంగిఁ జెలిమి చేసి
యయ్యింతికడ నిల్చి యనువునఁ గాంతకు
నకు మది *రాగంబు నాటుకొలిపి
యది వెలుంగకయుండ నతనికిఁ దమకంబు
నానాఁటి కెక్కింపు దాన మనకు
వలయుకార్యంబుల వల నగు నింతయు
రాగమంజరి కనురాగ మెసఁగఁ
తే. జెప్పికొని దానియనుమతిఁ జిగురుఁబోఁడిఁ
గాంచి తగునుపాయనములు గారవమున
మాటిమాటికి నిచ్చుచు మచ్చికయును
బ్రియము పుట్టించి వర్తింపు నయము మెఱసి. 121

క. అని పనిచిన నప్పుఁ గా కని
చని కతిపయదివసములకుఁ జనుదెంచి ప్రియం
బున నేకాంతపుసమయము
గని యి ట్లని చెప్పె నాస్పృగాలిక నాతోన్. 122

క. అలవడ నంబాలిక నేఁ
గొలిచితి నీపనిచినట్ల కుసుమాయుధు త్రి
ప్పఁ బెట్టితిఁ గాంతకు నీ
తలఁపు తలఁపు గూడె వినుము తద్విధ మెల్లన్. 123

వ. ఒక్కనాఁ డొక్కతియ పరిసరంబున వర్తింప నమ్ముద్దియ

---

* చెలువంబు.

సౌధోపరిభాగంబుజాలకంబుచక్కటి నడయాడు నవ సరంబునం గాంతకుండు న న్నరసి యచ్చేరువ నొరసికొని యరుగుచుండం గని నాచేయం బూనిన కపటసంవిధానం బున క్రియ యవసరం బని తలంచి వలభివలమానపారా పత ప్రహారవ్యాజంబున నతసిం జెంగలువపువ్వున వైచుచు నప్పు డపహాసవచనంబుల నంబాలిక నగిపించిన వాఁడును దానికిఁ బొంగిపోయి యక్కుమారి దన్ను వైచి నగుటకుం గూర్మి పొంపిరివోవ. 124

సీ. కనకంపుఁగోరతోఁ దనతమ్మ యిచ్చినఁ
గొనిపోయి నడుమన కూలఁ జల్లి
భూపాలనందన పుత్తెంచె నీ కని
నాతమ్మ యింపార నములఁ బెట్టి
తలపువ్వు లొసఁగినఁ దలవీటనే వైచి
యిచ్చి వచ్చితి నని మెచ్చు వడసి
నాతలపువ్వులు నలినాయతేక్షణ
తలపువ్వు లని తెచ్చి తనకు నిచ్చి
ఆ. కపట మెఱుఁగకుండఁ గాంతకుఁ గాంతకుఁ
బాలు చేసి చాల బేలు వెట్టి
యిత్తెఱంగు దెలియ నెఱిఁగింప వచ్చితిఁ
జెప్పు మింక నేమి సేయుదాన. 125

వ. అనవుడు. 126

క. నీవెరవుకలిమికిం దగ
దైవం బనుకూల మయ్యెఁ దడయక యింకం

గావింపు కొఱఁతకార్యము
దివసమున నాతలంపు దీర్చెద నేనున్. 127

క. విను మా తెఱంగు నీ వా
తనికడకుం బోయి నళినదళలోచనహాం
దున కెప్పు డెచట నను వగు
నని యాలోచనము సేసి యాసమయమునన్. 128

వ. ఇట్లనుము. 129

క. నీవున్న చోటి కాచెలిఁ
దేవచ్చునె యెల్లభంగి దేవర కవయం
గా వలయు నేనిఁ దగఁ గ
న్యావాసము సొరుము నీవ యనువైన గతిన్. 130

చ. అదియును నెల్లభంగి వెర వారసి చూచితి నొండు లేదు
బె, ట్టిదుఁ డగువాఁడు గన్న యిడి డెప్పర మేమియు లేక
యుండ నం,చెద నని పూనె నేనిఁ దగఁ జేకుఱుఁ గోర్కి తో
డంగు దీని కిన్, మదనునిచేత నమ్మగువ మానము దూలక
మున్న గ్రక్కునన్ 131

గ. మనకుంగన్న(పు)మ్రుచ్చు మంచివాఁడు కలిగెనేని మనో
రథంబు సాధింప నగు నను మని కఱపి పనిచిన నదియునుం
జని కాంతకుతోడం జతురంబుగాఁ బలికిన వాఁడును నదియ
కార్యంబుగాఁ గొని సంతసిల్లి సృగాలిక కిట్లనియె. 132

. వీఁడు మ్రుచ్చగు నని వెఱవక పలుక సం
శయ మగు సాధువేషంబువాఁడు
గాలికిఁ జొరరాని కందువ లైన నొ
య్యనఁ జొర వెరవరి యైనవాఁడు

ద్రవ్యంబు డిగఁ ద్రావు దానగుణంబుఁ దా
నేర్చి కైకొనిపోవ నేర్చువాఁడు
ముట్టినఁ గలగొన్న మ్రుచ్చు విధమున మై
సూపక *తిరిగిపో నోపువాఁడు
తే. తన్ను వెదకెడివారికిఁ దాన తోడు
నడచి చెదరుఁ డై మేడ్పడి యడుగువాఁడు
సూవె మీతోడవులు వెలిచూప కిపుడు
సంకలియ నున్న యాతండు సరసిజాక్షి!. 133

వ. అతని బుజ్జగించి లోను చేసికొని చెఱ విఱుగఁ జేసెద నని వెడ్డువెట్టి కన్నంబు పెట్టించికొని రాజునకుం జెప్పి యిప్పుడ సంకలియ పుచ్చి యనిచి పుచ్చెద నని యూఱడించి మగుడ శృంఖలాయమితుం గావించి సురంగముఖంబునం జొచ్చి యచ్చెలువచిత్తంబు చిత్తభవకేళిచాతుర్యంబున నాఁచికొని నిగూఢనిపుణత్వంబు మెఱయం జనుదెంచెదఁ బదంపడి వానిం జంపించునట్టి తెఱంగు మాటలు మనుజేశ్వరునకుం జెప్పి మెడ గోసి వైచెద నట్లుగాక తక్కిన మ్రుచ్చుచేత మనరహస్యంబు వెల్లివిరి యగు. నిశ్చయించి యట్లు సేయుదము నీవ యప్పటియట్ల చని తొడవు లడుగుచుండుము నే నిదె వచ్చెద నని పుత్తెంచిన నదియును. 134

క. చనుదెంచి నాకు నింతయు
మునుమున్న యెఱుంగఁ జెప్పె మోదంబున నే
నును నాదుకోర్కి చేకుఱె
నని పొంగియు మోము తొంటియట్లన యుండన్. 135

* నురిగి

వ. ఏమియు నెఱుంగనివాఁడన పోలె నున్నంత. 136

క. తనతలఁ పొడఁగూడెనె యని
మనమున సంతసముపేర్మి వెలయుచు వేవే
చనుదెంచెం జెఱసాలకు
నను జూచుచుఁ గాంతకుండు నగుమొగ మొప్పన్. 137

వ. ఇట్లు చనుదెంచి యాజఱభి పలుమాఱును దొడరు తోడ
వుల పెనఁకువఁ దీర్చుటకు ననునొంటి మెయి శాసించువాఁడు
నుం బోలెఁ బరిసరవర్తుల నెడ గలుగం బుచ్చి చేరి యల్లన
ని ట్లనియె. 138

తే. నిన్ను నమ్మితి నామది నున్న తెఱఁగు
నీకు నంతయుఁ జెప్పెద నాకు నొక్క
హితవు గావింపు మేదినీపతికిఁ జెప్పి
ప్రీతి యొసఁగంగ నిను విడిపింతు నేను. 139

క. అనిన విని యట్లు చేసెద
నని పూనితి నాఁటిరాత్రి యతఁడును బ్రీతిన్
నను విగళితనిగళునిఁ గా
నొనరించి సురంగ సేయ నొక్కెడ సూపెన్. 140

వ. చూపిన నేనునుఁ గాంతకుండును నిగూఢంబుగా మున్ను
దెచ్చిన కన్న పుఁగొయ్య పుచ్చుకొని కట్టాయతం బై సృగా
లికాసమేతుం డగు నతండును గాఁపువాఁడు గా నిర్భయం
బున గంటి నాచూచినచక్కటికిం ద్రవ్వికొని కన్యాంతః
పురంబు కొలందికిఁ గొండొక నిలిపి మగుడం జనుదెంచిన.

క. చోరవరు నెంతయుఁ దనకును
వెర వని నాచేతఁ దెలియ విని వెడ్డున నన్

మరలు గొలుపువాఁ డై భూ
వరునకు నెఱిఁగించి విడుచువాఁడన యనుచున్. 142

తే. సంకలియఁ బెట్టి వచ్చిన శంక లేక
గుండెతల బిట్టు దన్నినఁ గూలుటయును
రభసమున వాని మొలకఠారమ్ము పెఱికి
శిరము గోసితిఁ బలువడి నురముఁ ద్రొక్కి. 143

వ. ఇట్లు దెగం జూచి వానిచిటికెనవ్రేల నొక్క ముద్రిక మం
చిది యున్నం బుచ్చికొని భయవిస్మయాకులితచిత్త యైన
సృగాలిక నాలోకించి తగినమాటల బెదరు వాపి కొండొక
సే పిచ్చట నిలువు మిదె వచ్చెద నని చెప్పి. 144

చ. బ్రదికితి నింక సంకలియ వాసినచోటికిఁ బోదుఁ గాక నా
కిది యది యేల నాక ధరణీశ్వరనందనఁ జూచువేడ్క నె
మ్మదిఁ బిరిగొన్న మున్ సనినమార్గమునన్ జని యాకొలం
తయున్, బెదరక త్రవ్వి చొచ్చి రమణీయవిహారగృహాంత
రంబునన్. 145

క. అనుచారిణీజనంబులు
దనచుట్టును నిద్ర సేయఁ దల్పతలమునన్
దొనఁ బెట్టిన మదనశరము
ననుఁ గై నిద్రించుచున్న యట్టి లతాంగిన్. 146

చ. కనుఁగొనునంతనామనసుఁ గన్నులు మన్మథుఁ డింతిపాలు
చే, సిన మెలఁగంగలేక గతచేష్టుఁడ నై యిది నిద్రవోవుచో
మనమున కింత పుట్టె గరిమం బగు విభ్రమ మంగకంబు
నొం, దినతఱిఁ జూచువారలకు ధీరత యెక్కడి దంచు
లోలతన్. 147

తే. తమక మడరిన యప్పుడ తలిరుఁబోఁడిఁ
గవయఁ జూచియు ధృతి యూఁది కార్య మరసి
నిద్ర దెలుపుట యుడిగి నా నెమ్మనమునఁ
గొందలముతోడి తలఁపులు సందడింప. 148

వ. ఇట్లని యూహించితి. 149

ఉ. చూడ్కులఁ జిత్తవృత్తి గని చొచ్చి నయంబుగ మాటిమా
టికిన్, వేడ్కలఁ బెంచి యింపులగు విన్నువుల్ దగఁ జేసి
చేసి యా,మాడ్కి సరోజలోచనల మచ్చికమై నెలయించి
యిక్కకుం, దోడ్కొని పోయి కాక మరుతోడి యలంతలు
తీర్పవచ్చునే. 150

మ. నడురే యిప్పుడు నిద్ర దెల్పుటయుఁ గన్యారత్న ముద్వేగ
ముం,దొడర స్వాంతతనంబునం బరిజనస్తోమంబు మేల్కాంచి
సం, దడి సేయం దగ దిప్పు డీయబలఁ జెంతం జేరఁగా
వచ్చు టే, ర్పడఁగా నొక్క తెఱంగు చేసి చనినన్ రంజింప
వచ్చుం దుదిన్. 151

వ. ఏమియుపాయంబులనైనఁ బిదపఁ గార్యసిద్ధికిం దగినభంగి
చూచికొందు నని కందర్ప కారించుట కోర్చి శయ్యాసమీ
పంబున నున్న పలకయుం జిత్రోపకరణంబులుం బుచ్చుకొని
నిద్రానిమీలితయైన యంబాలికారూపంబు చిత్రించి తత్ప
దానతంబుగా మదీయరూపంబు ను వ్రాసి యచ్చేరువ
నొక్కపద్యంబు లిఖించితి నది యెట్టి దనిన. 152

తే. తరుణి! తగుబంట నీపదాంబురుహములకు
మ్రొక్కి యే విన్నవించితి నొక్కమాట

యెలమి రతి సల్పి నాయురస్థ్సలముమీఁదఁ
దక్కఁ దక్కొంట నిద్రింపఁ దగునె? నీకు. 153

వ. తదనతరంబ కాంచనపేటికాసమర్పితంబైన తాంబూలంబు పుచ్చికొని తద్రసంబున సుధాభిత్తిం జక్రవాకమిథునంబు చందంబుగా నుమిసి యంతం దనివోవక. 154

క. మెలపున నయ్యంగనయం
గుళి నొకయుంగరము పుచ్చికొని యపుడు మదం
గుళిముద్ర దానివ్రేలం
జెలువుగ నేఁ దొడిగితిం బ్రసిద్ధము గాఁగన్. 155

వ. అంత నే*ను వెడలివచ్చి యట మున్ను గాచికొని యుండు చండసేనుం డనువానిఁ బిలిచి కాంతకు చావు చూపి యేనిం బొడిచినవాఁడవు నీవు గాఁ జెప్పికొనుము నాయునికి రాజు నెఱుంగుం గావున ధనమిత్రు నజినరత్నంబు ముచ్చిలికొని సంకలియ నున్న ముచ్చుం బనిచి కన్నంబు వెట్టికొని కాంతకుండు కన్యాంతఃపురంబు సొరఁబాఱ నిరువురం బొడివితి వాఁడు దప్పిపోయె వీఁ డగపడె నని జనపతికి విన్నవించి మన్నన వడయుము నేఁడు మొదలుగాఁ బ్రాణసఖుండ వై యుండుము వలయుకార్యంబులకు నీకు నేనును నాకు నీవునుం గా వర్తిల్లుదము సృగాలిక నెరవుగాఁ దలంపక నాతోడిద కా విచారింపు మని కలయం బలికి యొండొరులుం బ్రమాణంబులు చేసికొని యాలింగనపూర్వకంబుగా వీడుకొని యమ్మగువ వెన్నుకఁ జనుదేర నింటికిం జని

* గది.

చని రాజమార్గంబునం దలవరుల నెదురం గని యొండు
తెఱంగున మొఱంగి పోవరామికి విచారించి మరులుఁదనం
బెక్కించికొనియెద నని దాని కెతెంగించి. 156

సీ. చే సంకు వట్టుచుఁ జిడుపలు వెదకుచు
నోరిగాల దేవుచు నులికిపడుచు
విందులు విందులు విందు లంచును బఱ
తెంచి మ్రాఁకులు కౌఁగిలించుకొనుచు
మునుకుచు వెలుఁగుతో ముచ్చట లాడుచుఁ
బోరిపోరిఁ గూయుచు బొబ్బ లిడుచుఁ
గలమాట లాడుచు మొలవుండ్లమల్లనిఁ
బాడుచు నోడ లెల్ల బరికికొనుచు

తే. నేవముగ ఱొమ్ముపై నిండఁ ద్రేవు ద్రోలుక
నన్న! కుడుములు దినవన్న! యనుచు డాసి
గుండ్రగుడ్లను జూపుచు గునిసిగునిసి
బయలు నవ్వుచు బడుకిళ్ళు వాచికొనుచు. 157

క. చనుట గనుఁగొని సృగాలిక
యనుమానము లేక వెనుక నతిరభసమునం
జనుదెంచి యారెకుల కి
ట్లనియెను శోకంబు గదిరినదియును బోలెన్. 158

ఉ. పెక్కుదినంబులేనిఁ జెఱఁ బెట్టితి నిప్పుడు వీనిమాటలం
జక్కన వెట్టితే దీతె నని సంకిల పుచ్చిన పాపజాతి నే
నెక్కడ సొచ్చుదాన మరు లెత్తి తనూజుఁడు పాఱుచున్న
వాఁ, డక్కట! వానిఁ బట్టుకొనుఁడన్న కృపాపరులార!
మ్రొక్కెదన్. 159

వ. అనవుడు వార లి ట్లనిరి. 160

క. చెలి నున్న మరుల్కఁగోడుకుం
దెలఁ గెలఁగక విడిచి వెనుకఁ దిరిగెన వింకన్
బలుచునెడ బట్టఁ జని యే
మఱిముఱిఁ *బోటూటు వడమె యాతనిచేతన్. 161

వ. అనిన విని నే నయ్యారెకులడిక్కు మరలి. 162

తే. నేలఁ జేతులు సమరి మై నిక్క మెల్ల
నఱచి యుంకించి యవుడులు గఱచుటయును
వార లద్దిరా! యని విచ్చి వలియ బాఱఁ
దోలికొని వారి నిలిపితి సూల వాడిచి. 163

వ. దానికి వార లందఱుం బెలుచ నవ్వుచు నరిగిన. 164

క. మరులుఁదన మచ్చుపడ ని
ప్పరుసునఁ దలవరుల మొఱఁగి పాఱితి నిద్రా
పరవశజనమగు హ్మాదయే
శ్వరిసదనంబునకు మిగుల సంభ్రమలీలన్. 165

వ. చని సృగాలికయుం దోన చనం బ్రవేశించి యమ్మెలంతుక నిద్ర దెలిపి సంభ్రమంబునం జేర విరహావివర్ధితరాగ మనోహరంబును నాపదుద్ధరణహర్షోత్కర్షంబును నైన తదీయ సమాగమం బనుభవించి మఱునాఁ డస్మదీయనివాసంబున కరిగి సఖుం గలసి నిగూఢంబుగాఁ జరింపుచు రాగమంజరి వలని మచ్చికయును రాజనందనదెస తగులంబును నుల్లం బున నాటుపడం జిక్కువడియు న త్తెఱం గెఱుకపడకయుండ మదనకళాచాతుర్యధుర్యుం డ నై వ ర్తించుచుండితి నక్కడఁ

* చాళ్లు.

జండ నేనుండును గాంతకుమరణంబు కారణంబుగాఁ బతిచే
నతనిపదంబు వడసె నేనును సామదానంబుల సృగాలిక వశ
వర్తినిం గాఁ జేసికొని నాయంతర్గతం బెఱింగించి దానితో
ని ట్లంటి. 166

తే. రాజనందనపాలికి రమణ నరిగి
యనువు గాంచియు నల్లన యరసి పెరసి
మనరహస్యంబు చెప్పక మగువచంద
మెల్ల నేర్పడ మెయిమెయి నెఱిఁగి రమ్ము. 167

వ. అని పనిచిన నదియునుం జని కొండొకసేపునకు మగిడి వచ్చి
యి ట్లనియె. 168

క. అంబాలికఁ జూచితి నది
శంబరరిపుసాయకముల సందడిఁ బడి యు
ల్లంబునఁ దల్లడ మందుచుఁ
బంబిన తమకంబు తేటపడ ని ట్లనియెన్. 169

సీ. చెలియ! నీ కొక్కటి చెప్పెద విను మది
యింతకుమును బోటు లెఱుఁగ రేను
వేగుఁబోకటఁ గను విచ్చి పర్యంకంబు
చేరువఁ బడియున్న చిత్రఫలక
మందు నిద్రాసక్తి నవతరిల్లిన నాదు
రూపున కాదట మ్రొక్కినట్టి
యతిమనోహరపురుషాకృతియునుఁ బ్రీతిఁ
గనుఁగొని యెంతయుఁ గౌతుకమున
ఆ. దానిఁ బుచ్చికొని హృదయమున నొక్కటఁ
బ్రేమవిస్మయములు పెరిగొనంగఁ

గలయఁ జూచి దానికెలన లక్షించిన
హృద్యమైన పద్య మేను గంటి. 170

వ. కని తదీయార్థంబు నిరూపించిన. 171

ఉ. ఏ యెడ కేఁగుదెంచినను నేర్పడఁ గన్గొని చిత్రనైపుణ
శ్రీ యలవాటు చూపి తనచిత్తము దర్పకతీవ్రబాణతూ
ణాయిత మైనభంగి నిపుణంబుగ నా కెఱిఁగింపఁగోరి యీ
రే యొకరుండు వ్రాసె నధరీకృతమన్మథుఁ డాతఁ డెవ్వఁడో.

వ. అని వితర్కించుచుం దత్కాలజనితంబగు పరావలోకన
శంకాంకురంబునం బ్రచ్ఛదపటంబు పలకకు మాటు సేసి
నలుదిక్కులుఁ గలయం గనుంగొని కుడ్యంబునఁ దాంబూల
రసనిష్ఠీవననిర్మితంబైన చిత్రచక్రవాకమిథునం బవలోకించి
నదియునుం దత్కృతంబ కాఁ దలంచి దినముఖోచితకరణీ
యంబు లోకభంగి నాచరింపుచు నావ్రేల నొక్కవింత
ముద్రిక యున్న దాని వానివ్రేలియుంగరంబ కా నిశ్చయించి.

క. మొగముపయి నప్పళింతును
బిగియారఁగఁ గౌఁగిలింతు బింబాధరసం
గిగఁ జేయుదు మారుఁడు విలుఁ
దెగఁ గొని యలరంపవానఁ దేల్చుచునుండన్. 174

వ. అని చెప్పి యయ్యంగుళీయకంబును జిత్రఫలకముం జూపి
తత్ప్రాంతలిఖితం బైన పద్యంబునుం జదివించి నన్నుం
గలుపుకొని యి ట్లనియె. 175

క. మన కెయ్యది కార్యం బా
తని నెమ్మెయి నెఱుఁగవచ్చుఁ దగులంబున నె

మ్మన మఱియుఁ జొచ్చె మఱచే
సిన యీతోడుసులకు నేమి సేయుదు నింకన్. 176

వ. అని చలించిన. 177

క. మానవుఁ డైన నమర్త్యుం
డైనను గంధర్వుఁ డైన యక్షుం డైనన్
మానిని! యీరూపంబున
వానిం గొనివత్తు నీకు వల నేర్పడఁగన్. 178

వ. అని పూనివచ్చితి నిటమీఁదం జేయవలయు తెఱంగు చెప్పు మనిన సృగాలికం గౌఁగిలించుకొని సంభావించి యంబాలికాసమాగమంబు సుకరంబు గా నూఱడిల్లి యాలోన నెల్లరసంబులం గడచి హృదయంబునం గదురు దేవరవలని తలంపునం జేసి యుదారకసహితుండ నై మరీచిపాలికిం జని యమ్మహామునివలన భవద్దర్శనంబు కుఱంగటఁ గా నెఱింగి సంతసిల్లి మగుడ వచ్చి నిపుణోపాయనిగూఢంబుగాఁ గన్యాంతఃపురప్రవేశంబునకుం బ్రవర్తించి. 179

సీ. కాంతకు పదవి నాకతమునం బడసిన
వాఁడు నమ్మినతాఁపికాఁడు గాఁగ
హితయును జాతుర్యవతియును నైన సృ
గాలిక తా నెడకత్తె గాఁగ
మున్ను నా పెట్టిన కన్నంబు నచ్చోటు
చోరవకునిమ్మగు తెరువు గాఁగ
నిద్రావసరమున నెలఁతసౌందర్యంబు
తొడరిన చిత్తంబు తోడు గాఁగఁ

ఆ. జొచ్చి వనితమనముఁ జొచ్చి క్రీడకుఁ జొచ్చి
యిచ్చ మెఱసి ననుపు నిచ్చ క్రొత్త
చేసికొనుచుఁ జతురచేష్టల విహరించి
యొరు లెఱుంగకుండ నున్న యంత 180

క. ఆవనితయొప్పు లోకుల
చే వినుటం జండవర్మ చిత్తజు పటుబా
ణావళిఁ దూలి సబలుఁడై
వావిరి నడతెంచె సింహవర్మనిమీఁదన్. 181

ఆ. వచ్చి కోటచుట్టు ముచ్చుట్టు వారంగఁ
బన్ని బిడ్డ నడిగి పనుచుటయును
నియ్యకొనక వెడలి యేపునఁ దలపడి
యతఁడు పట్టువడియె నతనిచేత. 182

వ. చండవర్మయు నంబాలికవలని తగులంబు కారణంబుగాఁ జంపాపతిం జంప నొల్లక శృంఖలానియమితుం జేసి యొక్క లగ్నంబున నవ్వాలంతిం బరిగ్రహించువాఁడై విభవంబు మెఱసి వివాహగేహంబు చేరు నవసరంబున. 183

క. ఏ నియ్యంబుజనేత్ర ని
ధానము సాధించినట్లు తగఁ బొందితి ని
స్సీ నాకన్నుల యెదురను
వీనికి నా లగునె మేను విడిచెద ననుచున్. 184

చ. వెఱపను పేరు చిత్తమున వీసమునంతయు లేక శత్రుపెం
పుఱక మహోగ్రకోపరస మొక్కఁడు తోడుగ సాహసం
బునఁ, గుఱుచకటారమే నతని గాఢముగాఁ గొనిపోయి

చొచ్చి క్రిక్కిఱిసినమూఁకలో నతని గిటడఁగం దెగఁజూచి
త్రోచితిన్. 185

వ. ఇవ్విధంబున మర్దించి. 186

క. క్రందున నెఱ కైదువు గొని
కొందఱ నొప్పించి పొదివి కొన్ని బలంబుల్
చిందఱవందఱగా నే
నందఱఁ దోలితిఁ బరాక్రమైకపరుఁడ నై. 187

ఆ. ఇట్లు తోలి వీర మేపార నిలిచి త
త్కలకలమున భీతిఁ గదిరి తలఁకు
పడఁతి నూఱడిల్లఁ బలుకుచు మీఁదికా
ర్యంబు దలఁచుచున్న యవసరమున. 188

చ. వగవ మనుష్యమాత్రమున వారికి దుష్కర మైనయట్టి యీ
మగతన మెవ్వఁ డిప్పుడు సమస్తజనస్తుతి కారణంబుగా
విగతభయాత్ముఁ డై నెఱపె వేగమ వాఁ డిట యేఁగుదెంచి
తా, మొగపడునేని నియ్యెడ సముద్ధతిఁ గైకొని కాతు
నాతనిన్. 189

వ. అని యిట్లు. 190

క. కర్ణరసాయన మై య
భ్యర్ణంబున వెడలు వీరభూషణ మే నా
కర్ణించి వచ్చి నినుఁ గని
పూర్ణమనోరథుఁడ నైతి భువనైకనిధీ!. 191

క. అని చెప్పిన విని విస్మయ
మునుఁ బ్రీతియుఁ దనదుచిత్తమునఁ బెనఁగొన న

మ్మనుజేంద్రుఁ డతని సంభా
వనమున లజ్జావనమ్రవదనుం జేసెన్. 192

వ. తదనంతరంబ. 193

మ. ధనితాసంభవహర్షవర్షవికసద్ధాత్రీసురుఁ విశ్వభూ
జనితాశ్లాఘనసాంద్రనిర్మలయశశ్చంద్రాతపుఁ గూఢసం
జనితాక్షీణవివేకవైభవనిరస్తస్ఫూర్జదంహోబలుఁ
వనితాబృందనవీనమానసభవుఁ వందారుమందారునిన్.

క. శ్రుతిసుభగమూర్తి నిఖిలా
మితమోదావహచరిత్రు మిత్రోదయజృం
భితహృదయపద్ముఁ బద్మా
తతనయను వచస్సమగ్రతాచతురాస్యున్. 195

మాలిని. జలజసుభగనేత్రుఁ సారవిద్యాపవిత్రుఁ
సులభసుగుణచిత్తుఁ సోమభృద్భక్తిమత్తుఁ
గలివిలసనదూరుఁ గామినీచిత్తచోరుఁ
గులజలరుహభానుఁ గొమ్మనామాత్యసూనున్. 196

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలస దభినవదండి
నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార
చరిత్రం బను మహాకావ్యంబునందు షష్ఠాశ్వాసము.

---

# సప్తమాశ్వాసము.

---

శ్రీకరవచను దురితదూ
రీకరణవినోదశుభచరిత్రుని ననుకం
పాకరహృదయుఁ గులాబ్ధిసు
ధాకరశుభమూర్తిఁ దిక్కదండాధీశున్. 1

క. ఉపహారవర్మఁ గనుఁగొని
నృపుఁ డెంతయుఁ గౌతుకమున నీచరితంబుం
జెపు మని యడిగిన నాతం
డపరిమితా*నందనమ్రుఁ డై యిట్లనియెన్. 2

మ. భవదన్వేషణతత్పరత్వమున భూభాగంబు ముప్పెట్టు వె
ట్టి విదేహాధిపుప్రోలు సొచ్చి యొక [1]బోటిం జీరవస్త్రం దపో
భవనం బైన మఠంబునొద్దఁ గని యంభఃపానవేత్రాసనా
దివిశేషప్రతిపత్తి నాకు నది యర్థిం జేసినం బ్రీతితోన్. 3

వ. ఉన్నయెడ. 4

తే. నన్నుఁ దప్పక కనుఁగొని చిన్నవోయి
యశ్రుధారలు గ్రమ్మ నయ్యతివ వచ్చి
నూర్చుటయు గారవించి యూరార్చి దుఃఖ
కారణస్థితి యే నెఱుఁగంగఁ దలఁచి. 5

క. అనిమిషలోచనముల ననుఁ
గనుఁగొని చింతాభరంబు గదుర వికలచే

---

* దరవి. 1 బొట్టె.

తన వై యేడ్చెదు తల్లీ!
యనుశయకారణము చెప్పు మంతయు నాకున్. 6

వ. అనిన విని యత్తపస్విని యిట్లనియె మిథిలానగరంబున కధీశ్వరుండు ప్రహారవర్మ యనం గలయతండు మగధపతి యగు రాజహంసుం డను రాజునకు మిత్త్రుం డై వర్తిల్లు నతని భార్య ప్రియంవద మాగధమహిషి వసుమతీదేవితోఁ జెలిమి సేసి యిట్లన్యోన్యస్నేహసముచితాచరణంబులం బరిణతం బగు సమయంబున. 7

తే. మగధభూపతిదేవిసీమంతమునకు
నాలు బిడ్డలు దానుఁ బ్రహారవర్మ
వేడ్కఁ జేగి సౌహార్దంబు వెలయ వారి
యొద్ద నుత్సవలీలల నున్న యంత. 8

ఉ. మాళవదేశవల్లభుఁ డమానుష తేజుఁడు లీలతోడ న
వ్వ్యాళికి వచ్చునట్లు మగధాధిపుపై వెస నెత్తివచ్చినన్
మాళవమాగధు లిద్దరు సమగ్రతమై రణకేళి సల్పుచో
మాళవు చేత మాగధుఁడు మర్దితుఁ డయ్యె మహాద్భుతం
బుగన్. 9

తే. అపుడు మాళవు చేతఁ బ్రహారవర్మ
పట్టువడి వానికరుణయ ప్రాపు గాఁగఁ
దనకు విడుమర గాంచి నందనులు సతియుఁ
దాను హీనుఁ డై యెంతయు దైన్య మొంది. 10

వ. విరళపరిజనపరివృతుం డై నిజదేశంబున కరుగుదెంచునప్పు డేనును మత్పుత్త్రియుం దత్తుమారు లిరువురు గావున వారల నెత్తికొని వచ్చుచుండితి మట్టియెడ. 11

క. జనపతి శిథిలితగతిఁ గా
ననదుర్గమ మైన తెరువునం దాఁకిరి చు
ట్టును ముట్టి దావశిఖిచా
డ్పునఁ దివురు శరార్చు లడర బోయలు పెలుచన్. 12

ఆ. అపుడు ధరణివిభుని యంతఃపురాంగనా
జనముఁ బొదివి యాప్తజనులు కొంద
ఱొక్కదిక్కుఁ దొలఁగ నొకభంగిఁ గొనిపోయి
రేటు దాఁకి నొచ్చి యేను బడితి. 13

క. ఆతఱి నుద్ధతుఁ డొక్కకి
రాతుఁడు చనుదెంచి యధికరభసమున న్నా
చేతికుమారునిఁ జేకొని
యాతతగతి నంత నతనికై చనియె వడిన్. 14

వ. ఏనును పోటుగంటి నెత్తురు వడసి తెప్పిఱి మర్మంబు గాడ
కునికిం జేసి ప్రాణంబు విడువక యీయవస్థ గుడుచుటకుం
గా బ్రతికి పతి యరిగినదెస నల్లనల్లన చని యొక్కపల్లె
లోనం బథశ్రాంత నై యున్నకూఁతుం గని దానివలన
రెండవకుమారుండును బోయలపాలువడి పోవుట విని నా
తెఱంగునుం దానికిం జెప్పి యడవి నే మిరువురము నొం
డొరువులం గౌఁగిలించుకొని యేడ్చుచున్నంత. 15

క. అం దొకధర్మపరుం డా
క్రందనములు దీర్చి మమ్ము గారవ మెసఁగన్
మందిరమునకుం గొని చని
[1]మం దిడి నాపోటుగంటి మాన్చెఁ గ్రమమునన్. 16

1 మందుల.

ఆ. ఇట్లు దడిమి ప్రోచి యెంతయుఁ బ్రియ మెస
లార ననుప నేను నాత్మజయును
నిందు వచ్చితిమి మహీనాథు తెఱఁగును
వినుము క్రమముతో సవిస్తరముగ. 17

క. అరిమర్దనమున ధృతి చెడి
తెరు వడిచినచోఁట నున్న తేజముఁ జెడిఁ త
త్పరివారముదర్పము సెడి
పురమున కేతెంచె నతఁడు పులుమానిసి యై. 18

ఉ. అంతకుమున్న తొల్లి పురి నాతఁడు ప్రోవఁగ హీనవృత్తిమై
నెంతయు సాధుమార్గమున నేర్తెఱ దక్క చరించుచున్న
దుస్స్వాంతుఁడు దుష్టుఁడై వికటవర్ముఁడు సందునఁజొచ్చి
శంక యొకింతయు లేక గర్వ మెసలారఁగఁ బట్టముఁ గట్టె
గ్రక్కునన్. 19

వ. వాఁడును నమ్మహీవల్లభు సహోదరుతనయుండు గావున
నరాజకంబైన పరివారంబు వానిం బురికి రాజుం జేసికొని
యున్న కతంబున. 20

క. పుడమిప్రజ యెల్లఁ గాచిన
ముడివడి రాజ్యంబు దీప్తముగ నున్నెడ న
ట్లెడరై వచ్చిన నరపతిఁ
గడుఁ గ్రూరతఁ బొదివి పట్టి కట్టం బంచెన్. 21

తే. కట్టి తెచ్చినఁ జూచి సంకలియఁ బెట్టఁ
బనిచి కారాగృహంబున నునిచె దార
సహితముగఁ గూడుఁ జీరయుఁ జక్కఁ బెట్టఁ
డధమవృత్తిమై నడపెడు ననుదినంబు. 22

వ. అది రాజున్నభంగి యేమును నేలినవానికిం బొడసూపి
కుమారులు కిరాతులచేఁ బడిపోకయు మావచ్చిన తెఱం
గును నెఱింగించితిమి. 23

చ. చరణము లేమి నే జఱభిచందము చేకొని యున్న దానవా
వరసుత యిప్పు డీవికటవర్మని వల్లభి యైన కల్పనుం
దరికడ నిల్చి హీనచరితంబు మెయిం బనిసేయుచుండు నె
వ్వరు దెస నాకు నీపరిభవంబునకుం గడ యెద్ది పుత్రకా!.

ఆ. అడవిపాలు వడిన యారాజనందను
లింతదాఁక నిలిచిరేని యింత
లౌదు రిట్లు వారి యాకారములు నని
శోక మడరె నిన్నుఁ జూచుటయును. 25

వ. అనిన మాచేరినభంగిం బ్రసంగంబులం జెప్పికొన రాజు
పరివారంబువలనం బలుమాఱును మున్ను వినుటం జేసి యే
నును నపహారవర్మయు నీయమ్మ చెప్పిన బాలుర మగుదు
మని మనంబున నిశ్చయించి యేను నీపెంచినవాఁడ భవత్పు
త్రిచేతికుమారుండు బ్రదికె ననవుడువిస్మయహర్ష సంభ్రమం
బులు ముప్పిరిగొనం దప్పక నన్నుం గనుంగొనుచు నున్న
యవ్వకు నేము రాజహంసనరేంద్రుం జేరి పెంపం బెరిఁగితి
మని రాజు మమ్ముం జేకొనియున్న తెఱం గెఱింగించి నృపతి
వృత్తాంతంబును వసుమతిప్రముఖులైన యంతఃపురకాంతా
జనంబునుం బరివారంబునుం జెల్వును సాభిజ్ఞానంబు గాఁ
జెప్పి దేవరజననంబును స్వరూపంబునుం బ్రభావంబును జరి
త్రంబునుం గీర్తించి యే నతని నన్వేషించుటకుం బరి
భ్రమించుచున్నవాఁడ నని తెలియం బలికిన. 26

క. విని హర్షాశ్రుజలంబులఁ
గనుదోయి మునుంగఁ జన్నుఁగవఁ బాలొలుకం
దనువునఁ బులకలు నెగయఁగ
నను గాఢాలింగనంబునం గొనియాడెన్. 27

వ. ఇవ్విధంబున సంభావితుండనై కలసి యి ట్లంటి. 28

ఆ. ఇంక మనకుఁ గార్య మెయ్యదియొకొ రోష
వేగ మడరి బాహువిక్రమంబు
మెఱయఁ బగతుమీఁద నుఱికి యొక్కఁడఁ జంప
వచ్చునట్లు చేఁత వలను గాదు. 29

క. ఇత్తెఱఁగు పరిజనములకుఁ
జిత్తక్షోభంబు సేయఁ జేసిన నాకుఁ
మెత్తనిమెయితో రాజ్యం
బెత్తిలఁ గొనరాదు నన్ను నెఱుఁగరు వారల్. 30

క. ఏ నీచెఱ నున్న నృపతి
సూనుఁడ నని ప్రజకుఁ దెలుపఁ జొచ్చితినేనిన్
దానఁ బ్రమాదము పుట్టుం
గాన దెఱఁగు పడదు వలయు కార్యము మనకున్. 31

క. కావున మృదుమార్గంబున
నీవు సహాయంబు గాఁగ నిర్జించెద నే
నీవికటవర్ము నేలెద
భూవలయం బస్మదీయబుద్ధిబలమునన్. 32

వ. అనిన న త్తపస్విని ప్రియం బంది యి ట్లనియె. 33

క. దైవంబ సహాయంబుగ
నీ విచటికిఁ జేరి తింక నీకుం జేయం

గా వలయు పనులు నరయఁగ
దైవాయత్తములు వగవు దక్కుము కొడుకా!. 34

క. అని నాకు స్వజనభో
జనములు నాదరణమును బ్రసన్నత గావిం
చినఁ దుష్టిఁ బొంది యమ్మఠ
మున నొక్కెడ విశ్రమింప మునుమా పగుడున్. 35

తే. అచ్చటికి నోర్తు వచ్చిన నవ్వ నన్ను
నెలమిమైఁ జూపి దానికి నిట్టు లనియె
దైవగతిఁ జేరెఁ జూచితే తరుణి! నాఁడు
బోయచేఁ బడి పోయిన భూపసుతుఁడు. 36

వ. అని యది కూఁతు రగుట నా కెఱింగించి యేను దనచేతి కుమారుం డనియును దానియెత్తికొనివచ్చినవాఁడును బ్రది కియునికియు నవి మొదలుగాఁ దాను నాచేత విన్నవృత్తాం తంబు లన్నియు దాదికిం జెప్పి యతనిబుద్ధిపరాక్రమంబుల వలనను దైవయోగంబునను మన కెల్లకార్యంబులు సిద్ధించు ననిన నదియును సంభ్రమసంతోషంబు లడర నన్నుం గౌఁగి లించుకొని మ్రొక్కి వినయంబుతో సల్లాపంబు సేయుచున్న సమయంబున దానికి నంతఃపురంబున మచ్చికతోడినడవడి గలుగుటయు నెఱింగికొని. 37

చ. పగతునిఁ జంప నెన్నియు నుపాయము లారయుచున్న నాకు నిం, మ్మగువ నిజంబుగా నృపతిమందిరవృత్తము చెప్పె నేని నేఁ, దగు లిడి నిశ్చయించి యుచితస్థితిఁ జేయుదు లోక సమ్మతం, బగుగతిఁ గార్యజాత మని యాత్మఁ దలంచి కరంబు నెమ్మితోన్. 38

తే. రాజుచందంబు నంతఃపురంబువిధము
నీ వెఱింగినతెఱఁ గెల్ల నెలఁత! నాకుఁ
దెలియఁ జెప్పుము కార్యంబు తెగువ గాంచి
నిర్వహించెద నెంతయు నేర్పు మెఱయ. 39

తే. అనిన విని దానితల్లి యి ట్లనియె మనకు
బ్రదుకుఁ దెరువగు నితనితోఁ బడఁతి! నీవు
కల తెఱం గెల్లఁ బ్రకటించి గారవమున
నెపుడు ననుకూల వై చరియింపు మనియె. 40

వ. అనిన నయ్యింతియు నట్ల కాక నా కింతకు మిగిలిన పనియు నుం గలదె యని నాతో ని ట్లనియె. 41

చ. నరపతి రూపహీనుఁడు మనఃప్రియయై వికసిల్లుఁ గల్పసుం దరి కడుఁ జక్కనైనను నతం డవమానము సేసి యాకృశో దరి యెఱుఁగంగనొండెడలఁ దత్పరుఁడై విహరించు దానికిం గరకరిఁ బొందియుండి యవుఁ గా దన దాయమ గూఢ చిత్తయై. 42

తే. రూపయౌవనగర్వాధిరూఢ గాన
సరకు సేయదు మగని నచ్చపలనయన
దీని నెఱుఁగఁడు మనమునఁ దెలియకుండు
వికటవర్ముండు గడు నవివేకి యగుట. 43

క. గురువెంధ వేము నడరిన
పరుసున నవ్వికటవర్మ పొల్పడి చెన్నుం
బొరయక మెలఁతుక యెప్పుడు
విరసాంతఃకరణ యగుచు వేదనఁ బొందున్. 44

వ. అనిన విని యాత్మగతంబున. 45

ఉ. ఎమ్మెయినొక్కొ దానిమన సేఁ జొరఁజాలుదు నెట్టిదానఁగా
ర్య మ్మగునొక్కొ తా విరస యైన సతి న్ననుఁ గూర్చికొ
న్నఁ గా, కిమ్ముల వాని నోర్చు టెటులేఁ దగు నీపని పూని
చేయ క, క్యమ్మొకో యత్తపస్వినికి నాత్మజకుం గ్రియ దీని
కెట్లొకో. 46

క. మునుమును మానినిచిత్తం
బునఁ గోపము పుట్టఁ జేసి పురుషుని దెస నొ
చ్చినసందునఁ జతురతమెయి
నను నెఱిఁగించుటయ వెరవు నాకుం జూడన్. 47

వ. అని యూహించి దానితో ని ట్లంటి. 48

ఉ. మాటలఁబొందు సేసికొని మాటికిమాటికిఁబోయిపోయిపల్
మాటల రాజుచేయు కుటిలక్రియ లెల్లనుఁ దెల్పి తెల్పి య
జ్జోటికి నీసు రోసమునుఁ జొన్పి మదిం గలుషింపఁజేయు మి
వ్వాటఁ జరించు పిమ్మట నుపాయము సెప్పెదఁగార్యసిద్ధికిన్.

వ. అని పనిచి యేనును నిగూఢంబుగా నమ్మతంబున వర్తించు
చుండ నొక్కనాఁడు. 50

క. తనపూని సేయఁ దొడఁగిన
పని సఫలంబైన దాది ప్రమదంబు మనం
బున *నుండి పొంగి వెలివిరి
సినచాడ్పున వదన ముల్లసిల్లఁగ నాతోన్. 51

చ. పనిచినచొప్పునం దగిన పల్కులమై వడిఁ గల్పసుందరిః
జనపతియందుఁ జాల విరసం బగుచందముఁ బొందఁ జేసి

* నిండి.

తిం, కనిట భవత్ప్రియత్నముప్రకారము బుద్ధి నెఱింగి దాని
కే, ననుగుణ మైనభంగి నెడయాడఁగఁ జొచ్చెద*నీతి
చెప్పుమా. 52

వ. అనిన విని పుష్కరికం బిలిచి పలకయుం జిత్రసాధనంబులు
సవరించి తేరం బనిచిన నదియును దక్షిణంబ కొనివచ్చు
టయు. 53

క. వల నేర్పడఁగ సురేఖా
విలసన మొప్పంగఁ జాల విన్ననువునఁ జె
న్నలవడ నారూపం బా
పలకం జిత్రించితిని సుభగవర్ణముగాన్. 54

వ. ఇట్లు వ్రాసి చిత్రఫలక దానిచేతి కిచ్చి దానితో ని ట్లంటి.

తే. దీనిఁ గొని కల్పసుందరీదేవికడకు
నేఁగి పరిజను లెవ్వరు నెఱుఁగకుండ
నుత్తరీయంబు మాటుగా నునిచి పిదప
నేకతంబునఁ జూపు మయ్యిందుముఖికి. 56

క. చూపి యుచితంబులగు స
ల్లాపంబుల నాలతాంగి లౌల్య మెఱిఁగి ర
మ్మా పదపడి చేయఁగ మన
కేపని దగు దాని నీకు నెఱుకపఱచెదన్. 57

క. అనవుడు నట్లన చేయుదు
నని యది యాచిత్రఫలక మడఁకువతోడం
గొని యంతఃపురమునకుం
జని వచ్చెం గొంతవడికి సంతస మెసఁగన్. 58

* నీవు.

వ. వచ్చి యి ట్లనియె. 58

క. ఆకాంతారత్నమునకు
నేకతమున *నీదు పలకయిచ్చితిఁ దచ్చి
త్రాకారం బుజ్జ్వల రే
ఖాకీలితదృష్టిచిత్త మై యుత్సుకతన్. 59

సీ. కనురెప్ప వెట్టక కనుఁగొని విస్మయం
బనురాగమును మదిఁ బెనఁగొనంగఁ
దల యూఁచి యిట్టిచిత్రపురూపు నేఁ జూచి
యెఱుఁగ నింతకుమును పెన్నఁడైన
నీయొప్పు గలనరుం డెందునుం గలుగంగ
నేర్చునె కలిగిన నెలఁతపిండు
చూడ్కులు మనములుఁ జూఱఁగోలుగఁ గొని
కాముని కతఁ డోరగట్టు గాఁడె
తే. యనుచుఁ బెక్కువిధంబుల వినుతి సేసి
తగుల మేర్పడఁ బలికె నమ్మగువకోలఁది
గాంచి పుయిలోట నెడి తమకంబు వెనుప
నిదియ తఱి యని తలఁచి యే నిట్లు లంటి. 60

మ. అవనీచక్రముపెద్దయుఁ విపులమిందాశ్చర్యము ల్పెక్కులి
క్కువ మై యిట్టివిధంబు రూపములు గల్గుం గల్గినఁ మేదినీ
ధవు నంతఃపురకాంత లైన నినుఁ జెంతం జేరఁగా వచ్చునే
తవులం దీరునె నీకుఁ బిమ్మట మనస్తాపంబ శేషింపదే. 61

వ. అనిన విని యవ్వనిత సకౌతుకంబుగా నన్నుం గౌఁగిలించు
కొని యి ట్లనియె. 62

---

* నేను.

ఉ. నామన మారయం దలఁచి నవ్వులకి ట్లని చెప్పితో నిజం
బై మనవీట నిట్టి సుభగాకృతి గల్గిన వానిఁ గాంచి నీ,వీమె
యి నల్లఁ బొందుఁ గొని నేర్పడ నాడిరొ నిన్ను నన్న కా,నీ
మది నమ్మి శంకచెడి నిక్కపుఁజందము నాకుఁ జెప్పుమా.

క. అని చిడిముడిపడి యడిగిన
వనితా! నిక్కంబు చెప్పవలయున యేనిన్
విను మిట్టిరూపుగల నృప
తనయుఁడు గలఁ డేను గంటిఁ దథ్యం బంటిన్. 64

మ. అనినం గ్రక్కున లేచి మచ్చరణపర్యంతక్షితిం జాఁగి మ్రొ
క్కిన నే సంభ్రమ మొంద నెత్తి లలితాంగీ! యింత పాటిం
పఁగాఁ,జను నే నన్ను భవన్మనోరథము నిష్ఠన్ దేర్చెదం జెప్పు
నీ, పని సేయం గని ధన్య నైతి ననుడున్ భావంబు రంజి
ల్లఁగన్. 65

తే. నీవు చెప్పిన యాతని నేవిధముల
నైన నెలయించి ననుఁ గూర్పు మట్లు గాక
కడపి మెడ సేసినను నాకుఁ గాముఁ డేల
చక్క మానంబు ప్రాణంబు దక్కనిచ్చు?. 66

వ. అని యివ్విధంబునం బ్రేమాతుర యై వెండియు ని ట్లనియె.

సీ. అవ్వ! నావృత్తాంత మంతయు నేర్పడ
విను మేను జెప్పెద మును ప్రహార
వర్మనిప్రియ ప్రియంవదయును మాతల్లి
కమలయుఁ జిరబాంధవమునఁ దగిలి
యొండొరువులతోడ నొప్పిదంబుగ వియ్య
మందువారుగ నిశ్చయంబు సేసి

రంతఁ బాపమునఁ బ్రియంవద కొడుకులఁ
గాంతారభూమిలోఁ గాడుపఱచి
తే. వచ్చిపట్టంబు గట్టినవాఁడు గాన
వికటవర్మకు ననుఁ దంత్రి వేడ్క నిచ్చె
నీ వెఱుంగనియదియె యన్నిచుచేతఁ
బ్రతిదినంబు నేఁ బడియెడు పాటు లెల్ల. 68
శా. చాతుర్యంబులచెంతఁ *జెందఁడు కులాచారంబు గోరండు వి
ద్యాతత్త్వంబుల మేలెఱుంగఁడువినోదక్రీడ లొల్లండు మే
ధాతత్త్వంబుల పొంతఁ బోఁడు రతితత్త్వప్రౌఢుఁడుం గాఁ
డు భా, మా! తెంపుంబడి దైన యీవికటవర్ముం జెప్పఁగాఁ
గూడునే?. 69
క. ఒప్పర మిడి సతికిం గల
యొ ప్పెఱుఁగఁడు తనమనంబు నొల్లమిఁ దాఁపం
జెప్పఁడు చూచినబీరపుఁ
దప్పులె యొనరించు నా కతఁడు పతి యగునే?. 70
ఉ. ఇంచుకయేనిఁ బెంపెఱుఁగఁ డెంతయు వేడుక నేనుఁ బుత్త్రిఁ
గాఁ, బెంచిన మావిమోఁకకడఁ బ్రీతి మదీయవయస్య యైన
యి, క్కాంచనమాల నెల్లచెలికత్తెలు నవ్వఁగ నంటఁబట్టె
నా, పంచున కాలనై పడనిపాటుల నేఁ బడితిం దపస్వినీ!.
క. రమణీయలతాగృహమున
రమయంతియుఁ దాను నిచ్చ రమియింపఁగఁ దె
ల్లమి గా నాచెలి చూచె వ
శమె యవమాన మిటు సేయ సైరింపంగన్. 72

---

* జేరఁడు.

క. తన కసదృశుఁ డగు పురుషుఁడు
దను మెచ్చక యొరులవలనఁ దగిలినవానిం
గనుఁగొనిన మానవతి యగు
వనితకుఁ జిత్తంబు నూఱు పఱియలు గాదే?. 73

క. కావున మగఁ డని పలుకఁగ
నేవం బగు వికటవర్మ యేటి మగఁడు నీ
వావసుధాధిపనందను
వేవే తోడ్తెమ్ము మాధవీగృహమునకున్. 74

వ. అనిన విని యమ్మగువ తెఱం గెఱింగ యఱ సేయక యి
ట్లంటి. 75

చ. పలుకులు వేయు నేల నరపాలతనూజుఁడు నాకు మిత్రుఁ
డి,మ్ములఁ గొనివచ్చి కూర్చెదఁ బ్రమోదముఁ బొందుము
తక్కమింక ను,మ్మలికము వాఁడునుం గుసుమమార్గణపీడిత
మానసుండు వి,చ్చలవిడి నీకు నాతనికి సంగతి చేకుఱు
నమ్ము మెమ్మెయిన్. 76

వ. అని పలికి వసంతకేళినాఁడు నరపతిసమేతంబుగా సఖీజనం
బులు దానునుం బురవీథి నరుగుచుండ నొక్కజాలకంబున
నీవు దన్నుం జూచితనియును నది మొదలుగాఁ గదిరిన మద
తాపంబునం దలరియున్నవాఁడననియునుం జెప్పి నన్నుం
బొందు గొని యిత్తెఱం గెఱింగించి తనరూపంబు చిత్రించి
దీనిం గొనిపోయి కల్పసుందరికిం జూపి యచ్చెలువ చిత్తం
బుకొలంది యరసి ర మ్మని నియోగించె ననియునుం జెప్పిన.

క. పులకలు వొడమఁగఁ బ్రమదా
శ్రులు గ్రమ్మఁగ హర్షరసము ముప్పైనగతిం
బొలఁతి నను దిగిచి తనకాఁ
గిలిపొందునఁ జేర్చెఁ గడు బిగియ నింపాఱన్. 78

వ. ఇట్లు గాఢాలింగనంబు సేసి నామొగంబు గనుఁగొనుచు
ని ట్లనియె. 79

చ. లఘు వని నన్ను నీమదిఁ దలంచితివేని తలంపు వానికై
యఘముల కోర్తు నీనిలుపు నాసపడన్ విను మిట్టివాఁడు
వై, వఘటన నాకుఁ జొప్పడియె వంశము వృత్తము నింక
నొల్లఁ బ్రే, మఘనమనోరమైకరసమగ్నతఁ బొందితి నేమి
సేయుదున్. 80

తే. అనినఁ దగు లూనుటకు సంశయంబు లేమి
యుల్లమునఁ దెల్లమిగఁ గని యూఱడిల్లి
వెండియును నిశ్చయము సేయ వేఁడి యుచిత
వచనమున నిట్టు లంటి నవ్వనితతోడ. 81

ఉ. నీ వెన రిట్టిచంద మని నిక్కముగాఁ గొని నిన్ను నమ్మితిన్
మానిని! యింక నొండు వెడమాటలు దక్కు కుమారు
శక్తివి, జ్ఞానపరాక్రమంబుల కసాధ్యము లెవ్వియు లేవు
కావునన్, వానికి నీకుఁ బొం దగు నవశ్యము నూఱడు
మెల్లభంగులన్. 82

వ. అనిన నత్తెఱవ మఱియు ని ట్లనియె. 83

క. నీవు గల ఫలము నా కా
భూవరనందనునితోడఁ బొం దొనరింపం

గావలయుఁ బౌరుషంబును
దైవము నోడఁగూర్చి యెవ్విధంబున నైనన్. 84

వ. అని యిట్లు ప్రార్థించిన. 85

చ. మనమున సంతసిల్లి యనుమానము దక్కి తలంపు సిద్ధిఁ
బొం, దెన యని నిశ్చయించి సుదతిం దగ వీడ్కొనునప్పు
డెవ్విధం,బునఁ గొనిపత్తు వాని నని పూని నిజంబుగ నూఱ
డించి పు, ట్టినతెఱం గెల్ల నీకుఁ బ్రకటింపఁగఁ గోరి కడంగి
వచ్చితిన్. 86

వ. అని యిట్లు కల్పసుందరి యంతర్గతంబు సవిస్తరంబుగా
నెఱింగించిన నాతలంచిన కార్యంబు సఫలంబుగా నోపుట
నిశ్చయించి. 87

తే. సుందరీమందిరంబుల చందములును
గాపువారలు మెలఁగెడు కందువలును
హృద్యకేళీవనంబుల యెడలతెఱఁగు
దగిలి యడిగి యెఱింగితి దానివలన. 88

వ. అంత. 89

క. వారిజబాంధవుఁ డను నం
గారం బపరాబ్ధిఁ బడిన గ్రక్కున నెగసెన్
నూరెల ధూమం బనఁగ న
వారిత మై కవిసెఁ జీకువా లెల్లెడలన్. 90

చ. తనమది మెచ్చుకేళి గురుదారపరిగ్రహవృత్తి గాన న
న్నును దదుపాయసంపద మనోరథసిద్ధిసమేతుఁ జేయ వే
డ్కన చను దెంచె నీతఁ డనఁగా శశి పూర్వగిరీంద్ర మస్తకం

బున వెలుఁగొందె లోకములు పొంపిరివోవఁగ నింపు
సొంపునన్. 91

క. ఏనును జేయు తెఱం గెద
లో నాలోకించి ధర్మలోభము ధర్మ
గ్లానికర మయ్యె నని య
జ్ఞానముఁ బొందుటకు సంశయము మొలతేరన్. 92

మ. పరదారాభినివేశబుద్ధి దలఁపం బాపంబు ధర్మార్థముల్
దొరకొల్పంగ నుపాయమైన నది నిర్దోషంబు నాఁ దొల్లి బం
ధురశాస్త్రజ్ఞులచేత విందు గురుబంధుక్లేశమోహార్థికిన్
దురితం బయ్యెడు నెట్లు? చిత్తమున కాందోలాయితం
బేటికిన్?. 93

వ. అనుచు శయ్యాతలంబునకుం జేరి నిద్రవోవునప్పుడు 94

సీ. ఏ నొకనాఁడు గంగానదిలోపల
నవగాహనము చేసి యాడుచున్న
నురలి కలంగి నిల్వొపక కోపించి
జాహ్నవి నా కొక్క శాప మిచ్చె
మనుజుఁడ వగు మని; మగుడ శపించితిఁ
గాంత వై మర్త్యలోకమునఁ బుట్టి
పలువుర భాజనం బవుగమ్ము నీ వని
యది యాదిగా నిప్పు డవనిమీఁద

తే. నమర నరి కల్పసుందరి యై జనించె
నేను నీ వై జనించితి నెగ్గు లేదు
సందియంబులు దిగఁ ద్రావి సుందరాంగిఁ
గలయు మని చెప్పెఁ గలలోన గజముఖుండు. 95

క. కలఁ గని మేల్కాని మును మఱిఁ
గల సంధియ మెల్ల విడువఁగా నప్పుడు కో
ర్కులు చిక్కువఱచె మరుఁ డ
మ్ములవానలు చూపెఁ దాపమున కిర వైతిన్. 96

ఆ. సరసిజాప్తుఁ డుదయశైల మెక్కినయది
యాది గాఁగఁ గ్రుంకునంతదాఁక
నరసి తెలిసి కంటి నంగనకడ కేఁగు
తెఱఁగు లెల్ల మదికిఁ దేటపడఁగ. 97

వ. ఇట్లుపాయంబు గాంచి నేఁడు మాధవీమండపంబున కతం
డెల్లభంగులం జనుదెంచు నని కల్పసుందరికి వా రెఱింగిం
చునట్లుగాఁ బనిచి యుపకరణంబులు సమకట్టి పురంబులోని
సందడి డిందుపడుటయు. 98

క. నీలాంబరంబు పట్టిన
వాలును బెరయంగఁ జీకువాలునఁ గాంతా
కేలీకుతూహలంబునఁ
గ్రాలెడు చిత్తంబు తోడుగాఁ బ్రీతిమెయిన్. 99

క. నరపతివప్రముఖసరి
త్పరిసరమున నోలమైన పట్టున నావు
ష్కరికకు నేకత మొకయో
వరి గలుగుట నందుఁ జని యవారణ నచ్చోన్. 100

తే. డాఁచియుంచిన వంశదండంబు దెచ్చి
నేలపై వైచి వప్రము నిలువఁ జేర్చి
కోటయును దాఁటి పోయి నిష్కుటముఁ జొచ్చిఁ
దాది చెప్పిన తెరువుచందంబుఁ దలఁచి. 101

సీ. జలజాకరముతూర్పు సహకారవీథికి
నుత్తరంబై పోవ నొక్కకేళి
పర్వతంబున్న డాపలఁ బెట్టి చని యశో
కావలి దఱియంగ నరిగియరిగి
మలఁగినదెసఁ బడమరమొగంబై కొంత
దవ్వేఁగి పున్నాగతరువు గాంచి
యచటికిఁ బది తప్పటడుగులు దక్షిణం
బున సగుణోజ్జ్వలవనము క్రేవ
తే. మూసి డించిన సందున మొక్కలంబు
తోఁపఁ దోతెంచుదీప్తులతోడి దివియ
గారవంబునఁ గనుఁగొని చేరఁ బోయి
మాధవీమండపం బని మది నెఱింగి. 102

క. తలిరు లను చేవపట్టెల
నలవడఁ బొందించు చైత్రుఁ డనునోజఁ జనం
దలుపైన చూతవిటపము
దొలఁగంగ మునుంగు లెల్లఁ ద్రోచి ముదమునన్. 103

వ. అవ్వవహారగృహాభ్యంతరంబు ప్రవేశించి. 104

శా. తాంబూలాంబరగంధమాల్యసహితాంతర్వేదిపైఁ బుష్పత
ల్పం బామానపతాకు నంపపాదిలీలం బోలినం జూచి డా
యం బోనల్కుచు లేమ వచ్చుతెరు వే నాలించుచున్నంత
హృద్యం బై వీఁకదనంబుతోన పదశబ్దంబల్లఁ బుట్టించినన్.

చ. అరయుదు దీనిచంద మని యచ్చటు వాసి యశోకభూరు
హం, తరితుఁడ నైతిఁ గాంతయు లతాగృహ మల్లన సొచ్చి
చూచి చె,చ్చెర నను నందుఁ గానమికిఁ జేట్పడి మన్మథవేద

నార్త యై, పురపురఁ బొక్కి యిట్లనియెఁ బొచ్చెములేని
తలంపు పెంపునన్. 106

ఉ. అక్కట చిత్తమా! యనుశయాంబుధిలోపలఁ దేలితేలి నీ
వెక్కడ చేరి తింక ధరణీశ్వరు కార్యము కార్యరూప మై
త్రిక్కులఁ బెట్టెఁ గాక నరదేవకుమారకుఁ డిట్టిరూపువాఁ
డొక్కఁడు కల్గునే? కలుగ నోపిన నీ కతఁ డేల చొప్పడున్?

ఉ. మిన్నక వచ్చి యాజఱభి మేడ్పడి చిత్రపటంబు చూపి తా
నెన్నివిధంబులం బఱచి యిక్కడు నాఱడి యిట్లు వెచ్చునే?
నన్ను దలంచి యిట్టి నృపనందనుఁ డిందుల కేల వచ్చు? నిం
కెన్నఁడు నీఁగ లేని మరునేపులపా ల్పడుదాన నైతినే. 108

క. ఏమిట నె గ్గొనరించితిఁ
గాముఁడ! నీ కేను నన్ను *గాసించెద విం
దేమి ప్రయోజన మసవస
లేమిటి కొకో మఱియతీర్ప వేలకొ చెపుమా? 109

వ. అని మఱియు ననేకప్రకారంబులం గల్పసుందరి తనయంత
రంగంబు బయలుపడ పల్కుచున్న నేనును బొడసూప
నదియ సమయం బగుట నల్లన సొచ్చి దివ్యాభరణంబు
పాయంబుచ్చి. 110

సీ. భావజుపట్టపు దేవి యై రూపున
నడిసన్న రతివిలాసములఁ గెల్చి
యతను ధనుర్గుణంబైన భృంగావలి
నీలాలకచ్ఛాయ నేలు దెంచి

---

* గాసించిన నిం

యంగసంభవుని కట్టనుఁ గైన యమృతాంశు
నాననాంబుజకాంతి నూనపఱచి
కందర్పు సేనముంగలి యైన నునుఁగమ్మ
దను గాలి నూర్పుగాడ్పున జయించి
తే. యున్న నిన్నుఁ జతుర్భవుఁ డిన్నివిధులఁ
బఱచు టరయంగ నుచితంబె పంకజాక్షి!
యెన్న రాని బన్నంబుల నన్నుఁ బఱచె
నేను వానికిఁ జేసిన యెగ్గు గలదె? 111

క. పొందుగఁ గాయజువిషమునఁ
గందిన నాయంగములకుఁ గామిని! యమృత
స్యందియగు నీకటాక్షము
మం దొనరింపుము దయార్ద్రమతి నింపెసఁగన్. 112

మ. అని యజ్జోటికి విస్మయంబును బ్రమోదావేశముం జేసి య
ల్లన పొం దొంది కవుంగిలించి సరసాలాపంబు పుట్టించి యా
ననపద్మమ్ము ముఖంబునం గమిచి మేనం జొప్పు గాకుండ మె
త్తనకామాంకములావహించిరతితంత్రవ్యాప్తిమోదించితిన్

క. సురతాంతోచితకృత్యము
లరుదుగ నొనరించి యున్న యవసరమున నేఁ
బరిరంభణమ్ము సేసిన
నరుగుతలం పెఱిఁగి పంకజానన పలికెన్. 114

క. నీవుం బ్రాణము నాకును
భావింపఁగ నొక్కరూప పరమార్థము నీ
పోవుట విను ప్రాణము తెగఁ
బోవుట సంశయము లేదు భూపకుమారా! 115

ఉ. కావున నన్నుఁ దోడ్కొనియ కాని చనం దగ దంచు బా
ష్పసం, ప్లావితనేత్ర యైనఁ గని పల్కితిఁ గోమలి! యెవ్వఁ
డైన ల, క్ష్మీపవితాసమాగమము సేకొన నోల్లక బుద్ధిహీనుఁ
డై పో, వఁగఁ ద్రోచునే? యడలు పోవిడు మే నొకమాట
చెప్పెదన్. 116

వ. అనినం జిత్తంబు నుత్తలంబు దక్కి వికసితవదనయు మదీయ
భాషణాకర్ణనజనితకుతూహలయు నై యున్న యన్నెలం
తకు ని ట్లంటి. 117

సీ. నారూపమున నభినవమైన యాచిత్ర
పట మేకతమున నీపతికిఁ జూపి
యీచిత్రరూపంబు నెనయగు మగరూపు
గానంగఁ గలదె యెందైనఁ జూపు
నాకు నా నతఁ డిట్టి నరు లెట్లు గలుగుదు
రెందును? నన్న నీ విట్టు లనుము
జననీసమానత మనయింటి కొకవృద్ధ
తాపసవృత్తి నిత్యంబు వచ్చు
తే. నధిప! యాయవ్వ నేఁడు దయార్ద్రనైక
చిత్త యై యొక్క మంత్రంబు చెప్పి పటము
నిచ్చి తత్సాధనక్రమ మెల్ల నాకు
నేర్పరించి యేకతమున నిట్టు లనియె 118

తే. వనజలోచన! చెప్పెద వినుము మంత్ర
సిద్ధి గావించు క్రమ మెల్ల బుద్ధిసేసి
నృపతి యనుమతి నమవస నుపవసించి
పావనస్నానశుద్ధ వై నీవు వచ్చి. 119

ఉ. అంబరచందనాగురుఘృతాదులు విప్రహుతోజ్జ్వలాగ్నికుం
డంబున నేకతంబునఁ బటస్థితరూపముమీఁద నీశుమం
త్రంబున వేల్పు వేల్చి మఱి తద్రుచిరాకృతి దాల్పుతాల్చి
నా,వం బెసఁగంగ ఘంటికఁ గదల్పు కదల్చిన దానిసన్నకున్.

క. చనుదెంచి మేదినీపతి
మును మంత్రులతో రహస్యమున నాలోచిం
చిన కార్యజాల మంతయు
వినిపింపఁగవలయు నీకు విస్రంభమునన్. 121

క. వినిపించి పిదప సాష్టాం
గనమస్కృతిపూర్వకంబుగా నగ్నికి న
ర్చన లిచ్చి నీదుకౌఁగిలి
గని యతఁ డారూపు దాల్చుఁ గమనీయముగన్. 122

ఆ. అంత నీవు తొంటియారూపు దాల్తు మృ
గాక్షి! దీన సందియంబు లేదు
మనుజపతికి నీకు మది కియ్యకోలైనఁ
జేయు మనియె నర్థి జీవితేశ!. 123

క. నీకును మంత్రులకును నీ
లోకమువారలకు నాత్మలో నిశ్చితమై
కైకోలు గలిగెనే మన
మీకార్యము సేయు టురవ యెడ గాకుండున్. 124

వ. అనిన వాఁడును దీని కొడంబడు నీమాధవీమండపప్రదేశం
బున హోమకుండంబు నిర్వర్తించునట్లు గావించి సం
ధ్యాసమయంబున మంత్రజ్ఞుం డైన బ్రాహ్మణుండు పశువిధి
సేయించి వేల్పించిన యనంతరంబ యేను స్తోత్రంచి

యయ్యేడ నిగూఢంబుగ నుండునంత నంధకారంబు సాం
ద్రం బగుటయు మంత్రసాధనోద్యుక్తుండ నైనవెనుకం బతి
కడకుం జని మేలంపునగవుతో నేకాంతంబున ని ట్లనుము.

క. నిను నే రూపసి గా వే
ల్చిన నాసవతులకు నీవు చెలువము మెఱయం
గనుఁగొనవల సెం గావున
విను నా కిది గనఁగ సామివేలిమి యయ్యెన్. 125

క. అనిన విని యాతఁ డవు డే
మని పలికిన వచ్చి చెప్పు మంతయు నట యే
నిను మెచ్చించెద నూఱడు
మని యామదిరాక్షిఁ బుచ్చి యరిగితి నధిపా!. 127

చ. వనరుహనేత్రయుఁ ఖ వికటవర్మని నెంతయు మోసపుచ్చి నా
పనిచినయట్ల సేసి జనపాలుఁడు నంతటిలోనివాఁడ కా
వున: బరితుష్టుఁడై యిది యవుం గడు వేగమె దీనిచేఁత మే
లని యొనరింపఁబూనెఁబతియప్పలు కెల్లెడ మ్రోసె న_త్తఱిన్.

ఉ. అంతిపురంబులోపల నృపాగ్రణి దేవుల మంత్రశక్తి న
త్యంతసురూపవంతుఁ డగు నట్టె తలంపఁగ నెందునుత్సవం
బింతకు మిక్కిలిం గలదె? యేమిటఁ జూచిన నెగ్గు లేదు ని
శ్చింతమునందొడంగి*యఱ సేయక చేయుటచిత్రమెమ్మెయిన్.

క. అని యెడువారును నిది వో
లునొకో యనువారు మందులుఁ మంత్రములుఁ
వినుతమణిజాలములుఁ జే
యని యాశ్చర్యములు గలవె యనువారలు నై. 130

---

*యెడ.

వ. ఇట్లనేకప్రకారంబుల జను లెల్లం గుజగుజవోవుచుండం బర్వైనం బగుటయు మనతలంచినపని యారాత్రిం దీర్పు వార మని పుష్కరికచేతం గల్పసుందరి నా కెఱింగించి పుత్తెంచిన నేనును సన్నద్ధుండ నై యున్నంతం బ్రదోష వేళ మాధవీమండపప్రదేశంబున శ్రీకంఠకంఠధూమ్రంబైన ధూమం బెగసెం బదంపడి దధి రుధిర సర్పి తిల మాష క్షీర కర్పూ రాద్యాహుతపరిమళితమారుతంబు సుడిసినం దత్క్రియానిర్వర్తనప్రకారంబగు టెఱింగి ధూమశమనా నంతరంబ యతినిగూఢంబుగాం బ్రమదవనంబు సొచ్చి లతా గృహంబున నోలంబు గొనియాడి చరించు సమయంబున నమ్ముదిత సమ్మదంబునం జనుదెంచి నన్నుం గౌఁగిలించుకొని యి ట్లనియె. 131

మ. మును రాగానలసన్నిధిక్షణహృదయజన్మం డర్థిమై వచ్చి ని చ్చిన నంతం దనివోక నీకు నను నాచిత్తంబు నేం డిప్పు డీ యనలంబుంద గ సాక్షిగాం బడసి యాహ్లాదంబుతో నిచ్చెం గైకొని రక్షింపుము జీవితేశ! యిట పల్కుల్ వేయు నిం కేటికిన్. 132

తే. అని మృగేక్షణ మఱియు ని ట్లనియె నేను
వికటవర్మనృపాలకు వెడ్డువెట్టి
ఘటనయైన యమ్మాట నీకఱిపినట్లు
యర్థి నిప్పు డేకతమున నాడుటయును. 133

క. విని యానరపతి వినయా
వనతుం డై గారవించి వనజానన నీ

పనిచినయట్లన చేసెదఁ
గను విచ్చియుఁ జూడ నేను గాంతల నింకన్. 134

క. ఈకార్య మింక నీ వెడ
గాకుండఁగ నిర్వహింపు గజగామిని! భూ
లోకమునఁ గీర్తి నీకును
నాకును జేయు మని తఱిమి ననుఁ బుత్తెంచెన్ 135

క. ధూర్త! భవదీయకృత్రిమ
వర్తనములు సిద్ధిఁ బొందె వాఁ డిట వచ్చెన్
నేర్తేని తదీయశిరః
కర్తన మొనరింపు నీదుకౌశల మొప్పన్. 136

వ. అని పలికి పులకపటలీపరికలితాంగి యై నన్ను గాఢాలింగ
నంబు సేసినం బరమానందంబునం బొంది. 137

క. అనుచరుఁడఁ గానె? యీపని
చినపని వేవే కడంగి చేసెద దగ లా
వును వెరవు మెఱయ నీమది
ననుమానము దక్కి నీవు నంతకు నిచటన్. 138

మ. ప్రతతీమండపములోన నుండు మని యవ్వామాక్షితోఁ జెప్పి
యే,నతివేగంబునఁ గొంతసేపునకు రక్తాశోకశాఖావలం,బిత
ఘంటాచలనంబు సేయుటయుఁ దద్భీమస్వనం బొప్ప ను
ద్యతఘోషంబున వానినంతకునిడాయంబిల్చుచందంబునన్.

క. ఒడిలోఁ గుఱుచకఠారము
గడు నొఱపుగ డాఁచికొని యగరుచందనముల్
తడఁబడ వెడమంత్రంబుల
నుడుగక హోమంబు సేయుచుండితి నంతన్ 140

ఉ. ఆనినదంబుసన్నకుఁ బ్రియంబున వేగమె యేఁగుదెంచి య
చ్చో నను గాంచి నిల్వఁబడి స్రుక్కి వినిశ్చలలీనబుద్ధి యై
యాననమండలంబున భయంబును వెక్కసపాటుఁ దోఁప న
మ్మానవనాథుఁ డున్న ననుమానము వాపఁ దలంచిపల్కితిన్.

క. ఈసురుచిరరూపముఁ గొని
నాసవతులఁ గలయ నని యనలసన్నిధి నీ
చేసిన శపథముఁ గని తుదిఁ
జేసెద నీ కే సురూపసిద్ధి ముదమునన్. 142

క. అనవుడుఁ దనహృదయములో
ననుమానము దక్కి వికసితాననుఁ డై య
య్యనలము సాక్షిగ శపథం
బొనరింపఁగ వికటవర్ముఁ డుద్యోగించెన్. 143

ఉ. ఏనును నిట్టు లంటి మనుజేశ్వర! సత్యము లేల దేవకాం
తానివహంబు నిన్ను నుచితస్థితిఁ బొందిన నేరఁ గాని యీ
మానవభామ లెల్ల నవమానము నా కొనరింప నేర్తు రి
స్సీ నగుఁబాటుగా దెయిటు సేఁతసతీసమయం బెయిమ్మెయిన్.

వ. కావున శపథంబు సేఁత చాలు నని మఱియు ని ట్లంటి. 145

క. నీవు నమాత్యులు గూఢతఁ
గావింపం దలఁచియున్న కార్యము తెలుఁగం
గా వేగ చెప్పు మిప్పుడె
నీవికటాకార మడఁగు నే ర్పేర్పడఁగన్. 146

క. అనవుడు నతఁ డి ట్లనియెను
ఖననుం డను సెట్టి చేఁ దగ నమూల్యం బై

వినుతికి నెక్కిన మణి గల
దని విని కొనువార మైతి మన్యాయమునన్. 147

క. ధనవంతుఁడైన శతహలి
యను నెలమనిమీఁద లేని యన్యాయపథం
బొనరించి పట్టుకొని యా
తని యర్థం బెల్లఁ గొనఁగఁ దలఁచితి మబలా!. 148

క. ఉటెది విషము వెరవున నిడి
చెఱ నున్న ప్రహారవర్మఁ జెచ్చెరఁ జంపం
దెఱఁగు విచారించితి మతఁ
డఱిగమిఁ జచ్చె ననువార మై లలితాంగీ!. 149

వ. అని యిట్లు పలికి మృగతృష్ణికాపానలాలసంబైన హరిణం
బునుం బోలె సుందరాకారసంప్రాప్తిలంపటుం డై యున్న
నేనును నింక నెడ సేయం దగ దని సమయింపం దలంచి.

ఉ. పారముఁ బొందె నీక్రియ తపస్విని చెప్పిన భంగి నస్నిభ
ట్టారకుఁబూజ సేయుము దృఢంబుగనన్నుఁగవుంగిలింపు మిం
పారెడు రూపముం బడయు మన్నఁ బ్రదక్షిణపూర్వకంబు
గా, ధారుణిఁ జాఁగి మ్రొక్కుటయుఁ దత్సమయంబున
వానిఁ జంపితిన్. 151

ఉ. పీనుఁగు నగ్నిఁ ద్రోచి మది బెగ్గల మంది వడంకుచున్న య
మ్మానిని యుత్తలంబుడిపి మందిర ముత్సవలీలఁ జొచ్చి కాం
తానివహంబులో సముచితంబుగఁ గొండొకప్రొద్దు నిల్చి
య, బ్జాననచెట్ట పట్టుకొని యల్లన పోయితి సెజ్జయింటికిన్.

క. ఆరాత్రి సుదతితోడి వి
హారంబులఁ బ్రొద్దు పుచ్చి యందలి యుచితా

చారక్రమ మది చెప్పఁగ
గారవమున నెఱిఁగికొని యకంపితమతి నై. 153

వ. మఱునాఁడు దినముఖోచితక్రియలు నిర్వర్తించి పరిమితా లంకారాలంకృతపరిజనపరివృతుండ నై యపూర్వాలోకన కుతూహలంబునం జనుదెంచిన యమాత్యులం గానిపించు కొని సోపహారంబులైన దండప్రణామంబు లాదరంబునఁ గైకొని విస్మయవితర్కాక్రాంతస్వాంతు లగుచు నొండొ రువుల మొగంబులు చూచుచుండ వారలం గలపికొని యిట్లంటి నారూపంబుతోడన చిత్తంబు నొండైనది మనము విషము పెట్టి చంపం దలంచినది ప్రహారవర్మజనకుండుగావున నతని విడిచి నిజరాజ్యంబున నిలిపి పుత్రకృత్యం బనుష్ఠింపం బ్రియంబు పుట్టెడు శతహలిసర్వస్వాపహరణంబు సేయుట యనుచితం బను తలంపునుం గలదు ఖననునిచేతి రత్నం బునకుం దగిన వెల యిచ్చి పుచ్చుకొందమనుచు సాభి జ్ఞానంబు లగుకార్యంబు లెఱింగించిన. 154

చ. మతి చెడి మంత్రు లందఱును మంత్రబలంబున మోహ నాకృతిం, బతి చనుదెంచెఁగాఁ దలఁచి భక్తియు మోదము నుల్లసిల్లనం, భృతపులకాంగులై రమణిఁ జేర్కొని నూతన రూపసిద్ధిద, క్షత వెలయం బురంబునఁ బ్రకాశము చేసిరి గారవంబునన్. 155

ఉ. ఆదివసంబునం బ్రకటహస్తిఁ బ్రియంబున నెక్కి బంధుమి త్రాదులు గొల్వ వైహాళికి నంచితవైభవలీలఁ బోవుచో నాదటతో సమస్తవిషయంబులవారును వచ్చి నన్ను సా హ్లాదమునద్భుతంబుహృదయంబుల నెక్కొనఁజూచి రేర్పడన్.

క. మును దాదిచేత నావ
ర్తన మంతయుఁ దేటపడఁగఁ దండ్రికిఁ బ్రమదం
బునఁ జెప్పి పుచ్చి యభిషి
క్తునిఁ జేసితి నతులభక్తితో నానృపతిన్. 157

వ. ఏనును జనకానుమతంబున యువరాజపట్టంబు గట్టి చన
వీయ విరహాతురత్వవిరసంబు లేక రాజ్యసుఖంబు లనుభ
వించుచుండి. 158

తే. కూర్మిచెలియైన యాసింహవర్మపొంటె
మర్మభావితుఁ డగు చండవర్మమీఁద
వచ్చి కాంచితి మిచట దేవరపదార
విందయుగ్మంబు నిర్భరానంద మొంద. 159

చ. అనిన నృపాలకుండు సఖు లందఱి మోములఁ జూచి నవ్వి
యిట్లనియెఁ బరాంగనాగమన మయ్యును సత్క్రియ గాదె
వీనిచేసినయది తల్లిదండ్రులకుఁ జిత్తవిషాదవిమోచనార్థమై
యునికి ననూనరాజ్యసుఖయోగమునన్ జనుఁ గీర్తనీయమై.

క. అని యిట్లు తానుఁ జెలులును
జనపతి యుపహారవర్మచరితము ప్రీతిం
గొనియాడి యర్థపాలుం
గనుఁగొని దరహసితవదనకమలుం డగుచున్. 161

క. నీ వేదేశమునకుఁ జని
యేవెరవున నేమి చేసి తేవేషముతో
నేవిధమున నెటు నిలిచితి
నావుడు నాతండు భక్తినమ్రుం డగుచున్. 162

వ. ఇట్లనియె. 163

శా. నిత్యస్తుత్యవిలాససారకవితానిర్మాణచాతుర్య! సం
ప్రత్యగ్రేసరభూసురప్రకరశుంభత్ప్రీతిధాత్రీశదా
నత్యాగప్రథమానకీర్తిలతికానందాగ్రశాఖాచయా
దిత్యానోకహమత్సరోదయ! కృతార్థీభూతసంపన్నిధీ!. 164

క. విద్యానికషోపల! ధ
ర్మోద్యోగనిరూఢమానసోల్లాస! రుచి
*(ప్రద్యోతన! సంపద్విభ
వద్యోరాజప్రమాణ! ప్రాజ్ఞధురీణా!.) 165

మాలిని. (పరమకరుణభావా! భారతామ్నాయసేవా
దరణ! వితరణాంభోధారణా)ధఃకృతాంభో
ధర! (యనుపమభద్రీ! ధైర్య)జాంబూనదాద్రీ!
పరిగత (నయసూత్రా! భాసురామాత్యపాత్రా!) 166

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలస దభినవదండి
నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార
చరిత్రం బను మహాకావ్యంబునందు సప్తమాశ్వాసము.

---

* 165-166 పద్యములలో నీకుండలీకృతభాగములు వ్రాతప్రతిలో శిథిలము లగుటంజేసి పూరింపఁబడినవి.

# అష్టమాశ్వాసము.

---

శ్రీవాణీభూషాద్విత
యావేష్టితమూర్తి! లసితహారపదపద్మ
కావాసచిత్తమధుకర!
దేవేంద్రసమానవిభవ! తిక్కనమంత్రీ!. 1

ఉ. భూపలలామ! నిన్ వెదకి భూవలయంబునఁ బ్రోళు లెల్ల నా, యోపినభంగిఁ జూచి సతతోత్సవలీలల నుల్లసిల్లు కాశీపురి కేఁగి యందు సురసిద్ధమునీశ్వరపూజ్యుఁడైన గౌరీపతికిం బ్రదక్షిణము ద్రిమ్మరుచో గుడియుత్తరంబునన్. 2

క. మనమునఁ గదిరిన వగ మో
మునఁ దెల్లము గాఁగ బొమలు ముడుచుచుఁ గడఁకం
దనఖడ్గము దెస కోపం
బునఁ జూచుచునున్న యొక్కపురుషుం గంటిన్. 3

మ. కని డాయం జని వానిచిత్తమరయంగాఁ *జూచి యిట్లంటి సం, జనితాంతర్గతఖేద మాస్యమున విస్పష్టంబు గా సాహసం, బునకుం బూనెదుకారణం బెఱిఁగినం బోలించి నానేర్చురా, పున సాహాయ్యము సేయువాఁడఁ జెపుమా పూర్వాపరం బంతయున్. 4

క. అని ప్రియమున నల్లన ప
ల్కిన నతఁ డిట్లనియె నొక్కగృహపతిసుతుఁడన్

---

* బూని.

ఘనబలుఁడఁ బూర్ణచంద్రుం
డనఁ బరఁగినవాఁడ దుష్క్రియానిపుణుండన్. 5

మ. ఒకనాఁ డేనొకయిల్లు గన్న మిడి యత్యుద్భాసితంబైన సొ
మ్మొకచోఁ డాఁపఁగఁ జూచి పట్టికొని రోషోగ్రాకృతిం దెచ్చి
యా, రెకు లొప్పించిరి నన్ను భూపతికి ధాత్రీనాథుఁడుం
గామపా, లకుచే నిచ్చె నతండు మత్తకరిమ్రోలం ద్రోచి
తా వేడుకన్. 6

క. కరిగణశాలాంగణమున
నురువేదిక యెక్కి చూచుచున్నంత భయం
కరకరదండము సాఁచుచు
నురువడి ననుఁ బొడిచె దంతి యుగ్రాకృతియై. 7

వ. ఏనును. 8

సీ. వెసఁ బూచి పట్టి యాకస మంట వైచి క్రొ
మ్మొడ్డి నిల్చినఁ దప్ప నులికియులికి
కోపించి పొడిచినఁ గొమ్ములమొన తప్పి
చనఁ జూచి బలువిడిఁ జఱచిచఱచి
తొండంబు సాఁచినఁ దొడల బెట్టిదముగా
నిరికి పుష్కరమును గఱచికఱచి
పిఱుసని సృణిపాతభీతిఁ బై వచ్చిన
నసము డింపక యంట నార్చి యార్చి
తే. వారణముతోడఁ దాపనఁ బోరు పోరి
భయము సెడి యున్న యెడఁ గామపాలకుండు
చోద్య మంది మావతు దెసఁ జూచి దంతి
నిలుపు మని పంచి నను జేరఁ బిలిచి ప్రీతి. 9

ఉ. మెచ్చులతానకం బయిన మేటిబలంబు పరాక్రమంబు నీ
కిచ్చిన మాల దైవ మిది యేమిటికిం బుర లెల్లఁ *ద్రోఁపఁగా
మ్రుచ్చులఁ గూర్చి మంచిగుణము ల్గలవాఁడవ యైన నీకు
వి,వ్వచ్చుఁడు గాలిచూలు నెనవత్తురుగాక యొరుల్ సమా
నులే. 10

శా. అన్యాయంబులు దక్కి నన్ గొలువు మిష్టార్థంబు లే నిచ్చె
దన్,ధన్యుం జేసెద నిన్ను నావుడును దద్వక్త్రప్రసాదంబు
వా,గ్విన్యాసక్రమమున్ గుణగ్రహణరాగిత్వంబు నీక్షించి
సా,మాన్యస్వాంతుఁడు గాఁడు వీఁ డని మహామాత్యా
గ్రణిం గొల్చితిన్. 11

వ. ఇవ్విధంబునం గొలిచి ప్రాణోపకారి యైన యమ్మంత్రికిం జిత్తానువర్తి నై మెలంగుచు సేవాచాతుర్యంబునం బరమవిశ్వాసంబు వడసి నిరంతరంబును నతనిమనంబు రంజించుచు నుండి యొక్కనాఁ డేకాంతంబునం దద్వృత్తాంతం బడిగినం జిఱునవ్వు నవ్వుచు ని ట్లనియె. 12

క. విను చెప్పెదఁ గుసుమపురం
బను వీటను రాజహంసుఁ డను నరనాథుం
డనుపమగుణరత్నాకరుఁ
డనఁ దగి రాజ్యంబు సేసె నసదృశలీలన్. 13

చ. అతనికి ధర్మపాలుఁడు ధరామరవర్యుఁడు మంత్రి యేను ద
త్సుతుఁడ సుమంత్రు కూర్మి యనుజుండ మదద్విరదంబపోలె
న, ద్భుతతరతీవ్రకర్మములు పూని యొనర్తు గురూపదేశశి
క్షితకరణీయముల్ సరకు సేయక దుర్దమదర్పశాలి నై.

* శా(డు)గా.

క. జనకుఁడు నన్నయు నాదు
ర్వినయంబులు మాన్ప బుద్ధి విన నొల్లమి నం
దునికి యుడిగి దేశాంతర
మున్న కరిగితి నెంతయు ఘాసముద్ధతవృత్తిన్. 15

క. వారక ధరఁ గ్రుమ్మటి యీ
వారాణసి డాయ వచ్చివచ్చి యెదుర ర
మ్యారామభూమిఁ గంద
ర్పారాధనకేలి సలుపు నతివలఁ గంటిన్. 16

తే. తారకావళిలోన నితాంతకాంతిఁ
బొలుచు బాలేందురేఖయుఁ బోలె నొక్క
యువిద యచ్చెలిపిండులో నున్నఁ జూచి
యల్లనల్లన వేడ్క నంతంతఁ జేరి. 17

వ. తత్సఖీజనంబుల సల్లాపంబులవలన మహారాజుకూఁతు రగు
టయుం గాంతిమతి యను పేరునుం దెలిసి తదీయదుర్లభ
త్వవిచారంబున కెడ యీని మానవికారంబునం బొంది
పొంది. 18

చ. అదియును నన్ను జూచి మదనాతుర యైన తెఱం గెఱింగి
స, మ్మదమునఁ బొందఁ గాంచి యొకమార్గమునం జతురైక
దూతికా, వదనగతాగతాభిమతవార్తల నిక్క మెఱింగి
కన్యకా, సదనము సొచ్చి యన్నెలఁతసంగతి యన్యు లెఱుం
గకుండఁగన్. 19

వ. విహరించుచున్నం గొండొక కాలంబునకు నారాజనందన
గర్భంబు దాల్చి మదుపదిష్టవివిధచిత్రోపాయంబులం జేసి
రహస్యభంగంబు గాకుండ దినంబులు గడపి నదురేయి

కొడుకుం గాంచిన నబ్బాలకు నాప్రొద్ద యొక్క యంతరంగ మైన దాదిం బుచ్చి పరేతభూమిపై వైవం బంచిన నది యును నట్ల చేసి మగుడి వచ్చునెడం దలవరులు గని పట్టి కొని 20

ఉ. ఎవ్వరు పుచ్చి రెందులకు నేమిటి కీనడురేయి వీటికిం
దవ్వులఁ బోయి వచ్చెదవు తప్పక చెప్పుము చెప్పకున్న నీ
క్రొవ్వఱ ముక్కునుం జెవులుఁ గోయుదుమన్న విభీతచిత్తయై
యవ్విధమెల్లఁ జెప్పెనదియంతయు రాజునెఱింగ వారిచేన్.

క. నరనాథుఁడు పనుపఁగ నా
వరపుడు నాయున్న యెడకు వడి నారెకులం
దెరలఁ గొనివచ్చి నిద్రా
పరతంత్రత నున్న నన్నుఁ బట్టించుటయున్. 22

క. పెడకేలు గట్టి వార
ప్పడ జనపతియనుమతమునఁ బురము వెలికి ద్రే
ల్మిడిఁ గొనిచని వధ్యులఁ జం
పెడు నంత్యజు నొకనిఁ జేరఁ బిలిచినఁ గడఁకన్. 23

క. వా లెత్తి యుగ్రుఁడై చం
డాలుఁడు బెట్టిదము వ్రేయుటయుఁ ద్రెవ్వెఁ బెడం
గేలుంగట్టిన త్రాళులు
కాలావధిగామి దైవకారుణ్యమునన్. 24

చ. బలువిడినప్పు డంత్యజు కృపాణము ప్రాణముఁ గొన్న నాదు
దో, ర్బలమున కుల్కి యారెకులు పైఁబడఁజాలక లేటి
పిండు క్రో, ల్పులిఁ గనినట్ల చేవ సెడి పోయిన నేనునుఁ గాన

సొచ్చి వి, చ్చలవిడి రాత్రి పుచ్చి దివసం బగుడుం దల
ఘోయుచుండితిన్. 25

మ. ఒకచంద్రానన యప్పు డొంటిమెయి నయ్యుగ్రాటవీభూమిలో
నికి నేతెంచి ముఖాకృతిం బ్రకటమై నెయ్యంబు దోతేర ను
త్సుకతం దాఁ బ్రణమిల్లి వన్యకుసుమస్తోమంబు నాకర్థిఁ గా
నికఁ గా నిచ్చినఁ గౌతుకంబు మదిలో నెక్కొన్న నేఁ
బల్కితిన్. 26

క. కోమలి! యెవ్వరిదానవు?
నామం బెయ్యది? వనంబునను నొక్కతవుగ
రా మది వేడుక పుట్టుట
కేమి గతం? బెఱుఁగఁ జెప్పు మింతయుఁ నాకున్. 27

వ. అనిన విని యమ్మగువ యి ట్లనియె. 28

సీ. మహనీయగుణనిధి మాణిభద్రుం డన
నభినుతి కెక్కిన యక్షవరుని
యర్మిలితనయఁ దారావళి యనుదాన
నెలమి నిన్నటిరాత్రి మలయగిరికి
నరిగి క్రమ్మఱి వచ్చునపుడు వారాణసి
నగరంబుకడ మసనంబులోన
నొక్కబాలకుఁ డేడ్చుచున్న నేఁ గృప పుట్టి
యెంతయుఁ బ్రీతిమై నెత్తి తెచ్చి
తే. జనకునకుఁ జూపి చెప్పితిఁ గనినభంగి
యాతఁ డప్పుడ చెప్పె ధనాధిపతికి
విను కుమారకుఁ గనుఁగొనువేడ్కఁ జేసి
నన్ను రావించి కిన్నరనాయకుండు. 29

తే. ఉన్న భంగిన చెప్పు మీచిన్నవాని
యందు నీచిత్త మెట్లుండు ననిన దేవ!
యేనుఁ గడుపారఁ గాంచినవాని నెట్టు
లట్ల చూతు నిక్కంబు నీయడుగు లాన. 30

తే. అనిన నిక్కంబ పలికె నీయబల వీఁడు
దీనినందనుం డగు నైన తెఱఁగు మీఁకుఁ
దెలియఁ జెప్పెద నని తనకొలువువారు
వినఁగ ని ట్లర్థిఁ జెప్పె నవి స్తరముగ. 31

క. భువి నార్యదాసి యన విన
యవతి యనఁగ శూద్రకాఖ్యుఁడగు గృహపతికిన్
యువతులు గలిగిన వంశం
బు వెలయ నయ్యార్యదాసి పుత్త్రుం గాంచెన్. 32

ఆ. వాని నర్థి వినయవతి తల్లియనుమతిఁ
బెనిచె నొక్కకొడుకుఁ బెనిచినట్ల
యాకుటుంబ మిట్టు లన్యోన్యజనితసం
ప్రీతి యగుచు మని యతీత మయ్యె. 33

క. వినయవతి కాంతిమతి యా
తనయుఁడు వీఁ డార్యదాసి తారావళి యి
జ్జననంబున శూద్రకుఁడున్
జనియించెం గామపాలనామాంకితుఁ డై 34

ఆ. వారణాసి యేలువానికిఁ బుట్టిన
కాంతిమతికిఁ బుట్టి క్రమ్మఱంగఁ
దల్లిఁ జేరె వీఁడు తనుఁ గన్నతల్లి దు
ర్వర్తనమునఁ బాఱవైచుటయును. 35

క. ఆకాంతిమతికిఁ బతి యై
యేకాంతమ దుర్వినీతి నీసుతుఁ గని తా
నాకామపాలుఁ డిప్పు డ
నేకవ్యథఁ బొంది పోయె నెయ్యెడకేనిన్. 36

చ. అన విని నాకు నీవలన నాదట పుట్టిన నిన్నుఁ బొందఁగా
ననుమతి చేసి నన్నుఁ దగ నంచుట కుత్తుఁడుదాన కాన నా
తని కిలఁ జాఁగి మ్రొక్కి వినతంబుగ నానతి యిమ్ము దేవ !
యి, త్తనయునిఁ గన్నతండ్రి నుచితమ్ముగ నెమ్మెయి నేను
జేరుదున్. 37

చ. అనిన ధనేశ్వరుండు కమలానన! నీదుకుమారు రాజవా
హనసఖుఁ జేయువాఁడఁ జతురంతమహీతల మేల నున్న
వాఁ, డని యెడఁ బల్కి నవ్వ ప్రియు నర్థిమెయిం గను మన్న
నిందు నీ, యునికి యెఱింగి యేనుఁ వనయుం గొనిపోయి
మనోముదంబునన్. 38

తే. రాజహంసుని దేవి యంభోజనేత్ర
యైన వసుమతికడ నిడి యట్లు గాంచి
యిట్లు వచ్చితి నింక నా కేడుగడయు
నీవె చేకొని రక్షింపు జీవితేశ!. 39

వ. అనిన నేనునుం బూర్వజన్మశ్రవణసంస్కారజనితాను
రాగుండ నై తారావళి నయ్యవసరంబున కనురూపంబులైన
యాలాపంబులం గలపికొని తత్ప్రీభావదర్శితరమ్యహర్మ్యాం
బున మానవలోకదుర్లభంబులగు భోగంబు లనుభవించి
నిశాసమయం బగుటయు మెత్తన నమ్మత్తకాశినితో
ని ట్లంటి. 40

మ. రమణీ! మాలనిఁ బంచి చంపు మని క్రూరంబైన దండంబు
నా,కమరం జేసిన చండసింహుని ననాయాసంబునం జంపి వ
చ్చి ముదం బందుదుఁగాని యొండుగతి నాచిత్తంబులో
నున్న కో,పము మానింపఁగ నేర నెద్ది తెఱఁ గొప్పం జెప్పుమా
యి త్తఱిన్. 41

చ. అనవుడు నమ్మృగాక్షి దరహాసమనోహరలీలఁ జూచి నీ
మనమున నున్న కామినిసమాగమ మిమ్ములఁ గోరి తేనిర
మ్మని తగ మేలమాడి వెస నంబరవీథికి నెత్తి తెచ్చి య
జ్జనపతి సెజ్జపట్టయిన సౌధతలంబున నన్ను డించినన్. 42

శా. నిద్రాముద్రితలోచనుం డయినవానిం జండసింహాభిధా
నద్రోహిం దెగఁ జూచి నాపడినబన్నం బెల్ల నుద్యాపనం
బుద్రేకంబునఁ జేయఁ గంటి నని యుద్యోగించినం జూచి యు
న్నిద్రాబ్జానన నాకు నడ్డపడి మాన్పెం జంపకుండం గృపన్. 43

వ. ఏనును సమున్నతశాతకృపాణంబైన కేలు దిగిచికొని తారా
వళి యనుమతంబునం జండసింహుండు మేలుకాంచి నన్ను
గన్నులు విచ్చి చూచి బెగ్గలం బగ్గలంబై నివ్వెఱఁగందిన
నీయల్లుండ ధర్మపాలుండను భూసురాగ్రేసరు తనయుండఁ
గామపాలుం డనువాఁడ నిడియునుఁ దారావళియను నొక్క
యక్షి దేవా! దీని దివ్యానుభావంబున నిట్యేడకు వచ్చితి
నీకు మన్నింపం దగినవాఁడన కాని విరోధిం గా నని యతని
వెఱ వాయం బలికి మఱియును. 44

ఉ. గర్వము మాఱ నీతనయఁ గాంతిమతిం దమకంబు పేర్మి గాం
ధర్వసమాగమంబు నుచితం బని చూడక కూడియున్న నా

దుర్వినయంబు సైఁచి దయతో నన్నుఁ జేకొను నీవు నావుడుం
బూర్వకృతంబుమంచలకు భూపతి వెల్వెలఁబాఱెయి ట్లనున్.

ఉ. ఎగ్గులు చూపి చంపు మని యెక్కుడు పెట్టిన వారిపల్కు లే
లగ్గుగ నాత్మలోపలఁ దలంచి వివేకము లేక యిట్టి నీ
కగ్గలమైన దండ మనయంబునఁ జేసితి మోసపోయి నే
నుగ్గడినైతి నీమొగము చూడఁగ నెట్టులు నేర్తుఁ జెప్పుమా.

ఉ. అల్లుఁడ వీవు రాజ్యమున కంతకు నర్హుఁడ వీవు భూమికిం
దల్లివి తండ్రివిన్ బహువిధంబుల దాతవు నీవు మాకులం
బెల్ల సముద్ధరింప నుదయించిన పుణ్యుఁడ వీవు నీకు నే
నెల్లిమదీయపుత్రిఁ బుర మెల్ల నెఱుంగఁగఁ బెండ్లి సేసెదన్.

వ. అని యిత్తెఱంగున నూఱడం బలికి మఱియు ననేకప్రకా
రంబుల బహుమానంబులు శపథసహితంబులు నగు మాట
లాడి కలసికొనినం బరస్పరవిస్రంభప్రసన్నహృదయుల మై
యున్నంత వేగుటయు నమ్మహీపతి మంత్రిపురోహితవర్గం
బున కంతయుం దెలిపి తారావళిమహానుభావంబుల నొండు
దలంప నేరక తదనుమతిం గాంతిమతి నాకు నిచ్చి సేనా
ధిపత్యంబు నియోగించెఁ దారావళియునుం గుబేరుచేత
విన్నవృత్తాంతంబుం దనయు నిల్లడ యిడి తా నిట వచ్చు
టయుఁ గాంతిమతికి సవిస్తరంబుగా నెఱింగించిన నవ్విధం
బున నలవడి సుఖంబున నున్నవాఁడ నని యాత్మవర్తనప్ర
కారం బంతయు నేర్పడం జెప్ప నిట్లు మైత్రి నిష్టభృత్యుండ
నై యుండుదు నతండును నిజస్వామికిం గార్యఖడ్గంబులకు
ననన్యసామాన్యంబైన సాహాయ్యం బనుష్ఠింపుచు మహా
స్నతుం డై ప్రవర్తిల్లుచుండం గొండొకకాలంబునకు.

మత్తకోకిల. చండసింహుఁడు చచ్చెఁ జచ్చిన చండసింహునిపు
త్రునిం,జండఘోషునిఁ గట్టిపట్టము చండఘోషుఁడు చచ్చినం
జండఘోషునికూర్మి తమ్ముఁడు శౌర్యవంతుఁడు సింహఘో
షుండు రాజుగఁ జేయ నాతఁడు సొంపునన్ ధర యేలఁగాన్.

ఆ. ఏకమంత్రి యైన యాకామపాలుని
చనవు పెంపుఁ దమ కసహ్య మగుడు
నితరమంత్రిముఖ్యు లెగ్గులు పొసరించి
యేకతమునఁ బతికి నిట్టు లనిరి. 50

సీ. కమలాక్షి మీయప్పఁ గాంతిమతీకన్యఁ
గన్యకాత్వము చెడ గాసి చేసె
బందికాఁ డై చొచ్చి పతిఁ బట్టి జంకించి
యజ్జోటిఁ దాఁ బెండ్లియాడె బలిమి
నంతఁ బోవక విషమాహారముగ నిడి
నతినిష్ఠురతఁ జంపె నమ్మహీశు
పదియునుం జాలక యతనిఁ జంపినయట
గుణవంతుఁ డగు చండఘోషుఁ జంపి
తే. ప్రజకు నమ్మికగా నిన్ను బట్టబద్ధుఁ
జేసెఁ గాని పదంపడి చెల్లనీఁడు
బాలభావంబు దక్కి మాపలుకు వినుము
కామపాలుండు ప్రెగ్గడ గాఁడు నీకు. 51

మ. అని నానాఁటికిఁ బెక్కుదోషము లసూయాగ్రస్తు లై కా
మపా, లునిపై నేర్పడఁ జెప్పి చెప్పి కడుఁ బేలుం జేసి భూపాల
నం, దనుఁ దా రెంతయు వశ్యుఁ జేసికొనియుం దారావళీ

శక్తిసం, జనితాంతర్గతభీతిమై విడిచి రత్నాహంబు కోటి
ల్యమున్. 52

వ. అంత నొక్కనాఁడు. 53

క. నేరక వల్లభుఁడు సవతి
వేరం దనుఁ బిలుచుటయును బిట్టలిగి మదిన్
సైరణ సేయం జాలక
తారావళి వాఁ బోయెఁ దల్లిపంద్రులకడకున్. 54

ఉ. ఆకమలాక్షి యిట్లలిగి యక్షపురంబునకు న్నిజంబుగాఁ
బోక యెఱింగి మంత్రులును భూపతియుం దమలోనఁ గూడి
శో, కాకులచిత్తుఁడై నగరి కల్లన వచ్చిన కామపాలుసిం
జేకుఱఁ బట్టి సంకలియఁ జెచ్చెరఁ బెట్టి దయావిహీనతన్.

తే. అతనికన్నులు పుచ్చువా రైరి గాన
యేను నప్పుడె ప్రాణ మీఁ బూని యచట
నాయితం బయి పగతుర నం పొనర్చి
తాఁకఁ జూచెద నాథుఁజదర్ప మొప్ప. 56

ఉ. నాపుడు నిట్లు లంటి మననంబున నేచ్చెడునన్నుఁ జూచి తా
రావళిఁ బ్రీతిఁ గైకొని ధరాధిపుపంపున రాజహంసథా
త్రీవరుదేవి నావసుమతీసతిఁ జేర్చిన బాలకుండ నే
భూవినుతుండఁగాంతిమతిపుత్రుఁడనిక్కఁవమర్థపాలుఁడన్.

ఉ. కావున నీకు నిక్కఁ బనిగాదు విషాదము దక్కి చూడు నా
లావును బీరముఁన్ వెలయ లంకకు వానరవీరుఁ డేఁగున
ట్లీవసుధాధినాయకుని యింటికి నేఁ గెద గాసి చేసెదన్,
దీవన మొప్పఁగా జనకుఁ దెచ్చెద వేగమ యెల్లభంగులన్.

వ. అనుచు విచారించి. 59

క. పెనుమూఁకలలో సందడి
జనకుఁడు తోడ్కొని బడిమొనసేని సంరంభం బె
ల్లను నిష్ఫల మై భస్మం
బున వేల్చిన యాహుతియును బోలెం గాదే?. 60

క. మనకుం దెఱఁ గెయ్యదియో
యని పలికెడుసమయమున మహాసర్పము గ్ర
క్కున నొక్కబొక్క వెలువడి
చనుదెంచెను రోఁజుచుఁ విషజ్వాలలతోన్. 61

తే. మంత్రతంత్రబలమునఁ గ్రమక్రమమున
దానివీర్యంబు మర్దించి తత్క్షణమునఁ
బట్టికొని యప్పు డొక్కయుపాయమాత్ర
నెఱిఁగి యాపూర్ణచంద్రుతో నిట్టు లంటి. 62

సీ. మనకు దైవం బిప్పు డనుకూలముగఁ దెచ్చెఁ
జింతితార్థంబులు సిద్ధిఁ బొందె
జనకుఁ గన్నులు పుచ్చు నని వధ్యశిలకుఁ దె
చ్చినయప్పు డొకభంగిఁ జేరి యతని
నీపాము గఱపించి యే వెజ్జ నై చొచ్చి
వెడచంపు చంపినఁ బుడమిఱేని
యనుమతంబునఁ బతియనుమరణమునకుఁ
గాంతిమతీదేవి గడఁగి యంత్య
తే. మండనార్థంబుగాఁ దనమగని నిజగృ
హంబునకుఁ గొనిపోవంగ నంత నీవు

నన్నుఁ దోడ్కొని చనిన నానంద మెసఁగ
నిర్విషంబు గావించెద నిపుణవృత్తి 63

క. మఱియుఁ దగుపనులపా టే
ర్పఱుపంగాఁ జేయ నగునుపాయం బిది యి
త్తెఱఁగును నా తెఱఁగును నీ
వెఱిఁగింపు మదీయజనని కేకాంతమునన్. 64

వ. అనవుడు నకృత్రిమస్నేహంబుం దెలుపుచున్న మదీయో
ద్యోగంబునం జేసి నన్నుం గామపాలసంభవుం డగుట నిశ్చ
యించి యే నందు రాకకుం గతం బడిగి నావలన దేవర
వృత్తాంతంబును విని మదుపదిష్టక్రమంబునం గార్యం
బొనర్పం బూని యత్యంతహర్షోత్కర్షంబునం బూర్ణచంద్రుం
డరిగెఁ దదనంతరంబ రాజమందిరంబు దెసఁ గలకలం బైన
నాలించి కామపాలుం గన్నులు పుచ్చం గొనివచ్చుటగా
నెఱింగి దర్శనకౌతుకంబున నున్నతస్థలంబు లెక్కువారలం
గలసి వధ్యశిలాసమీపతింత్రిణీశాఖాసమారూఢుండ నై
యున్నంత. 65

క. తోడరుచు జను లొండొరులం
గడవం బఱతెంచి చూడఁగా మజ్జనకుం
బెడకేలుఁ గట్టి తెచ్చిరి
కడునిష్ఠురవృత్తిఁ జింతకడ కారక్షుల్. 66

క. ప్రీతిఁ జనుదెంచి వధ్యశి
లాతటి నునుచుటయు మాలలకు మేటి మహా
పాతకుఁ డొక్కరుఁ డిట్లని
చేతులు నల్దెసలఁ జాఁచి చీరుచుఁ జాటున్. 67

ఉ. ఆఱడిగానిఁ దండ్రి సచివాగ్రణిఁ జేసినఁ గూర్మిసొంపునన్
మీఱి దురాశతన్ జెఱచి మేటిగ రాజ్యము సేయఁజూచి
నం, బాలునిఁ జంప దోస మను పల్కునకుంబతి యిద్దురా
త్మునిం, గాఱియఁ బెట్టఁగాఁ దలఁచి కన్నులు పుచ్చఁగఁ
బంచెఁ జెచ్చెరన్. 68

వ. అనిపలుకు నవసరంబున. 69

క. మ్రానిపైనుండి పడుటయు
కా నెల్లజనంబు దలఁపఁ గడు నేర్పున నే
నానాగము వైచిన నది
నే నడరం గఱచె జనకునిం గోపముతోన్. 70

తే. దానఁ బుట్టినక్రందున మ్రాను డిగ్గ
నుఱికి సందడిలోపల దఱియఁ జొచ్చి
వెజ్జనై మంత్రజలమున విషము మస్త
మునకు నెక్కించుటయుఁ దండ్రి మూర్ఛవోయె. 71

వ. ఇవ్విధంబునం గపటమరణం బాపాదించి కృత్రిమమంత్రౌష
ధంబులు ప్రయోగించి నిర్విషంబు చేయంజాలమి భావించి
మెఱమెచ్చుల కి ట్లంటి 72

సీ. తొల్లి నైకొన్న మందులు మంత్రములు నేఁడు
పరికించి చూడ నిష్ఫలము లయ్యె
నేలినవానికి నెగ్గు దలంచిన
పాపంబు సేసేతఁ జూప కున్నె
చంపింప నొల్లక జననాయకుఁడు నేత్ర
యుగళంబు పుచ్చంగ నున్నచోట

విధి కామపాలుని వెనువెంటఁ జనుదెంచి
సర్పరూపంబునఁ జంపెఁ జూడుఁ
తే. డనిన విని కొంద ఱానంద మంది రచట
కొంద ఱెంతయు శోకంబు బొంది రంత
నడలు గలయట్లు వేవేగ యరుగుదెంచి
కాంతుఁ గనుఁగొని గద్గదకంఠ యగుచు. 73

క. లలన పతిపిదప నిలుచుట
కులనిందకుఁ గారణం బగుం గావున న
న్నలఁపక యీతనియొగ్గులు
దలఁపక యిమ్మనుఁడు చిచ్చు దయతో నాకున్. 74

క. అని చెప్ప పుచ్చు జనపతి
యనుమతమున నంత్యమండనార్థముగా మ
జ్జనని నిజమందిరమునకు
జనకుం గొనిపోయి దర్భశాయిం జేసెన్. 75

ఉ. అయ్యెడఁ బూర్ణచంద్రుఁడు సహాయుఁడుగా నతిగూఢచారి
నై, యొయ్యన చొచ్చి తల్లికి మహోత్సవ మంద నమ
స్కరించి మా, యయ్యకు మంత్రతంత్రముల నభ్యుదయం
బొనరించి వారికిం, దియ్యముమీఱ నే రిపు నధింపఁ గడం
గినమాట లాడినన్. 76

మ. కొడుకా! పుట్టిననాఁడు నిన్న దయతక్ ఘోరశ్మశానంబు
లో, నడురే యెవ్వరు గానకుండఁ బటునానాభూతసంఘం
బుసా, ల్పడ నే వైచిన నన్నుఁ దల్లి యని సంభావించి
రక్షింప ని, క్కడి కేలా? చనుదెంచి తిప్ప డనుచుం గన్నీట
నూఱార్పుచున్. 77

వ. మాతల్లి నన్ను గాఢాలింగనపూర్వకంబుగా మూర్ధాఘ్రా ణంబు సేసెఁ బూర్ణచంద్రుఁ జేతం దనవృత్తాంతంబును మదీ యోపాయంబుల నాపదలుం దలంగుటయుం బతికి నేర్పడం జెప్పిన నతండును బునఃపునరాలింగనంబున నభినందించె న ట్లయ్యిరువురు నానందరసభరితులై యున్నంత సూర్యాస్త మయం బగుటయు రాత్రిసమయంబు నగ్నిప్రవేశం బను చితం బను నెపంబున నహితజనంబుల వంచించి మనకు నియ్యెడ నెయ్యది కార్యం బని యాలోచించుచున్న రహ స్యాలాపంబులలో నస్మదీయగృహప్రాకారంబున కనతి దూరంబున సింహఘోషుశయ్యామందిరం బునికి విని దాని చక్కటిం దెలియ నెఱింగి యనాయాసంబున వానిం బట్టు కొను నుపాయంబు నిశ్చయించి యేనునుం బూర్ణ చంద్రుండును. 78

ఉ. కన్నము పెట్టి పెట్టి యెడఁ గాంచితి మే మొకభూగృహంబు లోఁ, గన్నియపిండు గొల్వఁగ సుఖస్థితి నున్న లతాంగి నంత నా, యన్నులు నన్నుఁ జూచి మలయానలధూతలతా వితానలై, ల న్నిజగాత్రముల్ గడు వడంక భయంపడి నిల్చి రత్తఱిన్. 79

ఉ. అందొకవృద్ధకాంత వినయంబున నా కిలఁ జాఁగి మ్రొక్కి మేం, మందటి మాఁడువారము దయామతిఁ గావుము నావు డుం బ్రియం, బొందఁగ నమ్మృగేక్షణల నోడకుఁ డోడకుఁ డన్నఁ దేఱి నీ, వెందుల కేఁగె దెవ్వఁడ వహీనపరాక్రమ శాలి! చెప్పవే!. 80

వ. అనిన నయ్యవ్వకుం బూర్ణచంద్రుం డి ట్లనియె. 81

చ. ఘనుఁ డగు  కామపాలునకుఁ గాంతిమతీసతికిన్ సుతుం
డితం, డనుపముఁ డర్థపాలుఁడు నరాధిపుపాలికిఁ గార్యకాం
క్షమైఁ, జనియెడు గాఢమార్గమున సంభ్రమమున్ భయ
మున్ విషాదమున్, మనమున దక్కియుండఁ డోకమా
త్రన వచ్చెద మేము గ్రమ్మఱన్. 82

క. పన్నగకాంతల కెన యగు
నిన్నారులు గొలువ నున్న యిది యెవ్వతె యీ
మన్నింట నేమికతమున
నున్నది యెఱిఁగింపు మింతయును దెలియంగన్. 83

వ. అనిన నమ్ముదుసలి నామొగము గనుంగొనుచు ని ట్లనియె.

సీ. కులదీపకుఁడు సింహఘోషున కాచార
వతికి జనించి యివ్వామనయన
నడయాడఁ గఱచిననాఁడు చిత్తంబునఁ
గాంతిమతీకన్య క్రమము తలఁచి
వెలి నిల్పనీక యిచ్చెలువ మీమామతామ
హుండు దాపంబున నునిచె నతని
యోజ తప్పక తత్తనూజులు నిచట ని
మ్మగువ నిల్పిరి తగుమగని కిచ్చి
తే. పుచ్చునంతకు నీగృహమునకు నధిపు
సెజ్జయింటిలో వాకిలి సేసి యునికి
నతిసురక్షిత యై యుండు నంబుజాక్షి
నామమును మణికర్ణిక నరవరేణ్య!. 85

క. అనవుడుఁ బ్రీతాత్ముఁడ నై
చని జనపతిఁ బట్టి బాలసర్పంబును నై

కొని వచ్చి గరుడిచందం
బునఁ దెచ్చితి నతివలున్న భూగృహమునకున్. 86

ఆ. అపుడు సంభ్రమించు నబలలఁ బోకుండ
నాఁగఁ బూర్ణచంద్రు నప్పగించి
కళవళంబువలనఁ గాకుండ మద్గృహం
బునకు నానృపాలతనయుఁ దెచ్చి. 87

క. జనకునకుఁ జూపి చంపెద
నని కడఁగినఁ దల్లి వచ్చి యడ్డపడిన నా
తనిఁ జెఱ నిడి యొఱఁగింపం
బనిచితి నస్మత్పదాతిపరిజనములకున్. 88

మ. జనకుం డగ్గలమైన నేను గడు నుత్సాహంబునన్ మున్ను
గూ, ర్చినదానం బుర మెల్ల వ్రేల్మిడిని నొచ్చెం గాన నేనప్డు
శ, త్రునికాయంబులఁ బట్టఁ బంచి యలుకం దున్మించి యా
పూర్ణచం, ద్రుని రావించి నయంబు విక్రమము నుద్యో
గంబు సంధిల్లఁగన్. 89

వ. మఱునాఁడు 90

ఉ. ఎల్ల తెఱంగఁ దండ్రికి మహీపతిపట్టము గట్టి వేడ్క ను
త్ఫుల్లసరోజనేత్రి యగు భూపకుమారికఁ బెండ్లియాడి శో
భిల్లెడు రాజ్యసంపదలఁ జేర్చియు భూవర! నిన్నుఁ గొల్వఁ
గా, నుల్లము గోర్కులం బెనఁగి యుత్తల మందుచు నుండ
నున్నెడన్. 91

ఆ. చండవర్మఁ డిట్లు చంపాపురంబుపై
వచ్చుటయును సింహవర్మతోడి

బాంధవమ్ము పేర్మిఁ బ్రాపుగా నేతెంచి
తొంటికోర్కిఫలము గంటి నధిప!. 92

చ. అన విని రాజవాహనధరాధిపుఁ డక్కట! దైవ మిట్లు నే
ర్పునకు సహాయమైన తలఁపుల్ దలకూడుట యింత యొ
ప్పునే, యని ప్రమతిం గనుంగొని ముఖాంబురుహం బలరంగ
నీదుకీర్తన మెటు లన్న నాతఁ డనురాగమునం బ్రణమిల్లి
యి ట్లనున్. 93

చ. అనితరగమ్యవాఙ్మయమహార్ణవవర్తనకర్ణధార! స
జ్జనధరణీరుహాత్కరవసంత! వికారవిదూరచిత్త! రా
జనయవిధాప్రయోజనవిశారద! శారదమేఘకాంతిభం
జనపటుకీర్తిజాల! కులసత్తమ! యాజకమండలోత్తమా!.

క. ఆర్జితబహువిధపుణ్యా!
నిర్జితదేవేంద్రవిభవ! నిరుపమమూర్తీ!
వర్జితదుర్జనసంగ! ప్ర
తర్జితకలిదోష! సతతదానవినోదీ!. 95

మాలిని. మతివిజితసురేజ్యా! మాన్యకామ్యైకరాజ్యా!
వితరణరవిపుత్రా! విశ్వరంభోజమిత్రా!
వితతగుణసముద్రా! విశ్రుతాచారముద్రా!
రతిపతిసమరూపా! ప్రౌఢవిజ్ఞానదీపా!. 96

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలస దభినవదండి
నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార
చరిత్రం బను మహాకావ్యంబునం దష్టమాశ్వాసము.

# నవమాశ్వాసము.

శ్రీ విలసనరమణీయా!
భావితభవపాదపద్మ (భక్తి) నిధానా!
భూవినుతశుభచరిత్రా!
ధీవిభవాత్తస్వరూప! తిక్కచమూపా!. 1

శా. దేవా! దేవర యున్నచో టెఱుఁగ నుద్దేశించి దేశంబులం
దే వర్తించుచునుండి వింధ్యగిరిపై నేకాంత ముగ్రాటవిం
బోవం బోవఁ బయోజబంధుఁ డపరాంభోరాశిలోఁ గ్రుంకె
సం,ధ్యావేళన్ వన మెల్లఁ బల్లవితమైనట్లుండ రంజిల్లుచున్.

ఉ. పల్లము మిట్టు వేఱుపఱుపన్ వెర వేదెడునట్లుగాఁ దమం
బెల్లెడ నిండఁ బర్వుటయు నేఁగుట క్రేఁ గని నిశ్చయించి
యేఁ, బల్లవశయ్య భూతలముపై నొకవృక్షముక్రేవఁ దీర్చి
యం, దల్లన మేను సేర్చి వినయంబునఁ బల్కితి మీఁదు
చూచుచున్. 3

ఉ. మీకృపఁ గోరి భూరుహసమీపము చేరితి నాప్రియం
బెడం,జేకొని కావుఁ డిందుల వసించిన దైవములార! యొం
టిమైఁ, జీఁకటిరాత్రి నాగహరిసింధురసూకరపుండరీకభ
ల్లూకపరీతకాననములో నిట నూఱడి నిద్రవోయెదన్. 4

మ. అని యొక్కించుక కన్ను మూయ నెడ దివ్యస్ఫారసౌఖ్యం
బునం, దను వుద్యత్పులకాంక మయ్యె నమృతార్ద్రం బైన
చందంబునన్, మన మానందముఁ బొందె నిట్లగుడు నన్నా

నించి యే నక్షత్రతతిఁ, గనుదో యల్లన విచ్చి మేదినియు నాకాశంబునుం జూచితిన్. 5

వ. ఇట్లు కలయం బరికించి రమణీయంబైన హర్మ్యంబును విశ్రుతంబైన వితానంబును నిద్రాపరవశంబైన తరుణీజనంబును మృదుతలంబైన తల్పంబును నందు మదీయాంగంబునుం గదిసి నిద్రించుచున్న కన్యకారత్నంబునుం జూచి యచ్చెరువంది యాత్మగతంబున. 6

సీ. ఏను నిద్రించిన కాననం బెటు వోయె
నీసుధాభవన మిం దెందు వచ్చెఁ
గాననాంతర్గతఘనశాఖ యెట పోయె
నీవితానం బది యెట్లు గలిగె
లత లెందులకు నేఁగె లావణ్యవతుల మొ
త్తంబు దా నేమికతమునఁ జేరెఁ
జిగురులం దీర్చిన సెజ్జ యెందుల కేఁగె
నీయండజంబుపా న్పేల పొదివె
తే. క్షితి యేవల నరిగె నీనాతి నన్ను
నేమిగతిఁ జెందె నింతయు నింద్రజాల
మగునొ నిక్కవ మగునొ యీయద్భుతంబు
తెఱఁగుఁ దెలియంగ నెమ్మెయి నెఱుఁగువాఁడ 7

క. ఈమగువ దేవకామిని
గామి యెఱింగించెఁ గన్నుఁగవ యిదె యుద్య
త్కామచరితమున నెంగిలి
గామి యెఱింగింపఁ బెక్కు గల వూహింపన్. 8

సీ. కౌఁగిటఁ బొందమిఁ గామినికుచయుగ
ళంబు దాళములచందంబు వోలె
నిరుపమభోగంబు నిబిడమై యంగంబు
సాలభంజికతనులీలఁ బోలె
భూషణానువర్తిఁ బొలఁతికపోలంబు
దళ మెక్కి చంపకదళముఁ బోలె
నింపెసలారఁ జలింపక యునికిఁ గె
మ్మోవి లేఁబవడంపుఁదీవఁ బోలె
తే. నడియుఁ గాక పరస్త్రీవిహారమునకుఁ
జొరని నాచిత్త మిప్పు డీసుందరాంగిఁ
దగిలెఁ గావునఁ బరసతీత్వంబు లేని
తెఱఁగు తెల్లమై యున్నది దీనియందు. 8

వ. అని డోలాయమానమానసుండ నై యున్న యవసరంబున నొక్కింత నిద్రం గను మోడ్చి యనంతరంబ కఠినస్పర్శనంబున మేలుకాంచి. 10

క. ఎప్పటికాంతారములో
నెప్పటివృక్షంబునీడ నెప్పటిచో నే
నెప్పటితలిరులపాన్పున
నెప్పటిచందమున నునికి యేర్పడఁ గనుటన్. 11

మ. మును సౌధంబును దల్పముం దరుణియుక్ ముగ్ధాసమూ
హంబుఁ దోఁ, చినచందంబు నదృశ్యమైన తెఱఁగుం జిత్తం
బులో నద్భుతం, బొనరింపం దలపోసి యిందుముఖి నిం
పొందంగ నాలింగనం, బునకుం జేడ్పడియున్న మోసము
వగం బుట్టింప నే నయ్యెడన్. 12

క. వెఱఁగుపడి చిత్రరూపము
తెఱఁగున నున్నంత నరుణదీప్తులు పర్వం
బఱతెంచెఁ దరణిరథ ము
త్తటి నొండువిచార ముడిగి తత్పరమతి నై. 13

క. అంతయుఁ దెలియ నెఱుంగక
కాంతారము వెడలి పోవఁ గాంచితిఁ గల యం
చెంతయుఁ దెంపున వృక్షో
పాంతంబున దైవసాక్షిఁ బ్రతినలు పట్టన్. 14

వ. తదవసరంబున. 15

తే. కరుణ పొడవైనయ ట్లొక్క సరసిజాక్షి
వచ్చి నాయెడ మాతృభావంబు దోఁప
నిలుచుటయు భక్తిఁ బ్రణమిల్లి నిన్ను నాకు
నెఱుఁగ నానతి యిమ్మన్న నిట్టు లనియె. 16

మ. తనయా! నీచెలి యర్థపాలుజననిం దాఁ గావళిం ద్రోల్లి యే
ననిమిత్తంబ పతిం దొరంగి కడు నన్యాయంబునం బోయినం
గని యక్షేశ్వరుఁ డల్గి వర్షపరిభోగ్యంబైన శాపంబు గ్ర
క్కున నా కిచ్చిన భూత మైతిఁ దుది నీక్షోణీజముం జేరితిన్.

వ. ఇది నా తెఱంగు విను మని యి ట్లనియె. 18

శా. శ్యావస్తీనగరంబునందు మహితం బై చెల్లు నప్పార్వతీ
దేవీవల్లభు నుత్సవంబునకు నర్థిం జూడఁ బో నున్నచో
నీ వీవృక్షముక్రేవ నాశ్రితుఁడ వై నిద్రించుచుండఁ జించి
యుఙ్, బోవం జాలక నిన్ను నెత్తుకొని యంభోవాహ
వీథీగతిన్. 19

ఉ. ఆనగరంబు చేరి నిటలాంబకు గేహము డాయఁ బోవుచో
మానవనాథపుత్రి నవమాలిక సౌధముమీఁద గాఢని-
ద్రానిరతాత్మ యైయునికి దక్కక చూచి తదీయశయ్యపైఁ
మానుగ నిన్నుఁ బెట్టి పురమధ్యముఁ గొల్వఁగఁ బ్రీతిఁ బోయితిన్.

చ. ఉరగవిభూషణుం గొలిచి యుత్సవలీలలు చూచి భక్తిమై
గిరిజకు మ్రొక్కి తత్కరుణఁ గల్మిష మంతయుఁ బాచి తోం
టివ, త్సరపరిభోగ్యమైన పటుశాపము చెచ్చెరనీఁగ వచ్చిసుం
దరికడ నాసనేయు నినుఁ దప్పక చూచితి విస్మయంబుతోన్.

వ. ఇట్లు కనుంగొని శాపదురితసమాగతపురాతనమహానుభావ
నగుటం జేసి ని న్నెఱింగి. 22

ఆ. అకట! యితఁడు ప్రమతి యగు వింధ్యభూమికి
నేల వచ్చె నొక్కొ యీలతాంగి
మీఁద నిపుడు దగులు మిగిలె ని ట్లీతం డ
నంగు చెయ్యి దన లెఱుంగు మఱచె. 23

వ. అనిన నీవచ్చినవిధంబునుం గని యుమ్మలించి నిను నుపలక్షించి.

ఉ. డెందమునందుఁ గూటమి కడిందిగఁ జూచుటఁ జేసి ముద్దియం
బొందఁగ లేఁడువీఁడు పొరపొచ్చెపునిద్రయపోవుచున్న వాఁ
డిందుల నాకు నిల్వఁ దగ దిప్పుడ నెయ్యముఁ దియ్య మె
క్కఁగాఁ, బొం దొనరింపఁ బ్రేమ మదిఁ బొందియుఁ జూడదు
వీని నేనియున్. 25

వ. కావున వీనికిం జొక్కు పుట్టించి యిమ్ముద్దియకుం బ్రమో
దం బాపాదించి రాత్రిసమయంబున నిజతల్పంబుపై వింత
మానిసిం గని పుట్టుదిగులుం బరిహరించి దీనిసౌందర్యంబు

వీనికి విలోచనగోచరంబు సేసి దీని మగుడ బొక్కించి వీని
నెత్తుకొనిపోయి. 26

శా. ఆయుగ్రాటవియంద పెట్టి నిజవృత్తాంతం బెఱింగింపఁగా
నీయజ్ఞానసఁ దాన పొందు గొని వీఁ డెబ్బంగి నైనన్ సుఖ
శ్రీయుక్తిన్ విహరించుఁగాక యని యర్థిం దత్క్రమం బెల్లఁ
జి, త్తాయత్తంబుగఁ జేసి యియ్యెడ కనాయాసంబునం
దెచ్చితిన్. 27

ఉ. నీ విట యప్రమత్తమతి నెమ్మిఁ దలోదరిఁ బొంది సౌఖ్యల
క్ష్మీవిభవంబు నొందు మని చెప్పి పతిం గలయంగఁ బోయెఁ
దా, రావళి యేను నెంతయుఁ బ్రియంబునఁ బొంగి మనం
బులోన రా, జీవదళాక్షి నిల్పుకొని చెచ్చెర నప్పురి కేఁగు
నయ్యెడన్. 28

క. నడుమ నొకబోయపల్లెం
గడువేడుకఁ గోడిపోరు గనుఁగొనియెడు నాసం
దడి దరియఁ జొచ్చి కోళుల
నెడమడువుగ విడుచుచున్న యెడ ని ట్లంటిన్. 29

క. చరణములు నేత్రములుఁ గడు
నరుణము లారెలును ముక్కు నాయతములు కం
ధరములు దొడలును సన్నము
లరయఁగ బకజాతి కది భయంపడుఁ బోరన్. 30

క ఆరెలు వలములుఁ దొడలును
దోరము బలుమెడయుఁ జుట్టుఁ దుండముఁ గుఱుచల్
బీరంబునుఁ నురమును వి
స్తారి యగు న్నారికేళజాతికి నెందున్. 31

క. ఆనారికేళజాతికి
మానుగ బకజాతి పోర మార్కొన దగుదుం
దా నట యరుకలి యనుచును
మానక పోరించు నధికమాత్సర్యమునన్. 32

సీ. ఎదిరినకోడి ము న్నెనసి యారెలు మెడ
వెస గాఁడ నుఱవడి వ్రేసి వ్రేసి
యది వ్రేయ మదికిన్క నడరి బల్పునఁ బట్టి
కబళించి యందంద కదిమి కదిమి
విశిఖముఖంబులు వెనువెంటఁ దగులుచు
నంతంతఁ బోనీక యాఁగి యాఁగి
వాగాటులకు వచ్చి వసుమతి నిలువక
యొంటితన్నునఁ గోస రుడిపి యుడిపి
తే. గెలిచె నామాటఁ దగ నారికేళజాతి
యగ్గలిక నంతఁ బ్రజ యెల్ల నార్చుచుండెఁ
జెలఁగి యొకజాతిమాత్రోపజీవియైన
బ్రాహ్మణుండు న న్నెంతయుఁ బ్రస్తుతించి. 33

క. తనపక్షము గెలుచుటకును
మన మలరఁగఁ గౌఁగిలించి మనయింటికి ర
మ్మని సంప్రీతిం దోకొని
చనియె నిజనివాసమునకు సౌహార్ద్రమునన్. 34

మ. చని సత్కారముతోడ నన్ను నుచితస్నానాసనాదిక్రి
యా, జనితాహ్లాదునిఁ జేసి తాను మును వేశ్యాసక్తిమై
నందుఁ జే, రినచందంబును సాహసక్రియల వర్తింపంగ

దత్తుండ నే, ననియుం జెప్పి యకారణంబ చెలికాఁ డై
వాఁడు నెయ్యంబునన్. 35

ఆ. పురికి నేఁగునపుడు కరము సంప్రీతితో
ననుప వచ్చి నీకు ననుమతంబు
లైన పనుల కే సహాయుండ నయ్యెద
వలయుచోట నన్ను దలఁపవయ్య!. 36

వ. అని పునఃపునరాలింగనంబు సేసి మగుడ నేను శ్రావస్తీ
నగరంబునకుం జని తత్పరిసరారామంబు సొచ్చి. 37

సీ. పుష్పాడి రాలంగఁ బోరిపోరి వీతెంచు
మలయానిలమునకు నులికి యులికి
తీఁగలు కప్పార మూఁగి యాలతి నేయు
భృంగమాలికలకు బెదరి బెదరి
* (మెలమావిక్రొన్ననల్ లల్ఁగ్రోలి కేరు కో
యిలపిండుహూఁతల కలికి యలికి
దోరగాయల మెక్కి తారు రాచిల్కల
దుడుకుసందడులకు జడిసి జడిసి)

తే. మున్నుఁ గనుకలి గాఁకచే బన్నములకు
వచ్చి యఱఁదురి నే నుపవనములోన
నగ్గలించిన వలవంత బెగ్గలించు
చున్నచో నయ్యెడను నొక్కయువిద వచ్చి. 38

క. పగలిటి శశికాంతిగతిఁ
మొగమున వెలవెల్లఁబాటు ముసుఁగువడఁగ లేఁ

* ఈకుండలీకృతభాగము వ్రాఁతప్రతిలో లేవందునఁ బూరింపఁ
బడినది.

చిగురులు పువ్వులుఁ గోయుచు
మిగిలినచగతోడ మత్స్యమీపంబునకున్. 39

వ. అరుగుదెంచి నన్నుం గనుంగొని. 40

ఉ. మోహము సందియంబుఁ దనమోమున సందడిలంగ నల్ల న
త్యాదరవృత్తి నన్ను నిజహస్తగతంబగు చిత్రరూపమున్
గాదవు నన్న చందమునఁ గన్ను మనంబును నుంచుదిక్కులన్
వీదులు వాఱుచుండ నరవిందనిభానన చూచెఁ బల్మఱున్.

తే. దాసిచూచుట గనుఁగొని యేను జిత్ర
ఫలకయందున్న రూపంబు దెలియఁ గాంచి
మేడపైఁ జారుతల్పంబుమీఁద నిద్ర
సేయు నాచంద మగుటయుఁ జిత్త మలరి. 42

క. సరసిజముఖి నవమాలిక
మరుశరముల పాలుపడుట మదిఁ గాంచియు ని
త్తరలాక్షితోడి మాటల
నరసి తెలియ నే నెఱుంగన ట్లి ట్లంటిన్. 43

మ. సుదతీ! పల్లవసంచయంబు కుసుమస్తోమంబునుం జాలఁ గో
సెదు కామానలతప్తయైన యొకరాజీవాస్యకున్ సెజ్జకే!
మదనాస్త్రవ్యథ నీకుని త్తెఱఁగునన్ మాన్పింపఁగా వచ్చునే?
హృదయాహ్లాదము చేయు వల్లభుని నన్వేషింపు మింపా
రఁగన్. 44

క. అనవుడు నామాటలఁబొం
దున కెంత నాసపడి యతిచతుర యగుటం గ్ర
క్కునఁ జెప్ప నొల్లకుండియు
నను ని ట్లని పల్కె నాననం బలరంగన్. 45

తే. నడచి డస్సినచంద మాననమునందుఁ
గానవచ్చెడు నీకు నేకతము నిచట
నేల తిరిగెదు రమ్ము మాయింటి కిష్ట
సంపదలఁ బ్రొద్దుపుత్త మచ్చుటన మనము. 46

చ. అని వినయంబుతో నిజగృహంబునకుం గరమర్థి నన్నుఁ దో
కొని చని పేర్చు నెయ్యమునకుం దగు మజ్జనభోజనాదివ
ర్తన మొనరించి నెమ్మి నుచితంబగు మాటలఁ బ్రొద్దుపుచ్చి
యె, య్యన ధవళాయతాక్షి వదనాంబుజ మించుక యుల్ల
సిల్లఁగన్. 47

క. పలుచోట్లం గౌతుకమునఁ
గలయం గ్రుమ్మరుట మీకుఁ గలుగును నిల నెం
దుల నైన నద్భుతంబులు
గలవే! మీ రెన్నఁడేనిఁ గన్నవి యనినన్. 48

చ. అనవుడు దానిచిత్తగతమైన తలం పెఱుఁగం దలంచి యే
నును మును గన్న చిత్రపటనూతనరూపముఁ బొంద రాజ
నం, దన యనురాగలజ్జలకుఁ దాపల మై వెడనిద్రవోవు
రూ, పును లిఖయించి యాతలిరుఁబోఁడికి నేర్పడఁ జూపి
చెప్పితిన్. 49

క. ఈచందము సౌధముపై
నీచందము పాన్పుమీఁద నీచందము వా
రీచాడ్పున నొండొరువులఁ
జూచుట గల నొక్కనాఁడు చూచితిఁ దరుణీ!. 50

క. అనవుడు నది యిది కల గా
దనఘా! నిక్కంబు చెప్పు మనవుడు నే ముక్క

గని తుది వినినప్రకారము
వినిపించితి నమ్మృగాక్షి విస్మయ మందన్. 51

వ. అదియునుం దనసందేహంబు వాసినం బరమానందంబు నొంది రాజనందన తెఱంగు సవిస్తరంబుగా నెఱింగింపం దలంచి యి ట్లనియె. 52

క. న న్నేలిన నృపనందన
నిన్నుం గలఁ గాంచెఁ గాంచి నెయ్యపుఁ జెలియన్
నన్నుఁ బిలిపించి యత్తెఱఁ
గన్నెలఁతయుఁ దెలియఁ జెప్పె నది యి ట్లనినన్. 53

శా. బాలా! సౌధతలంబునం దొకఁడు మత్పార్శ్వంబునం బాన్పు పై, లీలానిద్రితుఁ డైన మన్మథుఁడు వోలె న్మోదప్పఁగన్నుం గవం, జాలం బొల్పు వహించి యున్న యెడ నాశ్చర్యంబు నెయ్యంబు ను, ద్వేలం బై జనియింపఁగా నతనిఁ బ్రీతిం జూచి కామించితిన్. 54

క. తదనంతరంబ కన్నుల
నొదవిన వెడనిద్రఁ జొక్కియును జొక్కమి బి
ట్టు దెలిసి యయ్యెడఁ గలయ
న్వెదకి యతఁడు లేమి నధికవిస్మిత నైతిన్. 55

మ. నగుఁబాటో యెఱుఁగం దదాకృతిసమానం బేను జిత్రించి తిన్, మగ లీచందమువారలుం గల రొకో మర్త్యంబులో నింతపా, ల్పగు రూపంబునవాఁడు కల్గి యొకకన్యం జూచి యుల్లంబునం, దగులం బొందిన యట్టిభాగ్యవతిచిత్తం బెంత రంజిల్లునో. 56

క. ఈచందమురూపులు మును
చూచియు వినియును నెఱుంగ సుందరి! యం దేఁ
జూచితిఁ జూచినమాత్రన
నాచిత్తము చిత్తజన్మునకుఁ గొలు వయ్యెన్. 57

వ. అని చెప్పి భవదీయాకారచిత్రితంబైన యాచిత్రఫలక చూపుచుం దాపంబు నొందింప నేనును నది కలగా విచారించి.

మ. కలలో నొక్కని నొక్కకాంత గని యాకాంక్షించి పుష్పాస్త్రు చేఁ, బలుబన్నంబులు పొందుచున్న దని చెప్పం బోలునే? విన్న వా, రలు నిన్నున్న గరే? యిసీ! యనుచు ధీరత్వంబు చేపట్టి యా, కులతం బొందక యుండు చెన్నరి మనఃక్షోభంబు నీ కేటికిన్?. 59

క నిక్కపు మగవాఁ డిచటికి
నెక్కడఁ జనుదెంచె? మగుడ నెక్కడి కరిగెన్?
వెక్కసపు మాట లాడకు
మెక్కడిచూ పెట్టికూర్మి యిందునిభాస్యా!. 60

వ. అని మఱియు నానావిధహేతుదృష్టాంతంబులు పలికియు వలవంత మాన్పింప నేరక శీతలక్రియార్థంబు మృదుపల్లవబిసకుసుమాద్యుపకరణంబులు నిగూఢంబులుగా సవదరించికొని పోవం దలంచి యుపవనంబునకు వచ్చి ఫలకచిత్రితంబైన రూపంబు నీరూపం బగుటం జేసి దృష్టిచిత్తంబులు డోలాయమానంబు లగుచున్న యెడ భవదీయకరుణావలోకనంబున నీదృగ్విధంబైన యానందంబుం బొందితి ననిన నేనును ముందర డెందంబునం బొందిన కందు దిగఁద్రావియియ్యంతి నుచితసంభాషణంబులం గలపికొనిన నదియును

నవమాలికపాలికిం జని యతివేగంబునం గ్రమ్మఱ వచ్చి దుష్ప్రవేశంబగు కన్యాకాంతఃపురంబు ప్రవేశించు నుపాయంబు నాతో నాలోచించిన నే నిట్లంటి. 61

క. ఏ నొక బ్రాహ్మణకన్యక
నై నరపతి కిరుకు పెట్టి యంతఃపురకాం
తానివహములో నిక్కఁ జను
దే నోపుదు నాలుగేను దివసంబులకున్. 62

క. నాతీ! చతురత యేర్పడ
నీ తెఱఁ గింతయును *బ్రీతి నేలిన నృపసం
జాత కెఱిఁగింపు మని యే
నాతరుణిం జెప్పి పుచ్చి యాక్షణమాత్రన్. 63

ఆ. మున్ను కోడిపోరు ముదముతోఁ జూచిన
పల్లెకరిగి తొంటి బ్రాహ్మణునకు
నా తెఱంగుఁ జెప్పి నాతిఁ బొందెడువిధ
మెఱుఁగఁ జెప్పఁ దలఁచి యిట్టు లంటి. 64

చ. నరపతిమందిరంబు చొర నాకు నుపాయము గంటి దానికిన్
వెర వెఱిఁగించెదన్ వినుము వేషము వేఱుగఁ జేసి యాఁడు
రూ, పరుదుగఁ దాల్చి వచ్చెద దయామతిఁ గైకొని నీవు
తండ్రి వై, యరిగి యశంకితంబుగ మహాపురుషా! జననాథు
సన్నిధిన్. 65

వ. మదర్థంబుగా నిట్లని విన్నవించునది దీనితల్లి ప్రసవకాలంబునం బరలోకంబున కరిగిన సంతానాంతరంబు లేమిం జేసి యతిప్రయత్నంబున. 66

---

* విన్ను.

ఉ. కానక కన్న కూఁతుఁ గడు గారవమొప్పఁగ నేన దాదినై
యేన సవిత్రినై పెనిచి యిచ్చితి *నచ్చుగ వేదశాస్త్రవి
ద్యానిధియైన విప్రునకు నాతఁడు పెండిలి యాడి పోయె
నా, డ్లేను సమంబులై మగుడ నెన్నఁడు రాఁ డది కారణం
బుగన్. 67

ఉ ఏను దదీయదేశమున కేఁగెద నాతనిఁ దోడితేర ని
మ్మానినికన్యకాత్వము ప్రమాదముఁ బొందక యుండునట్లు
గాఁ, బూని సహాయమై నడపఁ బొందగు బంధులు లేరు
గావున, న్మానవనాథ! నీకడ సమర్పణ సేయఁ దలంచి
వచ్చితిన్. 68

చ. అనద మహీసురోత్తముఁ డనంతవయస్కుఁడ నీకృపావలో
కనమున నేను బాత్రుఁడఁ బ్రకాశయశోధన! ధర్మవర్తనుం
డనియెడు పేరు సార్థ మవునట్లుగ నిక్కమలాక్షిరక్షణం
బొనరఁగఁ జేయు మే నతనియున్న డకుంజని వచ్చునంతకున్.

చ. అనవుడు సమ్మతించి నను నంతిపురంబున నింతిపిండులో
జనపతి యుంచు నేను బలుచాయల మాయల జేలు వెట్టి
య, మ్మనుజగణేశు పుత్రి నవమాలికవాసగృహంబు చొచ్చి
యం, దనుదినము న్మనోభవసుఖాంబుధిలోపల నోల
లాడెదన్. 70

వ. అనిన నతండునుం గపటవర్తనలంపటుండు గావునం బ్రీత
చిత్తుం డై స్వీకృతకన్యాకారుం డగు నన్నుం దోకొని చని
మదుక్తప్రకారం బనుష్ఠించిన రాజానుమతంబున నేనును
నంతఃపురంబు చొచ్చి యత్తెఱంగంతయు నవమాలిక కెఱిం

* శౌక్యటు.

గించి యన్య్యు లెఱుంగకుండ సఫలితమనోరథుండ నై యున్నంత ధర్మవర్ధనమహీశ్వరుండు నవయౌవనాలంకృత యైన కూఁతునకుం దగినవరుని నెందునుం గానక మంత్రి జనానుమతంబున స్వయంవరం బాఘోషించిన. 71

చ. మనమున సంతసిల్లి నవమాలిక నూఁజఁడఁ బల్కి తొంటివి ప్రునికడ కేఁగి యంతయు నపూర్వమనఃప్రియ మొందఁ జెప్పి య,వ్వనితకు నాకు నెయ్యపువివాహము చొప్పడు నీవు వచ్చితో,కొని చను దెమ్ము నన్ననినిగూఢముగా మరలంగ వచ్చితిన్. 72

క. వంచకవరుఁ డగు నతఁ డే
తెంచి ప్రియం బెసఁగ వసుమతీనాథుని దీ
వించి జనకుండు సుతఁ దో
తెంచుగతిం దెచ్చె నన్నతిశ్లాఘ్యముగన్. 73

చ. అరుదుగ ధర్మవర్ధనధరాధిపుఁడుక్ నవమాలికాస్వయం
వరమునకుక్ సమస్తనృపవర్గములం బిలిపించెఁ దత్సభాం
తరమున నేను సర్వజనతానయనప్రియవేష మొప్పఁగా
నరిగితి మద్వయస్యులు నిజానుజుఁగా నను గారవింపఁగన్.

వ. అయ్యవసరంబున. 75

మ. అతిరమ్యంబుగఁ బూసి కట్టి తొడి కన్యారత్న మేతెంచి భూ
పతులక్ విప్రకుమారులక్ వరుసతోఁ జాగ్రిధాంగనల్ చూపఁ
గా,వితతాలాపవిలాసలోచనములన్వీక్షించుచుక్ డాసియు
ద్ధతసౌరభ్యవిలుబ్ధభృంగవిలసద్దామంబు ప్రేమంబునన్. 76

వ. మదీయాంశంబునం *బూజించిన. 77

* వైచిన.

క. నవమాలికాస్వయంవర
మ్మునను నడియాస విడిచి యవనతముఖు లై
యవనీపాత్మజు లందఱు
నవమానాక్రాంతు లగుచు నరిగిరి కలయన్. 78

వ. నరనాథుండును నన్నుం గని సంతసిల్లి యత్యంతవిభవం బెసంగ వివాహంబు సేసి సకలసంపదలు నిచ్చి సర్వాధికారిం జేసిన. 79

ఉ. ఏనును ధర్మవర్తనమహీపతియిచ్చు యొఱంగి రాజసే
వానిపుణత్వ మేర్పడ దివానిశముం జరియించి తద్దయా
నూనవిభూతి పెంపున మహోన్నతిఁ దాల్చి యతండు నిర్భ
యుం, డైన విలాససౌఖ్యముల నందఁగ రాజ్యము సేయు
చుండియున్. 80

క. నరపాలలోకచూడా
భరణములగు నీదుచరణపద్మములు నిరం
తరముఁ గొలుచు నుత్సవమునఁ
బొరయంగా లేమి సుఖము పొడకట్టువడెన్. 81

వ. అంత సింహవర్మకు నెడరైనం దోడుపడుటకు నిందులకు వచ్చి దైవయోగంబున భవదీయసేవాసౌఖ్యంబు గాంచితి.

క. అని వినయ మొప్పఁ బ్రణమి
ల్లిన దైవబలంబు బుద్ధిలెస్సతనంబుఁ
గొనియాడి మిత్రగుప్తుం
గనుఁగొని మే నెలమిఁ బొందఁ గౌతుక మడరన్. 83

మ. కరుణోదాత్తుఁడుదారచిత్తుఁ డతులాకారుండు ధీరుండు వి
స్తరసత్కీర్తిపవిత్రమూర్తి కవితాధన్యుండు పుణ్యుండు కా

వ్వరతిస్తుత్యుఁడు సత్యుఁడాశ్రితశివధ్యానుం డహీనుండు భ
వ్యరమాసిద్ధివిశాలబుద్ధి వసుతృప్తాచార్యవర్యుం డిలన్. 84

క. కవిలోకచాతకవ్రజ
నవజలదస్తనితభాషణప్రకరుఁడు భా
రవికల్పకల్పకపరా
భవకరణధురీణదీర్ఘబాహుం డెలమిన్. 85

మాలిని. నిరతిశయవివేకోన్నిద్రుఁ డక్షీణభద్రుం
డరిసచివమహోపాయాపహారుం డుదారుం
డరభసకలభాషుం డస్తదోషుండు యాగా
హరణనిపుణచిత్తుం డప్రమత్తుండు ధాత్రిన్. 86

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలస దభినవదండి నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార చరిత్రం బను మహాకావ్యంబునందు నవమాశ్వాసము.

---

# దశమాశ్వాసము.

శ్రీస్తనమండనమేదుర
కస్తూరీబహుళకాంతికవిబుధవక్షః
శ్శస్తహరిచరణకమలో
పాస్తికృతస్వస్తి! తిక్కనామాత్యుఁ డొగిన్. 1

వ. రాజవాహన ధరాధీశ్వరుండు. 2

క. నీవర్తనంబు చెప్పుము
నావుడు నతఁ డెంతయును వినయమునఁ బ్రణతుం
డై వచనరచన యొప్ప మ
హీవరునకు విన్నవించె నిట్లని ప్రీతిన్. 3

వ. ఏను దేవర వెదకి వివిధపురపట్టణగ్రామపల్లీఖేటకంబులం
గ్రుమ్మరుచుండి యొక్కనాఁడు. 4

క. వినుతమగు దామలిప్తం
బను నగరముపొంత మధుకరామోదభరం
బున నల్లఁ బొలయు పవనుని
తనుపున నింపారు తోఁట దరియం జనుచోన్. 5

క. పంచమహాశబ్దంబులు
వించు ననంతరమ సుచిరవిద్యుల్లేఖా
సంచయ మనుకరణిం దో
తెంచెం దరుణీ*జనంబు దృష్టికిఁ బ్రియమై. 6

---

* చయంబు.

క. తొడవులు దొడుగుచుఁ బువ్వులు
ముడుచుచుఁ దిలకంబు లొప్పముగఁ బెట్టుచుఁ బొ
ల్పడరఁగఁ బూఁతలు పూయుచు
మడుఁగులు గట్టుచుఁ గడంగి మగువలు ప్రీతిన్. 7

క. ఉత్సవము తెఱం గై సం
పత్సదృశాచరణవిభవపరిణతిమై న
త్యుత్సుకతం గై సేసిరి
మాత్సర్యాన్వితములైన మాటలతోడన్. 8

వ. వారలం జూచుచుఁ జనుసమయంబున. 9

మ. తనశృంగారము దాన కైకొనుచు నుత్సంగస్థవీణామృదు
ధ్వనితోఁ గూడఁగఁ బాడి పాడి తెలివొందం దన్నుఁ దా
మెచ్చుచున్, జనసమ్మర్దముదిక్కు చూచుచుఁ బిశాచ
గ్రస్తసంకాశుఁ డై, యనురాగంబునఁ బొందుచుండె నొకఁ
డేకాంతప్రదేశంబునన్. 10

వ. వాని డాయం బోయి యీయుత్సవంబునకుం జేరెద్ది? కార
ణం బెయ్యది? యుత్సవానుత్సుకుండ వై యేకాంతంబునందుఁ
దంత్రీనినాదంబు వినోదంబుగా నీ యున్న తెఱం గేమి?
యెఱింగింపు మనిన వాఁ డి ట్లనియె. 11

చ. శుభచరితాభిశోభితుఁడు *సుహ్మామహీపతి తుంగధన్వుఁడన్
విభుఁ డభిరామరాజ్యపదవీకలితుం డయి తాను నన్యదు
ర్లభసుఖ మందియుం దనయలాభము లేమికిఁ గంది యాత్మస
ద్విభవము నిష్ఫలం బని మదిం దలపోసి గురుండుపన్నఁగన్.

* ఇచట 'శూరమహీపతి దన్తతన్వయా' యని యుండ 'సుహ్మాపతి స్తుంగధన్వానామ' అను మూలమునకు విరుద్ధముగా నున్నందున సవరింపఁబడినది.

క. నేమముతో నిజకాంతా
స్తోమంబును దానుఁ గొల్చె సోమాపీడా
నామాంకిత యగు దేవతఁ
గామితఫలదాయిఁ బుత్త్రకాంక్షాపరుఁ డై. 13

వ. ఇట్లు గొల్చినం బరమేశ్వరి ప్రత్యక్షం బై నీకు నొక్క పుత్త్రుండునుం బుత్త్రియు నుద్భవింపం గలవారు పుత్త్రికిం బతి యైనవాని ప్రాపునం బుత్త్రుండు బ్రతుకం గలవాఁడు పుత్త్రి యెవ్వనిం జూచి వలచె వాఁడె మగం డగు సప్తమ వర్షంబు దొడంగి పాణిగ్రహణసమయంబు తుదిగాఁ బ్రతివర్షంబును నీకూఁతురు నాకుంగందుకోత్సవంబు సేయం గల దని పలికినం బ్రసాదం బని పోయి దేవీకృప నపత్య ద్వయంబుం బడసి కొడుకునకు భీమధన్వుం డను నామం బునుం గూఁతునకుం గందుకావతి యను పేరును బెట్టె నట్టి కందుకోత్సవంబునకు నత్తరుణి దేవీగృహంబునకు వచ్చు చున్న దని చెప్పి వెండియు ని ట్లనియె. 14

తే. అధిపనందన నెచ్చెలి యైన చంద్ర
సేన యనియెడు పడఁతి నాజీవితేశ
దానిపై భీమధన్వుండు దగిలి యుండుఁ
గష్టచారిత్రుఁ డాతండు దుష్టబుద్ధి. 15

వ. అతనిచరితం బ ట్లుండె. 16

క. ఇచ్చటిసంకేతంబును
నచ్చేడియ నాకుఁ జెప్పె నది యింపెసఁగన్
వచ్చుట కెదుళ్ళ చూచెద
మచ్చరితం బివ్విధంబు మానవతిలకా!. 17

సీ. అనుచున్న యవసరంబున నొక్కకోమలి
చనుదెంచె వాఁడును సంభ్రమమున
నెదురేఁగి వదనంబు హృదయంబు వికసింపఁ
గమలాక్షి బిగియారఁ గౌఁగిలించి
కొనివచ్చి చేరువఁ గూర్చుండి నాతోడ
నెంతయుఁ బ్రీతిమై నిట్టు లనియె
నాప్రాణమునకుఁ బ్రాణం బైనయది యిప్పు
డేను జెప్పిన చంద్రసేన సుమ్ము

తే. భీమధన్వుండు దినిన నాపేరికూర
నంజ, నే నిది వెలిగాఁగ నాకు నొక్క
నిమిష మేనియుఁ గడపంగ నేరరాదు
ప్రాణములతోడి పొం దింకఁ బాయువాఁడ. 18

చ. అనవుడు నాలతాంగి కుసుమాయుధసాయకసన్నిభంబు లై
మనమునఁ బ్రాణవల్లభుని మాటలు నాటిన సంచలించి యి
ట్లనియె మదర్థమై కులము నర్థముఁ గీర్తియుఁ బాయఁ బెట్టి
నీ, యునికికిఁ దోడు దైన్యముగ నొందు తలంపు దలంపఁ
గూడునే?. 19

వ. అదియునుం గాక యర్థదాసుం డను సార్థవాహునకుం గోశ
దాసుండనం బుట్టి నామీఁదికూర్మి కారణంబుగా వేశదాసుం
డను హీననామంబు దాల్చి తిదియునుం జాలదే? నన్ను
నీ కిష్టంబగు దేశంబునకుం దోడ్కొని పొమ్మనిన సమ్మతించి
మదవ్వదనం బాలోకించి యి ట్లనియె. 20

క. ఏదేశంబు సమృద్ధం
బేదేశము ధర్మబహుళ మేదేశము తా

వై దేశికులకు సుఖకర
మాదేశము దెలిసి చెప్ప మరుగఁగవలయున్. 21

తరల. అనిన నిట్లని యేను బల్కితి నక్కటా! పరదేశ మీ
వనితఁ దోడ్కొని పోవవచ్చునె? వచ్చునేని సహాయమై
యనుప వచ్చెద మీకుఁ జిత్తసుఖావహంబుగ నియ్యెడన్
మనుప నేర్చితినేని నేర్చెద మాట లన్నియు నేటికిన్. 22

క. అని పలుకఁగ మృదునూపుర
నినదము రశనాకలాపనినదము వనితా
జనసరసవచనరచనా
నినదంబును నిండె వర్ణనీయం బగుచున్. 23

వ. ఆనినదం బాలించి చంద్రసేన యి ట్లనియె. 24

తే. కందుకోత్సవమునకు భూకాంతపుత్రి
వచ్చుచున్నది నాకుఁ బోవలయుఁ బిదప:
గార్య మూహింత మిప్పు డక్కాంతఁ జూడ
నిష్టమేని నాపజ్జన యేఁగుదెండు. 25

వ. అనవుడు 26

తే. ఏము దాని పిఱుందన యేఁగి రమ్య
రంగతలమున కరిగి యారాజతనయఁ
జూచుచుండితి మంత నాసుభగ లీల
నాదుహృదయంబులో నర్తనంబు సేసె. 27

వ. అట్టిసమయంబున నపూర్వలక్షణాలంకృతంబైన యాకాంత
నీక్షించి విస్మితాంతఃకరణుండ నై యాత్మగతంబున. 28

సీ. లక్ష్మిహస్తమునకు లాంఛనం బబ్జంబు
హస్తంబ యబ్జ మీయబ్జముఖికి

సిరి పురాతనుఁడైన పురుషుని మును*(గూడఁ
జెలువుని గూడ) దీచిగురుఁబోఁడి
జనులకు నిందిరాసతి పొడచూప దీ
పద్మాక్షి కన్నుల పండువయ్యె
నింత ప్రాయం బని యెఱుఁగము కమల కీ
నాతికి నెలజవ్వనం(బు హెచ్చెఁ
తే. గాన) నీలక్షణమ్ములు కమలనిలయ
లక్షణములకుఁ గడు నగ్గలంబు లిట్టి
వనితకన్ను మనంబు నెవ్వానిఁ దగిలె
నతఁడె కాఁడె మన్మథునకు ననుగలంబు. 29

క. (అని తలఁచుచుండ) వనజా
నన కందుకకేళియందు నానావిధులం
దన నేర్పు మెఱసి యాడెం
గనుఁగొనల మెఱుంగు లెల్లకడలం బొలయన్. 30

వ. అయ్యవసరంబున. 31

క (చెఱకువిలుకాని) యమ్ముల
తెఱఁగున వడిఁ గందుకావతీదృగ్దీప్తుల్
నెఱ నాటి ధైర్య మంతయుఁ
బఱిగొని ననుఁ గుసుమబాణు బాఱిం ద్రోచెన్. 32

తే. కందుకక్రీడ దీరిన నిందుముఖియుఁ
జెలులతోఁ) గొంత ప్రౌఢ కోమలవిహార
లీలఁ జరియించి వేడ్క సాలించి యంబి
కాభివందన మొనరించి యరుగునపుడు. 33

* ఈపద్యములలోని కుండలీకృతభాగములు వ్రాఁతప్రతిలో శిథిలములు.

క. మనము నను మరగి వెలిపడి
తనమేఱ (జొరునొ చోరదొ యని) దాని మరలి చూ
చినయట్లు కటాక్షము నా
తనువునఁ గీలించె మదనుదర్పం బలరన్. 34

వ. ఇట్లు సవిలాసావలోకనంబు సేయుచుం జని కన్యాంతఃపురం
(బుం బ్రవేశించె నేను)నుం గుసుమశరశరజర్జరితచిత్తుండ
నగుచుం గోశదాసుతోడం దదీయనివాసంబున కరిగి తత్సం
పాదితసంప్రీతిపూర్వకస్నానభోజనంబు లిచ్ఛానురీ(తిమనో)
హరంబుగాఁ జలిపి సాయంతనసమయంబున నతండునుం
జంద్రసేనయు నాతో మధురసల్లాపంబు సేయుచున్న యెడ
నమ్ముదిత వల్లభు(మేన నొయ్యారంబు)న నొరంగి విస్రంభ
సుఖానుభవచరిత యైన దాని నుపలక్షించి యతం
డి ట్లనియె. 35

క. వనితా! యీచందమునన
యనఁగి పెనఁగి యేను నీ(వు నాజీవితముం)
బనుపడునట్లొగ దైవం
బనుగ్రహము సేయునొకొ? దయాతత్పర మై. 36

క. అనవుడు నాతనిపలుకుల
కనుగుణముగ నిట్టు లంటి నబలా! (నా)' యొ
(ద్దను నిపు డొకమం) దున్నది
కొను మిచ్చెద భీమధన్వ కూరిమి చెలుపన్. 37

క. ఆమందు మేనఁ బూయఁగఁ
గోమలి! యాక్షణమె యాఁడుఁ గ్రోతి వగుదు త

ద్భామిాఁ(శసుతున కీపైఁ)
బ్రేమంబును జోవు నీకుఁ బ్రియ మొనరంగన్. 38

క. అనిన దరహాసితముఖి యై
నను నీజన్మంబునందు నగచరవంశం
బునఁ బుట్టించెదు చుట్టమ
వని నమ్మిన నిట్లు చేయ నగు నే? నీకున్. 39

వ. అని మఱియు ని ట్లనియె మనకుం గుటిలోపాయంబు పని లేదు మనతలంపుఁ సఫలం బయ్యె నది యె ట్లనిన. 40

తే. కందుకావతి యెవ్వనిఁ గలిసె వాఁడ
మగఁడు భీమధన్వుండు నమ్మగువమగనిఁ
జేరి బ్రదుకంగఁ గలఁ డని చెప్పె నొక్క
దైవ మాదివ్యవాక్యంబు దప్ప దెట్లు. 41

ఉ. ఆయబలాలలామ భవదాస్యము వేడుకతోడఁ జూచి పు
ష్పాయుధుచేత నోఁబడియె నంతయు రాజున కేన చెప్పి నిఁ
రోయఁగ పత్తుఁ గందుప మెఱుంగుట నాతఁడు నన్ను పంచి
నఁ, వేయును నేల నీవు పృథివీపతి యయ్యెదు దైవశక్తి
తోన్. 42

వ. భీమధన్వుండు నీచేతి లోనివాఁడ యదియ మాకుం బ్రదుకు తెరు వీరాత్రి యుంచుక సే పెట్లైన నూరకుండి యెల్లి మనకార్యము సఫలంబు చేసికొందము. 43

మ. అని నన్నాఁ ఱడఁ బల్కి వల్లె యనఁగా నాలింగనం బర్థిఁ జే
సి నరేంద్రాత్మజఁ గొల్వ నేఁగుటయు నేఁ జింతానిమ
గ్నుండ నై కనుదో యుంచుక యేని నిద్రఁ బొరయంగా నేర

మిఁక రాత్రి యెల్లను గందర్పునిచేత నొంచఁబడితి నుల్లం
బెంతయుఁ బెగ్గిలన్. 44

వ. అంత సూర్యోదయం బగుటయుం జంద్రసేన నన్నుం బొ
మ్మని నియమించినం గందుకావతివలసి లోలత్వంబున జేల
నై యియ్యకొని పోవఁ దానునుం జనియె నేను దినము
ఖోచితవ్యాపారంబుల నాదరంబున నిర్వర్తించి. 45

శా. మాధ్యాహ్నిక్యత్యుఁడ నై మహీశసుత నాత్మంగోకతాపంబుతో
నుద్యానంబున మాధవీగృహములో నున్నంత నచ్చోటికిఁ
హ్యాద్యాకారత మేదినీశతనయుం డేతెంచి పట్టించి న
న్నుద్యత్కోపముతోడఁజూచి పలికెక్ హుంకారపూర్వంబుగన్.

ఆ. నీవు రాజవేని నీబంటునకుఁ జంద్ర
సేన తాను వనిత యానె? కందు
కావతీవధూటి దేవి యటే! నీకు
బావ రాజ! యెచట బ్రదికె దింక. 47

వ. అని పలికి యన్యు లెఱుంగకుండఁ దనయింటికిం గొనిపోయి
శృంఖలానియమితచరణుం జేసిన. 48

తే. నాదుమోసంబు దైన్య మొనర్పఁ గానఁ
దూఱ వగవక దైవంబు దూఱు టుడిగి
బోఁటి *నేరమి నింతలు పుట్టె నని త
లంచుటయు మాని నన్న నిందించుకొనుచు. 49

వ ఇట్లని విచారించితిఁ జంద్రసేన లోఁతుగల మనంబు లేని
యది యగుటంజేసి వెఱంగుపడి తలంపు తుంగధన్వాన
కెఱింగించు క్రమంబునకుం జొరక భీమధన్వుకడకుం జని

* యొడ నిమిత్తంబులు.

నావలన విన్నమసీయవంశవృత్తంబులు నత్తన్విచిత్తంబు
నాయందుం దగులుటయు నెఱింగించి తాను ముదుసలి
యై దైవవాక్యంబును దలంచిన నతండు కుటిలహృదయుండు
గావున. 50

తే. కోశదాసుండు నదియును గూడి యిట్టి
యకృత మొనరింతురే యని యాత్మఁ దలఁచి
తలఁపు దోఁపకయుండుచందమునఁ బలికి
యాతఁ డెచ్చోట నున్నవాఁ డనిన నదియు. 51

క. ఉపవనమున నాయుండుట
నృపసుతునకుఁ జెప్పె నతఁడు నెమ్మిమెయిన్ వ-
చ్చుపగిదిఁ బోద మని కపట
లపితుం డై వచ్చెఁ గావలయు నూహింపన్. 52

వ. అనుచు. 53

క. ఈవిధము వితర్కము నా
భావమునం బుట్టి యేమి వాటిల్లిన మ
ద్భావి యనుచుండ నంత వి
భావరి యగుటయును నానృపాలసుతుండున్. 54

క. సంకలియతోడ బహుమక
రాంకితమగు జలధిఁ ద్రోయుఁ డని కోపముతోఁ
గింకరులఁ బనిచె వారును
శంకింపక తెచ్చి నన్ను జలనిధిలోనన్. 55

క. త్రోచినఁ గ్రుక్కుచుఁ దేలుచు
వీచిపరంపరలనడుమ వెగ డందఁగఁ బూ

ర్వాచరితపుణ్యఫలమై
నాచే నగపడియె శుష్కనగఖండ మొగిన్. 56

వ. దానిం బట్టుకొని తేలుచు నారాత్రి గడపి మఱునాఁడు. 57

క. కులిశహతిఁ బడని హారగిరి
పొలుపున నొకకలము చేరెఁ బుణ్యము పొడ వై
జలనిధి ననుఁ జేరుగతిం
జెలువగు ధవళంపుగాలిచీరలతోడన్. 58

ఉ. అందలిసెట్టులందఱు దయామతి నన్ *దిగిపించి యోడలో
నం దమయొద్దఁ బెట్టుకొని నాపదబంధము పుచ్చి పంచి రం
తం దముఁ దాఁకె నడ్డపడి దారుణశాత్రవయానపాత్రముల్
గ్రందుగ భీతిఁ దారు గలఁగంబడి రత్తఱి నేను గ్రక్కునన్. 60

వ. ధనుస్తూణీరంబులు గైకొని.

క. పలుకుల కెడ లే దీరిపు
బలముల నాశౌర్యశక్తిఁ బఱపెద మీఁరల్
గలఁగఁబడ నేల? యని దో
ర్బలముఁ జలము మెఱయఁ దాఁకి రౌద్రం బెసఁగన్. 61

వ. ఉద్దండకోదండనిర్ముక్తక్రూరనారాచంబులం బ్రతిబలంబుం
బరిమార్చితి నట్టియెడ నొక్కనావలోన వివర్ణవదనుం డై
యున్న భీమధన్వుం జూచి యచ్చెరువంది పట్టికొని యన్యా
యంబున బేహారుల ధనంబులు గొనవచ్చి నాచేతం జిక్కితె!
యనుచుం దెచ్చి పాపంబు చేసేతం గుడుపునట్లు నన్నుం
బెట్టిన సంకలియన వానిం బెట్టించి మదీయవిక్రమాటోపం
బునకు విస్మయచిత్తులగు సెట్లచేతం బసదనంబులు వడసి

* దిగి తెచ్చి.

వారికిం బరమమిత్త్రుండనై పోవనవసరంబున మహా
వాయువు వీవం దొడంగిన. 62

సీ. వెడిదంపుగాలిచే బెదరి యెత్తిన చాఁప
విడిచి గుండ్లును దిగవిడుచుటయును
గడల వే నొదికిలఁబడుచు భారంబునఁ
బలకలు నొగులుచుఁ బగులుచున్నఁ
గ్రమ్మఱ గుండులు కలముమీఁదన పెట్టి
యుత్తమ:స్తువు లోలిఁ గట్టి
ప్రభువు లందఱుఁ (ద)మపాదులకడ డాసి
*యిష్టదైవంబుల †నెఱఁగికొనుచు
తే. నుండి రంత హనూమంతుఁ డుదధిఁ జేరి
యుఱక నుంకించుపగిది నుఱ్ఱూఁత లూఁగి
(యోడ) లయమారుతంబు (పెన్నుద్ది) వోలెఁ
దీవ్రగతిఁ బాఱి యొకపాడు దీవిఁ జేరె. 63

వ. తత్సమయంబున. 64

క. ఆఁకలియు నీరుపట్టును
దాఁకినప్రజ కలము డిగి యథాయథలుగఁ బెఱ
మ్రాఁకులకుఁ జేరి యేఱుల
లోఁకలకుం జనిరి దీవిలోపలఁ గలయన్. 65

వ. ఏనును నోడ దిగిపోయి పండ్లు గోసి నమలుచున్న సమ
యంబున. 66

ఉ. పేరినకోఱవెండ్రుకలు బీఁటలువాఱిన దీర్ఘకాయముఁ
మీఱినకోఱదౌడలను మీసల నూనినరక్తపంకముల్

* వేయి. † వేఁడు.

వీటేఁడిచూపులం గుటుచవీ(పును) గల్గిన బ్రహ్మరాక్షసుం
డీరములోన నన్ను గని యిట్లని పల్కెఁ గఠోరవాక్యుఁడై.

తే. ఎద్ది క్రూరంబు? గృహపతి కెద్ది ప్రియము?
హితము నొనరించు నెయ్యది? యెద్ది కామ?
మెద్ది దుష్కరసాధన? మింతపట్టు
నెఱుఁగ మదిఁ గోరుచుండుదు నెల్లప్రొద్దు. 68

క. ఇత్తెఱఁగున నాప్రశ్నల
కుత్తర మి (మ్మాక యూర కుండుదువేనిన్)
వ్రత్తుం ద్రెవ్వులు సొదగు
నెత్తుటఁ జొత్తిల్ల దాఁచి నేఁడు రుచింతున్. 69

వ. అనిన నేఁడు వీఁడు శాపోపహతుండు గావలయు నని వితర్కించి యభిమతం బాచరింపం బూని యిట్లంటి. 70

క. క్రూరము నారీహృదయము
దారగుణము గృహికిఁ బ్రియహితము సంకల్పం
బారయఁ గామము దుష్కర
కారకసాధనము ప్రజ్ఞ గణుతింపంగన్. 71

క. అన నతఁ డెంతయు దయఁ గై
కొని యిట్లని పలికె నిది యగు నయిన నీచె
ప్పినయుత్తరములు దృష్టాం
తనిరూపణ మొప్పఁ జెప్పు తజ్జ్ఞఁడవేనిన్. 72

వ. అనిన నట్లు చేసెద నని యిట్లంటి. 73

తే. మును త్రిగర్తాఖ్యఁ బరఁగిన జనపదమున
ధనక ధాన్యక ధన్యకు లనఁగఁ బరఁగు

గృహపతులు సోదరులు మహామహిమతోడ
నెగడుచుండిరి విశ్వజనీను లగుచు. 74

క. వఱపున సస్యము లోదవమి
నఱిముఱి దైవంబుచెడ్డి నాఁటేఁడులు పెఱ
కఱవైన భూమిఁ గలప్రజ
పఱిపఱి యై *విడిచి పోయెఁ బరభూములకున్. 75

వ. తత్సమయంబున విరళంబగు జనసమూహంబు. 76

ఉ. మానిసిమాంసముఁ (బసులమాంసముఁ) గూడుగ నెత్తు
నీరుగాఁ, బూని దినంబులు న్నెలలుఁ బుచ్చఁగ దుస్తరవృత్తిఁ
గాలముం,దా నతిదీర్ఘ మైనయెడ ధాన్యకుఁడుఁ ధనకుండు
ధన్యకా, ఖ్యానుఁడు నంత వర్తకులు గావునఁ బోవక నిల్చి
రందులోన్. 77

వ. (అట్లు నిలిచి తా)వు విడువకపూర్వార్జితంబులైన ధనధాన్యం
బులు పొలియం గుడిచి కొన్ని దినంబులు నవసి నవయం
జాల కజాదిగోమహిషదాసదాసీవర్గంబుల నెల్లం గ్రమ
క్రమంబున నశనంబుగాఁ గొని భార్యామాత్రసహాయు
(లయి యున్నంత). 78

క. ఆముువ్వురు నిరుపురుసతు
లామిషముగ బ్రదికియుండ నవరజుఁ డుద్య
త్ప్రేమమున నాత్మభామిని
ధూమినిఁ బరదేశమునకుఁ దోకొని చనుచోన్. 79

వ. ఒకయెడ మధ్యందినసమయంబున. 80

---

* తిరిచి.

ఆ. అవనకాంక్షు నొకరుఁ(డట) పాదములవ్రేళ్లు
(కర్ణనాసికములు క)రతలంబు
మ్రోడుపడఁగ నవని మురముర ముల్గుచుఁ
బొరలుచున్నఁ జూచి కరుణతోడ. 81

క. తాను నిజమాంసలోహిత
దానంబుల సేదదేర్చి తత్సమయమునన్
వాఁ(ని నొకమూఁపు) పైఁ దన
మానిని నొకమూఁపుపై నమానుషవృత్తిన్. 82

క. మోచుకొనివచ్చి పూచిన
కాచిన తరువులను గలుగు కాంతారములోఁ
జూచె నొకజఠరకూపము
ప్రాచీనజనిక్రియావి(పాకముకలిమిన్). 83

వ. చూచి జలపానలాలసుం డయి యపూర్వపరిచితోపకరణపరి
ణతంబైన తత్ప్రదేశంబున. 84

క. తాళీదళపుటికాముఖ
కీలితలతికావితానకృతరజ్జుసమాం
దోళనవిరళీకృతమై
వాలంబగు జలము చేఁది వనితకుఁ (బోసెన్). 85

వ. తదనంతరంబ వానికిం బోసి తాను నుదకపానసేచనంబుల
వలన లబ్ధోత్సాహుం డై ఫలమూలంబులు దెచ్చి వాని
కిచ్చి శేషం బుపయోగించి యవ్విపినస్థలి యి మ్మగుటయు
నందు వసియించి. 86

క. ఇరువురకుం బ్రత్యహమును
నిర)వుగ సమకట్టి పెట్టి యిచ్చు చని మహ

త్తరయత్న నిహతబహుమృగ
సరసాహారములఁ దృప్తి సలుపుచు నుండెన్. 87

మత్తకోకిల. ఇవ్విధంబున ధన్యకాఖ్యుఁడనేకభంగులఁ బ్రోవఁగాఁ
గ్రొవ్వి ధూమిని మొండితోఁ(దనకోర్కి తెల్పుడు) సేయఁగా
నవ్వలించినఁ జూచి వాఁడును నంతరంగములోపలన్
నవ్వి లజ్జయుఁ గోపమున్ గగనంబు ముట్టఁగ నిట్లనున్.

ఉ. తల్లివి నీవు ధన్యకుఁడు తండ్రి యసంశయ మింతవట్టు నీ
యుల్లమునం దెఱింగియును నొప్పని పల్కులు పల్కెదింకనీ
తల్లితనంబు చాలు నుచితం బని పల్కిన నెట్లు తల్లియుం
గిల్లియు నెట్టి పాపమును గీపము నీపతి కేను జెప్పెదన్.

మ. అని పంగించిన వాని నప్పటికి నిష్టాలాపముల్ పల్కి నే
ర్పునఁ (గోపం)బ(డఁగించి జంతు)పిశితంబున్ నవ్యపుష్పంబు
లున్, దనప్రాణేశుఁడు దెచ్చి యిచ్చి యుదకోద్ధారం బొన
ర్పంగ గ్ర, క్కున నూతం బడఁద్రోచె *భామిని గడుం
గ్రూరాత్మ యై యాతనిన్. 90

వ. త్రోచి మగుడం జనుదెంచి వికలాంగుం డగుటం జేసి యగ
తికుండైన యతని యెత్తికొని యుజ్జయినీపురంబున కరిగి
నామగం డని పాతివ్రత్యపాటవంబున నవంతీశ్వరు మోస
పుచ్చి యానృపతిచేతం బూజిత యై గృహిణీధర్మభావం
బునం బ్రవర్తించి యేకాంతంబున నొక్కొక్కమాటు వాని
నొడంబడఁ బలుకుచున్నంత నక్కడ జలపానలాలసపథిక
జనోద్ధరితుం డయి ధన్యకుండు* దైవయోగంబున (నయ్యు

* ధూమిని.

జ్జయినీపురంబునకు వచ్చి యశనార్థి యై తిరుగుచున్నం గని
ధూమిని జనపతిపాలికిం జని యి ట్లనియె. 91

క. నావిభుని మొండివానిం
గావించినవాఁడు వచ్చి కపటాకృతితో
నీవీట నున్నవాఁడు మ
హీవల్లభ! వాని నేన యిప్పుడు గంటిన్. 92

చ. అనవుడు మేదినీశ్వరుఁడు నాయమపల్కులు నిక్కసంబు
గాఁ, దనమదిలోపలం దలఁచి ధన్యకునిం దలఁ గోసి వైవఁ బం
చిన నది చూచి నారెకులు చెచ్చెర నాతనిఁ బట్టి నిన్ను ని
మ్మనుజవిభుండు చంపు మని మమ్ము నియుక్తులఁ జేసె నా
వుడున్. 93

వ. వాఁడును మరణభయవిహ్వలితాంతఃకరణుం డయ్యును
ధీరుండు గావున సముచితంబుగా ని ట్లనియె. 94

క. చంపిన సరి లే దని చం
పింపం దగు నే? ధరిత్రిఁ జేద లనక తాఁ
జంపెడిచోట విచారము
పెంపేనియుఁ దలఁపవలదె? పృథివీపతికిన్. 95

క. అనవుడు వైపాటునకుఁ
మనమున శంకించి వానిమాట పతికి వా
రును జెప్పి కొలువులోనికిఁ
గొనిపోయిన నతఁడు ధన్యకున కి ట్లనియెన్. 96

క. తగు నే? నీవు పతివ్రత
మగని నకారణమ పాపమతి వై యమ్మైఁ

*(వెఁగఁబడి వికలాంగుని జే
యఁగ ఛీ నీచేతు లెట్లు లాడె దురాత్మా!. 97

చ. అనవుడు ధన్యకుం డనె ధరాధిప! దీనియథార్థ మెన్న కే
తునుమఁగఁ బంప నీతియె? యదోషుని, నైననతండు చెప్పినం)
దనుముట నీతిగాన దయతోడఁ బతివ్రతభర్తఁ బిల్వఁగాఁ
బనుపుము వాఁడు నావలనఁ బాపము పెట్టినదీనికోర్చెవన్. 98

క. అనినం బతి పనుపఁగఁ దో
కొని వచ్చిన నతఁడు ధన్యకుని గని ననుఁ బ్రో
చినయయ్య యనుచుఁ దత్పద
వనజంబుల కెరఁగె మనుజవల్లభు మ్రోలన్. 99

వ. ఇట్లు ప్రణమిల్లి మేదినీపతికిం దన తెఱంగు విన్నవించిన. 100

ఆ. ధరణినాథుఁ డపుడు ధన్యకు నిర్దోషుఁ
గా నెఱింగి వానిఁ గరుణ నేలి
దుశ్చరిత్ర యైన ధూమిని నవమాన
పఱచి యునిచెఁ గుక్కబానసమున. 101

వ. అది కారణంబుగా నారీచిత్తంబు క్రూరం బయ్యె నని
చెప్పి మఱియు నిట్లంటి. 102

సీ. అవనికిఁ దొడవైన ద్రవిళదేశములోని
కాంచీపురమునఁ బ్రకాశయశుఁడు
శక్తికుమారాఖ్య నడిసన్న కోమటి
వెరవు పెంపునఁ గల వెలఁది వెదకి
పరిణయంబుగఁ బూని పలుచోటులకు నేఁగి
యెఱుకల వెంట నిల్లిల్లు దూఱి

* ఈకుండలీకృతభాగము వ్రాఁతప్రతిలో లేనందునఁ బూరింపఁబడినది.

యెఱుకలు చెప్పుచో నెల్ల లక్షణములు
గడు నొప్పు నొకకన్యకాలలాము
తే. వొక్కముదుసలి తో డ్తెచ్చి యువిదభాగ్య
మెంత? మగఁ డెట్టిఁ? డాత్మజు లెంద? అనిన
నిప్పు డాఁకొంటి వడ్డింపుఁ డేను గుడిచి
యేకచిత్తానఁ జెప్పెద నెఱుక లెల్ల. 103

క. అనుచుం బైకొంగునఁ గ
ట్టినవడ్లం జేటఁ బోసి డించిన నదియుం
దనయం గనుఁగొని వంటక
మొనరింపుము వీరి కని నియోగించుటయున్. 104

సీ. ఒడికంబుగా వ్రేసి యొక్కింత నేలపై
నిరసవడ్లను బోసి యెండ నెఱపి
యొయ్య నొయ్యన క్రాసి యుముక నవ్వాలకించి
కొని నేర్పుమై గరకూర విలిచి
వంటక మొనరించి వరుసతో నిప్పులు
బొగ్గులుగా నార్చి ప్రోవు సేసి
క్రమ్మఱ నొరకొన్న *గ(వ్యము) కమ్మించి
సమ్మదంబునఁ జల్ల చమురు విలిచి
తే. వెరవు భక్తియుఁ బెరయంగ వేడ్కతోడఁ
గుడువఁ బెట్టిన నాతఁ డీకొమ్మకైన
మగఁడు జగముల భాగ్యసమగ్రుఁ డనుచు
నబలఁ బెండిలిగా నిశ్చయంబు సేసె. 105

వ. తదనంతరంబ 106

---

* గవ్వల.

క. కులమును బుట్టును జేరును
వెలయఁగఁ దద్బాంధవులకు వేడుక పుట్టం
దెలిపె జగ మెల్ల మెచ్చఁగఁ
బలువిధముల ధనము లిచ్చి పరిణయ మయ్యెన్. 107

క. గోమిని యనఁ బరఁగిన యా
భామిని నిల్లాలిఁ జేసి పై నొక యాలిం
గామించి వేఱు కొనియెఁ
గోమిని యనుసతిగుణంబుకొలఁది యెఱుంగన్. 108

వ. ఇట్లు పరిణయం బై యున్న నగ్గోమినియును. 109

చ. సవతికి భర్తకుం బ్రియము సల్పుచు వారికి నెయ్యులైన
బాంధవులకు భక్తి సేసె గృహధర్మము దప్పక నీచవృత్తు
లం,దవులక యీలుపుం బెనుపుఁ దాలిమియుఁ జను లెల్ల
నెల్లచో, వివిధవిధంబులం బొగడ విశ్రుతి కెక్క సతీ
చయంబులోన్. 110

ఉ. ఇమ్మెయి నేమిటం గొఱఁత యించుక లేక చరించు చున్కి
కిఁ, సమ్మద మంది నాదు గృహసంపద పొంపిరివోవనీక
ము, ఖ్యమ్ముగ నిర్వహింపు మని యైహికభూరిసుఖంబు
గొల్లలుం,గొమ్ములు వోవఁగాఁ బనిచెగోమిని శక్తికుమారుఁ
డర్థితోన్. 111

వ. అది కారణంబుగాఁ బురుషునకుఁ బ్రియంబును హితంబును
దారగుణంబునం బుట్టు నని మఱియు ని ట్లంటి. 112

క. వెలయఁగ సౌరాష్ట్రంబున
వలభీనగరంబునందు వైశ్యుఁడు గృహగు

క్తలలితనామముం డొక్కఁడు
కులతిలకం బనఁగఁ జాలు కూఁతుం గాంచెన్. 113

వ. కని రత్నావతి యను పేరుపెట్టి బలభద్రుం డనం బరఁగిన సెట్టి కిచ్చిన వాఁడును వేశ్యాసక్తుం డగుట దాని నుదాసీనంబు సేసిన నాబాలయు జననీగృహంబునకుం జని దుర్భాగ్యానుగుణంబుగా జనులవలన నింబవని యను నామంబు దాల్చి *పతిపాపచింతాక్రాంత యై యున్నం గొండొకకాలంబునకు. 114

క. ఒకప్రోడముండ తనపా
లికి నేకత మరుగుదెంచి లీలాశూన్యాం
కకముఖి యై యి ట్లునికికి
నకటా! కత మేమి? యనిన నది యి ట్లనియెన్. 115

ఉ. పేర్కొని తల్లి సంద్రులకుఁ బెంపుగఁ బుట్టితిఁ బుట్టి యెంతయుం, గర్కశుఁడైన కాంతునకుఁ గర్మవశంబున నాల నైతి నా, కోర్కుల మీఁదఁ దీర్తు నని ఘోరనికారము లోర్చుచున్నచో, మార్కొని మాలదైవము క్రమంబున నన్నెడ సేసె వానికిన్. 116

శా. తల్లీ! ప్రాణముతోడిచావు మగఁడుౝ దవ్వైన నిల్లాలికిం దల్లిం దండ్రిని జేరి యున్కి దలఁపౝ దైన్యంబు నాథ_ర్త నన్నొల్లం బొమ్మని ద్రోచెఁ బ్రాణవిరహోద్యోగకుమం బందె నా, యుల్లం †బింతలు పెద్దలే నరులు దైవోపేక్షఁ జింతిల్లరే!. 117

* పరివాద. † బింతులు వొందరే నరుల.

మ. వలచిన నొల్లకున్న గుణవంతుఁడ వైననుఁ గాక తక్కినం
గులసతి కాత్మవల్లభుఁడె కోరికవే ల్పని పెక్కుభంగులం
దెలియఁగ వింటిఁగావునఁ బతిం జదరొప్పఁగఁ బొంది కొల్వ
నేఁ, దలఁచెద నీవు తోడ్పడుము తల్లితనంబు ప్రసిద్ధిఁ
బొందఁగన్. 118

వ. అది యె ట్లంటేని మదీయభర్త గమనాగమనమార్గోపాం
తరగృహంబున మత్సమానవయోరూపంబులం దగినకనక
వతి యనం బరఁగిన చెలికత్తియ గలదు తద్భవనవలభియందు
వాతాయనంబుల చక్కటిఁ గందుకక్రీడావ్యాజంబున విహ
రించుచుం బ్రాణేశ్వరుఁ డరుగుదెంచు నవసరంబునం
బ్రమాదపతితంబువేర నతనిమ్రోలం గందుకంబు దిగ విడి
చెద నీవునుం దత్సమయంబున మత్సమీపంబున నిలిచి
వానిచిత్తంబునకు రాగంబు పుట్టని ట్లనుము. 129

చ. నిధిపతిదత్తుకూఁతు రిది నీసతికిం జెలికత్తె నిన్నుఁ బల్
విధముల నెగ్గులాడుచు వివేకవిహీనుఁడు నీరసాత్మకుం
డధముఁడు మే లెఱుంగఁ డని యాడిఁ బెట్టెదు దీనిమాట
లె, వ్విధమునన్నైన మాన్పఁగఁ బ్రవీణత లేదె? మనంబు
లోపలన్. 120

క. అను పల్కు పల్కుటయు నతఁ
డనురాగముఁ బొంది సముచితాలాపములం
బనుపడి నిజగృహమునకుం
జను నీవును నతినిపజ్జఁ జను మటమీఁదన్. 121

వ. చని కుసుమతాంబూలాద్యుపహారంబు లిచ్చి కూరిమి ప్రక
టించి యెడనెడం దమకంబు పుట్టించి కందువకుం దార్చి

పొందొనర్చు మతెండును జిరకాలదృష్టము నారూఢయౌ
వనయు నైన నన్నుం గనకవతియ కాఁ గొని నెఱపున కెల
యించు నటమీఁద భాగ్యంబున కనుగుణంబుగా బ్రదుక
నేర్తు ననిన సమ్మతించి యమ్ముదుసలియును నట్ల సేసినం
బతియభిమతసురతసుఖంబువలనం బరమానందంబునంబొంది
యనంతరంబ యమ్మగువ యి ట్లనియె. 122

సీ. దైవంబు మనకు నిద్దఱకుఁ బొం దొనరించె
నినుఁ బాసి పోఁజాల నీవు నన్ను
నిష్టదేశమునకు నిప్పుడ కొనిపొమ్ము
తడవు చేసినఁ బ్రమాదంబు పుట్టు
ననవుడు నతఁ డియ్యకొని పరభూమికి
నరుగువాఁడుగ నిశ్చయంబు చేసి
ధనము చాలెడునంత గొని కోమలియుఁ దాను
నప్పుడ పయన మై యరిగి యరిగి
తే. యొనరఁ బాథేయములు మోవ నోపునట్టి
వరవు నొకయూర *విలిచి ముప్పురును గూడి
పుష్పపురమున కరిగి యప్పురమునందు
వేడ్క పొంపిరివోవ జీవించుచుండి. 123

వ. ఇవ్విధంబున నొక్కనాఁడు. 124

క. పిలిచినఁ బలుకవు పనిచిన
గలగలఁ బని సేయ వేమికార్యం బైనన్

* ఁచిలిచి

వెలిపుత్తు వని కుపితుఁ డై
బలభద్రుఁడు వరవుఁ బెక్కుపాట్లం బఱచెన్. 125

చ. పఱచిన నాగ్రహించి మును పాయక నమ్మిక నున్న నాఁడు
తా, నెఱిఁగినమాట లన్నియును నెగ్గుగ నాత్మఁ దలంచి
దాసియుక్, *గోఱకోఱ వీట నెల్లెడల గోసన పుచ్చిన నర్థ
లుబ్ధుఁడై, యఱమర మానితద్విభుఁడు నాబలభద్రుని బట్టఁ
బంచినన్. 126

ఆ. అతనికాంత యైన యారత్నవతి పతి
కిట్టు లనియె వెఱవ నేల? మనకుఁ
దెఱుఁగు గలదు వసుమతీనాయకునితోడ
నిట్టు లనుము ధైర్య మెసక మెసఁగ. 127

క. వరవుల్లమాట †లోకక్రియఁ
బరికింపక నిజము సేయఁ బాడియె వలభీ
పురి గృహగుప్తుం డనియెడి
పరవైశ్యునిపుత్రి రత్నవతి యిది దీనిన్. 128

ఆ. తల్లిదండ్రు లొసఁగఁ దత్కరగ్రహణంబు
చేసినాఁడ నచటు వాసి యొక్క
కారణమున వచ్చి చేరితి మిప్పుర
మధిప! యప్పురమున కరయఁ బనుపు. 129

క. అను మని చెప్పిన విస్మయ
మనస్కుఁ డగు నతనితోడ మఱియును దెలియం
దనవృత్తాంతం బంతయుఁ
గనదంబుజనేత్ర చెప్పె గౌరవ మెసఁగన్. 130

* గోఱకున. † విని యొప్పరికింపక.

చ. విని ముదమంది వాఁడు పృథివీపతిపాలికిఁ బోయి యింతిచె
ప్పినక్రియఁ జెప్పి పూన్కి మెయిఁ బెంపరకుండఁగ నాలితో
డ ని, ల్చిన విభుపంపునం జనిన లేఖలవారలతోన మామ
యిం, పొనరఁగ వచ్చి తమ్ముఁ గొని యొప్పిద మొందఁగఁ
బోవునంతకున్. 131

వ. ఇవ్విధంబున బలభద్రుండు నిజస్థానంబునకు మగుడ భార్యా
సమేతుం డై చని యెనది కారణంబుగాఁ గామంబు సంకల్పిం
బంటి నని చెప్పి మఱియు ని ట్లంటి. 132

ఆ. శూరసేనదేశసుభగభూషణ మన
నొప్పు మధురలోన నొకగృహస్థు
నందనుండు మదనసుందరాకారుండు
గలఁడు పేరు కలహకంటకుండు. 133

క. మిండఁ డయి తిరుగు బాహా
దండబలోద్దాముఁ డగుట దర్పంబున నె
వ్వండుఁ దన కెదురు గాఁ డను
చుండుఁ గలహాలోలమైన యుల్లముతోడన్. 134

వ. వాఁ డొక్కనాఁడు వైదేశికుం డగు నొక్కరునిచేఁ జిత్ర
పటంబు గనుంగొని యందు సుందరిచిత్రం బుపలక్షించి
మదనమోహనమానసుం డై యతని కిట్లనియె. 135

క. ఎలనాఁగచంద మారయఁ
గులవధు వగు నిదియుఁ గాక కోర్కులు సఫలం
బులుగా బరిభోగంబులు
గలయదియును గాదు వృద్ధకామిని యగుటన్. 136

క. మగఁ డొల్లమియును విరహము
మగువ దెసం దోఁప నకట! మానము వినయం
బు గరువతనమును గలయది
యగుఁ *బౌఢత తోఁచెఁ జాడ్యయం దడఁకువతోన్.

ఉ. నీ వలవోక చూచి తరుణీతిలకంబు మనంబు రూపముల్
భావగతంబులైనఁ దగఁ బౌఢత చూపుట గోరియచ్చుపా
టై వఱలంగ నున్న తెఱఁగంతయు వ్రాసితిగాఁ దలంచెదన్
దేవసమాన!నా యెఱుక తెల్ల మొ బొంకొ నిజంబొ చెప్పుమా!.

ఉ. నా విని వాఁడు గారవమునం దనకౌఁగిట వానిఁ జేర్చి సం
భావన చేసి యి ట్లెటేఁగి పల్కుట యారయఁ గేవలంబె నీ
భావము సూక్ష్మభావరసభావననైపుణరూప మిట్టి నీ
కావనితాలలామ తెఱఁ గంతయుఁ జెప్పుదుఁగాక దాఁతునే?.

వ. అది యుజ్జయినీపురంబువాఁ డనంతకీర్తి నామధేయుండగు
సార్థవాహుభార్య నితంబవతి యనునది దాని తెఱం గెల్ల
నీచెప్పిన యట్టిద యనిన విని కలహకంటకుం డుత్కంఠా
వినోదచిత్తుం డై. 140

క. తత్పురికి నరిగి భిక్షా
తత్పరుఁడును బోలెఁ దిరిగి తగఁ జొచ్చిన నీ
లోత్పలలోచననిలయము
సత్పాత్రమ కాఁ దలంచి చయ్యన నదియున్. 141

ఉ. భిక్షము పుచ్చి భక్తిమెయిఁ బెట్టెడునప్పుడు చూచి యా
సరోజాక్షిమనోహరోజ్జ్వలశుభాకృతి చిత్తమునందు నాటి

* ప్రౌఢిమ.

వాఁ, డాక్షణమాత్రనొక్క తెఱఁగాత్మఁ దలంచి పరేతభూ
మిసం,రక్షణప్రవృత్తి పూనె నగరంబున భార్గవనామధేయుఁడై.

వ. ఇవ్విధంబునం జరియించుచు నొక్కజఱభితాపసిం బొందు
గని శవదాహసమయలబ్ధంబులైన నూతనాంబర హిరణ్యాశక
లాదు లొసంగి దానిం బ్రీతచిత్తం గావించి తనతలం పెఱిం
గించి పంచిన నదియునుం జని నితంబవతితో నిట్లనియె. 143

తే. యౌవనము భోగముల కెల్ల నాస్పదంబు
దీనితఱి రిత్తపుచ్చక తెఱవ! నీవు
నన్నుఁ జేకొని తగ నీమనంబుకోర్కి
తీర్పు మభిసారికావిధి నేర్పు మెఱసి. 144

క. అనిన విని యింతి కోపం
బునఁ గటకటఁబడి యదల్చి పోపో *నీ కి
ట్లనుచితము లాడఁ దగునే?
యనవుడుఁ బెడవీఁగి వచ్చె నత్తాపసియున్. 145

వ. వచ్చి యత్తెఱం గాతని కెఱింగించిన నట్లేని విను మని
యతం డయ్యవ్వ కి ట్లనియె నీ వెల్లి యక్కోమలికడకుం
జని యి ట్లనుము. 146

క. పావనచరిత్ర యగు ని
న్నావిధమున కియ్యకొలుప నని పల్కితి నే
నీవృత్తమునకు భయపడి
భావం బారయఁ దలంచి పల్కితిఁ దరుణీ! 147

తే. సారవర్జిత మగుట సంసార మెల్ల
విడిచి యిమ్మెయి భిక్షుకవృత్తి నుండి

---

* యకటా, య.

యిట్టిపనులకుఁ దొడరుట యేల? నాకు
నింత తెల్లంబు గాదె? నీ కిందువదన!. 148

చ. నడవడి పేర్మిఁ జింద దనమనంబున నిర్మలమైన సంతసం
బడరెడు నాకు నింక నొకఁ డారయ నీకుఁ గొఱంత పెంపు
గాఁ, గొడుకులఁ గానవయ్యె దనఘుండగు నీపతి ధాతు
హీనతం, బడియెడు దాని కే నొకటి పంచెదఁ జేయుము సిద్ధి
యయ్యెడున్. 149

వ. ఒక్క మాంత్రికుండు కొందఱికిఁ గృప సేసిన తెఱంగు గల
దే నతనికారుణ్యంబు వడసి తోడ్కొనివచ్చి మనమందిరా
రామంబులోనన మదేకసాక్షికంబుగాఁ దెరమాటున నున్న
యతనికిం ద్వదీయచరణంబు చూపి యమ్మహాత్ముచేత నభి
మంత్రితంబైన పాదమ్మునం బ్రణయకలహావ్యాజంబున
భవత్పతియురస్స్థలంబుఁ దాఁచిన నతండును ధాతుసమ
గ్రుండును బ్రజాసముత్పాదనసమర్థుండును నగు నవశ్యం
బును నవ్విధంబు కర్తవ్యం బని చెప్పి తదనుమతి వడసి న
న్నయ్యెడం జొనిపి నీతోడి సఖ్యంబు సఫలంబు సేయు మన
వుడు నట్లు చేయం బూని య త్తపస్వినియు. 150

ఆ. అతివకడకు నరిగి యవ్విధి కొడఁబడఁ
బలికి యేకతమున వలను మెఱసి
తోఁటలోని కల్లఁ దోకొని చనిన వాఁ
డొక్క తీవయింట నొదిగి యుండె. 151

క. వాని నటు లునిచి చని య
మ్మానినిఁ దెచ్చుటయు రత్నమండనసుభగం

బైన చరణంబు తెరవెలి
కై నిగిడించిన నతండు నతిరభసమునన్. 152

వ. అందియ పుచ్చుకొని (యొడియం) దిడి తొడ నిడుగంటిగాఁ
గంఠారంబున వాదరం గీచి సత్వరుఁ డై చనుటయు. 153

క. తెలుపయు విషాదమునఁ గడు
వెలఁ గందుచు నల్లఁ జొచ్చి విహారణసరసిం
గల చెడఁ బోటు గడిగికొని
పలివోయిన పెంపు దలఁచి భావం బడలన్. 154

వ. మందిరంబు సొచ్చి వ్రణంబునకుం బట్టికాబంధనం బొనర్చి
తక్కటియందియ పుచ్చి యామయవ్యాజంబున నాలుగేను
దినంబు లభ్యంతరశయ్య నుండె. 155

ఆ. కలహాకంటకుండు వెలకును దెచ్చిన
వాఁడ పోలె దాని వరునికడకు
నతివినీతవృత్తి నందియ గొనివచ్చె
నతఁడు చూచి విస్మయంబు నొందె. 156

చ. ఇది నిను నెట్లు చేరె? నిజ మెయ్యది? దానిన చెప్పు నాకుమ
త్సదతివిభూషణం బగు విశుద్ధుఁడ వీవును నిత్తెఱంగునా
హృదయము త్రిప్పకొల్పెనని యెన్ని విధంబులనొత్తియాడినన్
బెదరమితోడ నాతఁడు నభేద్యత నేమియుఁబల్కకుండినన్.

ఆ. *అవు డనంతకీర్తి †యంతగ నీతని
నలఁప నేల? యింట నరసి పిదపఁ
జూచికొంద మనుచు సుందరిపాలికి
నందియలకుఁ బుచ్చె నదియు బెదరి. 158

---

* ఒగి న.. † యూశక.

క. మనపెద్దతోఁటలోనికిఁ
జని యమ్మేడ మెలఁగఁ గీలు జరిగిన నచ్చో
టన పడియె నొక్కయందియ
దిన మెల్లను వెదకి కానఁ దెఱఁ గేదుటయున్. 159

వ. వగచుచున్నవార మని చెప్పి యొక్కయందియ పుత్తెంచిన ననంతకీర్తి కలహాకంటకుం బట్టుకొని రచ్చకుం దెచ్చి యచ్చోటి జనంబుల కెఱుంగఁ బుచ్చిన వార లడుగ నాధూర్తుం డి ట్లనియె 160

ఉత్సాహ. మీరు నిలుపఁ గాటి కాపు మేర పట్టి నిలిచి యి
య్యూర నున్నవారు కొంత యోపు లేక యగ్నిసం
స్కారవృత్తి రాత్రి చేసి చనుట వినుటఁ జేసి రే
లారయంగఁ బోదు మెన్న నచట నద్భుతంబుగాన్.

క. కాలియుఁ గాలని పీనుఁగు
నేలకు నొఱగంగఁ దిగిచి నెనడులు కముపం
గా లలన నొకతెఁ గని యది
చాలఁ దొడవు దొడిగి యున్న సాహసవృత్తిన్. 162

మ. ధనలోభంబున నీతి వోవిడిచి యుద్దాముండనై యాయుధం
బునఁ జంపం దలపోసి చేర నని పోఁబోఁ గాలు నాచేతఁ జి
క్కినఁ గత్తిం దొడ ప్రేసి నేఁ దిగిచినం గీల్దప్పి మత్పాణితో
డనయీయందియవచ్చె నవ్వనితఁ బట్టం జూడఁగాఁ బర్విడెన్.

క. ఇది దెఱఁగని చెప్పిన నా
సదస్యు లచ్చెరువుఁ బొంది సత్యమ కా నె
మ్మదిఁ దలఁచి పనిచి రాసతి
హృదయేశుని దానిచంద మెల్లను నరయన్. 164

వ. అతండును దనమందిరంబున కరిగి. 165

తే. అరసి తోడపోటు గనుఁగొని యధికభీతి
తోడ జనులకు నెఱిఁగించి తోయజాక్షి
డాకినీత్వంబు చాల దృఢంబు సేసి
మూఢుఁడై పోవ నడచిన ముద్దియయును. 166

క. దురపిల్లుచుఁ గన్నీళులు
దొరుఁగంగా వెడలి లజ్జతోడి యలమటఁ
బెరసినచిత్తం బెప్పుడు
మరణంబున నపశయంబు మాన్పుటకుఁ దగన్. 167

వ. అత్యంతవిరళగమనయై యరిగి. 168

క. నడురేయి పితృవనంబున
కడ వృక్షముశాఖఁ జుట్టి ఘనలత యురిగా
నిడి మెడ చొనుపం దలఁచిన
యెడ నంతకు మున్ను వచ్చి యెంతయుఁ బ్రీతిన్. 169

ఆ. వేగ మెయిది పోదివి వెలఁది నయ్యురికడఁ
బాయఁ బెట్టి చరణపంకజమ్ము
మోలఁ జక్క సాఁగి మ్రొక్కి మృదూక్తుల
గారవించి కలహాకంటకుండు 170

వ. నిజవంశంబును దనయున్నమధురాపురంబునం జిత్రపటంబు
వైదేశికునిచెంతం గనుటయు వానివలన దానియన్వయనామ
ధేయస్థానంబులు వినుటయుఁ దనమనంబునం దగులు మిగిలి
చనుదెంచి తాను జేసిన కపటోపాయంబులుం జెప్పి మఱి
యు ని ట్లనియె. 171

చ. మనసిజు నెత్తికో లెత్తఁగి మానిని! నీవెసఁ బ్రేముడించు
టీ,జననమునందుఁ బాయమి నిజం జగుటే మది నిశ్చయించి
యి,ట్లనుచితమైనఁ జేసి నిను నాలుగఁ గైకొనువాఁడ నైతి
నీ,వును నను నేలుకొమ్ము తగవుల్ గిగన్ను న్మన కింక నేటికిన్.

క. అని వెండియు బహువిధముల
ననునయములు పలుకఁ బలుక నగతిక యగుటన్
వనితయు నొడఁబడి చనియెను
మన మలరఁగ నతనితోడ మధురాపురికిన్. 173

వ. ఇవ్విధంబునం గలహకంటకుండు నితంబవతిపొందు వడయు
టంజేసి దుష్కరసాధనంబు ప్రజ్ఞ యని యట్లు చెప్పితి
ననిన. 174

క. అంతయు విని యారాక్షసుఁ
డెంతయు మోదంబు నొంది యెక్కుడ నగు శా
పాంతము నా విని మఱియును
శాంతాలాపముల నన్ను సంభావించెన్. 175

క. ఆయవసరమున నొకపా
పాయత్తుం డొకలతాంగి నాకసమున హా
హా! యని యఱవఁగ దే నో
హొహా! యనుచు నదల్చి యెగసి యుగ్రాకృతితోన్. 176

ఆ. బ్రహ్మరాక్షసుండు బలియుఁడై పోనీక
యడ్డపడియె నంత నతివఁ దలఁగ
విడిచెఁ దాని వాఁడు వీఁకతో నతఁడును
నతఁడు దాఁకి రాగ్రహంబు వెలయ. 177

వ. తదవసరంబున. 178

క. సురకరికరహతిఁ గల్పక
తరుమంజరి దూలిపడు విధంబునఁ బడఁగాఁ
దరుణీరత్నముఁ బట్టితి
ధరపైఁ బడకుండఁ బాణితలయుగళమునన్. 179

వ. ఇట్లు పట్టి చూచి కందుకావతి యగుడు నచ్చెరువంది దూ
రాపాతమూర్ఛితయైన యక్కన్నియ సేదదేర్చిన నదియు
ను న న్నెఱింగి యశ్రువ్యాకులితలోచన యై యున్న నెట్టకే
నియు నూరార్చి నీ వీరక్కసున కగపడ్డ తెఱం గెఱింగింపు
మనిన ని ట్లనియె. 180

ఆ. జేలు పెట్టి పట్టి భీమధన్వుఁడు నిన్ను
వనధిఁ ద్రోచె నన్నఁగ విని వియోగ
వహ్ని గాక శోకవహ్నియు నడరినఁ
జెలులఁ బాసి సౌధతలమునందు. 181

శా. ఏకాంతంబున నున్న నాకడకు బి ట్టేతెంచి కామాంధుఁ
డై, యాకాంక్షించినఁ జూచి యే నులికి యుద్యద్భీతిఁ గం
పింపఁగా, నాకాశంబును దిక్కులుం దనమయం బై నట్లుగాఁ
జేర్చి యు, గ్రాకారంబున నన్నుఁ దెచ్చె దనుజుం డంభోధ
మార్గంబునన్. 182

మ. అని శోకించిన నూఱడించి నిజవృత్తాంతంబు నాభీమధ
న్వునివృత్తంబును నేర్పడం దెలిపి యేనుం గాంతయుక్ రా
జనం,దనుఁ జేరం జని సాధువాక్యముల నత్యంతాప్తి భావిం
చి యా, తనికిన్ సెట్లకునుక్ వచోరచనసంధానంబు
గావించితిన్. 183

వ. ఇట్లు చుట్టతికంబు చేసిభీమధన్వు సంకలియవుచ్చి యందఱుం గలం బెక్కి యనుకూలమరుత్ప్రిసారంబున. 184

క. పారావారముతీరము
చేరిన తదనంతరంబ సెట్టులచేతం
గారవమునఁ బూజలు గొని
బోరన నాదామలిప్తపురవరమునకున్. 185

వ. భీమధన్వుం గందుకావతిం దోడ్కొని వచ్చి వచ్చి నడుమ.

మ. కొడుకుం గూఁతురుఁ బట్టువాసినఁ బరితుభ్యన్మనోవృత్తియై యడవిం గూడు దొరంగిచాఁదివిరి పౌరానీకముల్ బంధులుల్, గడు శోకింపఁగ నున్న వాఁడు పతి నిక్కం బంచుఁ బెక్కండ్రు రే, ర్పడఁ జెప్పంగ నెఱింగి కందువకుఁ జేరం బోయితిం బ్రీతితోన్. 187

వ. పోయి. 188

శా. చింతాభారపరీతచిత్తుఁ డగుచుల్ జీవన్మృతుం డై మహీకాంతుం డా పులుఁ దానున్న యెడఁ దత్కాంతారమధ్యంబునల్, గాంతారత్నము నక్కుమారుఁ గడువేడ్కం జూపి యొప్పించి వృత్తాంతం బంతయుఁ జెప్పితిల్ జనము లత్యాశ్చర్యముల్ బొందఁగన్. 189

చ. విని మనుజేశ్వరుండు గడు వేడుకతోఁ గొనియాడి నన్నుఁ దోకొని పురి కేఁగి యాత్మసుత గోరికకుం దగ నిచ్చి రాజ్యముం, జనవును నాఁడునాఁటికి నిజంబుగ నాపయిఁ బెట్టి రాజవ, ర్తనమహనీయుఁ జేసె నుచితజ్ఞతఁ బ్రాజ్ఞులు పిచ్చలింపఁగన్. 190

వ. ఇవ్విధంబున రాజ్యంబు వడసి దేవరం గొలువనియుఁ గొంత
గా నున్నంత సింహవర్మ పిలిచి పుత్తెంచినసహాయార్థం బరుగు
దెంచి దేవరచరణకమలంబులు గాంచి చరితార్థుండ నైతి
ననవుడుం బ్రియం బంది యతనియాపత్సహిష్ణుతయును
నాశ్చర్యకరమనోరథఫలాభంబును సంభావించి. 191

మ. కమలాకేలినివాస మన్వయనవాకల్పంబు విద్యానిధా
నము కారుణ్యసముద్భవస్థలము పుణ్యశ్లోకతాపాత్ర మా
గమగోష్ఠీఘటనప్రదేశము కథాకల్యత్వసంపత్తివి
శ్రమణస్థానము ధైర్యసీమ మనఘూరంభాత్మకం బిమ్మహిన్.

క. అతులమనస్కుం డుజ్జ్వల
వితతయశస్కుండు భవ్యవిధతేజస్కుం
డతులౌదార్యుఁడు సుజన
స్తుతగాంభీర్యుండు వినయధైర్యుం డెలమిన్. 193

మాలిని. అమితమతివిలాసుం డర్థిమిత్త్రుం డదోషుం
డమలచరితరూఢుం డప్రమేయుం డజేయుం
డమదవిక్రుతిగణ్యుం డద్భుతస్థైర్యధుర్యుం
డమరపతిసమానుం డన్వయోద్ధారుఁ డుర్విన్. 194

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలస దభినవదండి
నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార
చరిత్రం బను మహాకావ్యంబునందు దశమాశ్వాసము.

# ఏకాదశాశ్వాసము.

శ్రీరమణీరమణీయమ
హోరస్థ్సలవిజితకాంచనోర్వీధరవి
స్తారితబలుండు ధర్మవి
హారసముజ్జ్వలుఁడు తిక్కనామాత్యుఁ డొగిన్. 1

వ. రాజవాహనమహీవల్లభుండు మంత్రగుప్తు మొగంబు
చూచిన నతండు సగౌరవంబుగా నిట్లనియె. 2

ఉ. ఏను గళింగదేశమున కేఁగి కళింగపురంబుచేరవ
మానితబిల్వసాంద్రవిపినంబునఁ బ్రేతవనంబుపొంత ని
ద్రానిరతుండ నైనయెడ నచ్చట నొక్కరుఁ డొక్కకాంత
తో,నానడురేయి పల్కు పలుకల్లనయిట్లని సోఁకె వీనులన్.

ఆ. ప్రొద్దు వరుస మాలి సిద్ధులమందులు
చిచ్చులోన వైచి సిద్ధి వడయఁ
దొడరి యయ్యగారు కొసఁగులఁ బెట్టెడుఁ
బోవవలయు నాకు నీవు నిలువు. 4

వ. అనిన విని యే నుత్సుకుండ నై యాత్మగతంబున. 5

ఆ. వార లెవ్వ? రిపుడు గోరెడుసిద్ధి దా
నేమి? వేల్చుచుండ మిపుడు వీని
నేల పిలువఁ బంచె? నింతయు నెఱుఁగంగ
వలయు నని తలంచి వానిపిలుఁద. 6

ఉ. అల్లన పోయి సాంద్రవిపినాంతరచారుశుచిస్థలంబునం
దెల్లనివాలుగడ్డమును దీర్ఘజటాలియుఁ గ్రూరదృష్టులుం

బల్లశరీరముం భసితపాండులలాటముఁ గల్గు తాపసుం
డుల్లసితాగ్నికుండమున హోమము చేయఁగఁ బొంచి
చూచితిన్. 7

క. ఆతపసి కింకరుండు వి
నీతి మెయిన్ మ్రోల నిలిచి నిటలతటమునం
జేతు లిడి మ్రొక్కుటయు నవి
నీతుం డై యతఁడు పలికె నిష్ఠురవృత్తిన్. 8

ఆ. ఈకళింగనగర మేలెడు కర్దను
నంతిపురము చొచ్చి యతనితనయఁ
గనకరేఖఁ బట్టికొనిరమ్ము పొమ్మన్న
నరిగి కింకరుండు నాక్షణంబ. 9

శా. హాహాకారము లుద్భవిల్ల నొకకన్యారత్నముం దెచ్చె దు
ర్మోహాంధుం డయి క్రూరతాపసుఁడు సాముచ్యత్కృపాహీ
నుఁ డై, స్వాహాకారము పూర్వఁగాఁ దలఁచి యుత్సాహం
బొనర్పంగ నే, నా హోమాగ్నిశిఖాలి కాజటిలు నాహా
రంబు గావించితిన్. 10

ఉ. కింకరుఁ డంత నాకుఁ గడుఁ గీడ్పడి సిద్ధికిఁ గా నతండు ని
శ్శంకత నిజ్జగంబున నృశంసపటం బొగిఁ గట్టి దుష్క్రియా
లంకృతుఁ డై యనేకవిధులం దరుణీవధ సేయుఁ గాన నా
కింకను నేఁడు లోఁబడియెఁ గిల్బిషవంతున కింత పెద్దయే. 11

క. రేయుం బగలును నతనికిఁ
బాయక పనిచేసి యిడుమఁ బడి విసివినచో
నా యెద్ది కిష్టదైవము
డాయఁగ నినుఁ దెచ్చి సంకటముఁ బెడఁబాపెన్. 12

క. పనుపుము పనిచినపని గ్ర
క్కునఁ జేసెద ననిన నేను గోమలి మగుడం
గొనిచని యెప్పటిచోటన
యునుపుము నా కిదియ వేడ్కయుం గార్యంబున్. 13

చ. అనవుడు రాజపుత్రి గళితాశ్రుల వక్త్రము దోఁగ సంభ్రమం
బునఁ బ్రణమిల్లి యిట్లనియెఁ బొచ్చెము లేని దయా
గుణంబునన్, నను ననలంబులోనికిఁ జనం జొరకుండఁగఁ
గాచియిచ్చి తే, మని మదనానలంబునకు నాహుతి చేసెదు
జీవితేశ్వరా!. 14

ఆ. ఏడుగడయు నీవ యెచటికి నరిగిన
నీకు నేను దోడినీడఁ బోలి
తగిలి వచ్చుదాన దయతోడ నన్నుఁగొని
పొమ్ము పోకచూడఁ బోలదేని. 15

క. చెలులుం బరిచారికలుం
గలరు తలంపులకుఁ దగిన కార్యము లెల్లం
దలకొని చేయఁగ నీ వి
మ్ముల మద్గృహమునకు రమ్ము మోదం బెసఁగన్. 16

మ. అని నెయ్యం బొడఁగూడఁ బల్కుటయు రాగావేశ మేపార
న, వ్వనితారత్నము చూచుచున్నఁ గని భావజ్ఞాని యై కింక
రుం, డనుమానింపక రండు లెం డనుచు బాహాశక్తి శోభిల్లఁ
గా, వినువీథిం గొనిపోయె మమ్ము హృదయావిర్భూత
హర్షంబుతోన్. 17

క. ఆకింకరునకుఁ బూజ ల
నేకవిధంబుల నొనర్చి యామే లెంతే

నీకతమున మా కిప్పుడు
చేకుఱె నని గారవించి చిత్తం బలరన్. 18

వ. అతనిం బుచ్చి యనంతరంబ. 19

శా. ఆలీలావతి గ్రక్కునం జెలుల డాయం బోయి మేల్కొల్పి వం, దాలాపంబుల నంతయుం దెలిపి కన్యాగారగూఢస్థలిం
గేలీమజ్జనభోజనాదివిధు లక్లేశంబునం జెల్లిన
ట్లాలోకించి తగంగ నన్నుని చెని ట్లత్యంతమోహంబునన్.

వ. విచ్చలవిడి విహరించుచున్నం గొన్నిదినంబులకు వసంతా గమం బగుటయు వనక్రీడాలాలసుం డై కర్ణనుం డంతః పురకాంతాసమూహంబును దుహితయుం దత్సఖీజనంబులు వినోదసముచితపరివారంబును దానునుం బయోధివేలావన భూమికిం జని తత్ప్రదేశంబున బహుదివసంబులు కేలి సలుపుచున్న సమయంబున. 21

సీ. ఆంధ్రదేశాధీశుఁ డగు జయసింహుండు
ప్రతిభటుం డగుట రంధ్రంబు వేచి
బరిమితపరిచారపరిగతుఁ డని తన
వేగులు చెప్పిన వివిధయాన
పాత్రముల్ సమకట్టి బలములుఁ దానును
వారాశిలోఁ జొచ్చి తీరభూమి
డిగ్గి మోహరములు డిగ్గనఁ దీర్చి కం
పితమహీతలుఁ డయి బిట్టు మండి

తే. లీల నేమఱియున్న కళింగ విభునిఁ
గామినీజనసహితంబు గాఁగ *నడఁగఁ

* నడల.

బట్టి కలములలోపలఁ బెట్టికొని స
మగ్రమదగర్వ మొప్పంగ మగుడ నరిగె. 22

వ. ఇట్లు కర్దనుండు పగతున కగపడిన నరాజకం బయ్యును దదీయరాజ్యం బమాత్య మంత్రిభృత్యచాతుర్యంబులవలన (సురక్షితం బయ్యెఁ) జతురంగబలబాహుళ్యంబు నొందకయు నమాత్యుండు దానోపాయనంబుల నయ్యాపదకుం బ్రతివిధానం బాచరించుచుఁ గడప నట్టిసమయంబున. 23

ఆ. కనకరేఖఁ గేలి కనిచినయది యాది
గాఁగ నాకుఁ గన్యకాపురమున
నుండరామి వీట నొండువేషంబునఁ
దిరుగుచుండి యెల్లఁ దెలియ నెఱిఁగి. 24

వ. ప్రియావియోగసంతాపం బంతరంగంబునకు దుస్సహం బగుటయు. 25

ఉ. ఆజయసింహుపట్టణమునం దొకచందమునం జరించి యం
భోజదళాక్షి నెట్లయినఁ బొందుదుఁ బొమ్మని యుత్సహించి పోఁ,
గా జటిలుం డొకం డెదురుగాఁ జనుదెంచిన నేను మార్గథా,
శ్రీజమునీడ నాతని నతిప్రియభావనఁ బిల్చి నెమ్మితోన్. 26

వ. పథశ్రమాపనోదనార్థం బయ్యెడ నాసీనుండ నై యుండి తదాననం బాలోకించి. 27

క. దేశాంతరవర్తనముల
కౌశలములు *గలుగు లెక్క గలిగినయది; యే

* గనెడు.

దేశమువనుండి యిట యే
దేశమునకు నరిగె దీవు తెల్లము చెపుమా!. 28

వ. అనవుడు. 29

ఆ. ఆంధ్రదేశనృపతి యగు జయసింహుని
పురములోననుండి పోవుచున్న
వాఁడ గౌడభూమి వర్తించువేడుక
ననిన నిట్లు లంటి నతనితోడ. 30

క. ఆదేశంబున నెప్పుడు
వైదేశికపూజనములు వర్తిల్లునె? ధా
త్రీదేవుఁడు ధర్మిష్ఠుఁడె?
యాదేశము తెఱఁగు చెప్పు మంతయు నాకున్. 31

వ. అనిన విని యతం డిట్లనియె. 32

ఆ. భూమి లెస్స రాజు పూర్వులతోడిడ
మేలు వీటిలోన మెలఁగునప్పు
డేను శుద్ధి గాఁగ నెఱిఁగిన క్రొత్తయుఁ
గలదు ధరణినాథువలన నొకఁడు. 33

చ. అతఁడు కలంబు లెక్కి చని యక్కడ నేమఱియున్న వైరి
భూ, పతి కడు బిట్టు ముట్టికొని భామలతోడన పట్టి తెచ్చి త
త్సుతదెస సక్తుఁడై కవయఁ జూచిన రేఁగి తదీయగాత్రసం
శ్రితుఁ డగు బ్రహ్మరాక్షసుఁడు చేరఁగనీఁడు మహోగ్ర
చేష్టలన్. 34

ఉ. దాని నెఱింగి మంత్రములు తంత్రములున్ జపముల్ తపం
బులున్, దా నొనరింపఁబంచె వివిధక్రమశాంతికపూర్వ
కంబుగా, దానము లెల్లఁ జేసి విదితంబుగఁ గల్పము లెన్ని

యన్నియుం, దే నియమించి చూచుచుఁ దదీయవిధానము
లాచరించుచున్. 35

తే. బ్రహ్మరాక్షసుఁ డింతిపైఁ బాయకున్న
మంత్రవాదుల వెదకుచు మందు లెఱుఁగు
వారిఁ దడవుచుఁ గనుకలి వంతఁ జింత
నొంది యిడుమలు గుడుచుచు నున్నవాఁడు. 36

వ. అనిన విని యిది యంతయుఁ గనకరేఖకపటం*బుగా నెఱింగి
యాత్మగతంబున. 37

క. యువతీరత్నము చెలువునఁ
దవిలి వివేకంబుచొప్పు దప్పిన జయసిం
హవిభునిఁ గుటిలోపాయత
నవశ్యముం జెఱుతు నే ననాయాసమునన్. 38

వ. అని నిశ్చయించి సముచితసల్లాపంబుల వెండియుం గొండొక
సేపు గడపి యాజియ్యవీడ్కొని యరిగి యాకారంబు
వే ఱగునట్లుగా నైపుణ్యంబునం దాపసవేషంబు దాల్చి
కొందఱు శిష్యులం గూర్చుకొని యేనును వారునుం బర
మాస్తికజనమధ్యంబున సుఖుల మై నడచి యంధ్రనగరంబు
చేరువకరిగి తత్ప్రదేశంబున నొక్కకొలనికడం బర్ణశాలఁ
గావించుకొని యందు వసియించి. 39

క. నైష్ఠికభావన వివిధా
నుష్ఠానంబుల మహీజనులు మేడ్పడ ధ
ర్మిష్ఠాధిష్ఠుఁడ నగుచుఁ బ
టిష్ఠుఁడ నై సలిపితిం గడిఁది యగుభంగిన్. 40

---

* బని రా.

వ. అట్టియెడ మదీయశిష్యులు పురంబునం గలయ మెలంగి. 14

ఆ. ఇతఁడు పూర్వమునుల కేమిటఁ దక్కువ
యతులబోధమున మహానుభావుఁ
డద్భుతావహంబులైన శాపానుగ్ర
హంబు లరయ నితనియందుఁ గలవు. 42

క. పెక్కెడలఁ జూచితిమి మే
మక్కజముగ వీరిఁ గొలిచి యభిమతసిద్ధిం
గ్రక్కునఁ బడయుదు రీక్రియఁ
ద్రొక్కని ఘటియించె నీచదశ నొందంగన్. 43

వ. అనుచు మఱియు ననేకప్రకారంబుల నన్నుం బ్రశంసించుచు మత్పరత్వసకలజనసమానీతసమస్తనస్తువు లనుభవించుచు నేను సమలోష్టకాంచనత్వంబు భావించుకొని యున్నం గర్ణపరంపరాప్రాప్తంబైన యస్మదీయవిఖ్యాతివిశేషంబునకు జేలువడి భూపాలుండు నాకడకుం జనుదెంచి దండప్రణామంబు చేసి చేతులు మొగిచి నిలిచి. 44

క. మునినాథ! నీమహత్త్వము
విని యభిమతసిద్ధి వడయువేడుకతోడం
జనుదెంచితి ననుఁ గరుణం
గనుఁగొను మని వినయనమ్రగాత్రుం డయ్యెన్. 45

వ. ఏనును వానికొలంది యెఱింగి తద్గుణకథనంబు సేపంబుగా మదీయవర్తనంబందు గురుత్వబుద్ధి పుట్టింపందలంచి యిట్లంటి.

మ. బహుదేశంబులు *చొచ్చుచున్ బహుతపఃప్రౌఢిం బ్రతిష్ఠిం చుచున్, బహుతీర్థంబుల కేఁగుచున్ బహుగుణభ్రాజిష్ణులం

* చూచుచున్.

జూచుచుఁ, బహుసంవత్సరముల్ చరించితిమి భూపా
లాగ్రణీ! కాన మిమ్మహి నీయట్టినరేంద్రు ధర్మమహిమఁ
మానజ్ఞతం బ్రాజ్ఞతన్. 47

క. కావున నభిమత మెల్లను
గావింపఁగ నాకుఁ గౌతుకము పుట్టెడు నీ
భావగుణంబగు కోర్కి మ
హీవల్లభ! యెఱుఁగఁ జెప్పు మిప్పుడ తీర్తున్. 48

వ. అనిన నతండు కామాతురుం డగుటంజేసి లజ్జ యుజ్జగించి
యి ట్లనియె. 49

క. మునినాథ! వినుము నే నొక
వనితారత్నంబుఁ జూచి వలచితిఁ దనుఁ బ
ట్టిన బ్రహ్మరాక్షసునికత
మున మెయికొన దదియు సంగమున కెబ్బంగిన్. 50

ఉ. కావునఁ దత్సమాగమసుఖంబు మనంబునఁ గోరికోరియుఁ
భావజుబాణజాలముల పాల్పడి వెజ్జుల మంత్రవాదులం
వేపురఁ గూడఁ బెట్టియును వేల్పులఁ గొల్చియు బ్రహ్మ
రాక్షసుం, జోవఁగఁ జోప నేరక తపోధనవల్లభ! నిన్నుఁ
జేరితిన్. 51

క. అనవుడు ని ట్లని పలికితి
మనుజేశ్వర! మంత్రతంత్రమాహాత్మ్యమునం
దనుమధ్యకు నీకును బొం
దొనరించెద బావభవున కోడకు మింకన్. 52

వ. అది యెట్లంటేని రూపసిద్ధి యను నొక్కమంత్రంబు బ్రహ్మ రాక్షసభయంకరం బగు రక్షామణియు నీ కిచ్చెదం దన్మం త్రాభిమంత్రితంబైన యిక్కొలనిజలంబు నిష్కంటకంబుగా దర్వీకరమకరగ్రాహాదిదుష్టసత్వసముద్ధరణంబు సేయించి యాగామిశుక్లపక్షద్వితీయదినంబు నుపవసించి రక్షామణి లాంఛితశిరస్కుండ వై శశికళాసందర్శనంబు చేసి సప్త ఘటికానంతరంబ యష్టోత్తరసహస్రకరదీపికాపరివృతుండ వై యిన్యేడకుం జనుదెంచి పదశతత్రయమాత్రస్థాపితపరి వారుండ వై విలాసాలోకనంబును నపనయించి మంత్రపుర స్సరంబుగా సరోవరంబు చొచ్చి మునింగి యున్నభంగిన యూర్పు నిలుప నయ్యేడునంతసేపుం జపియించి పరిభూత మన్మథాటోపంబగు రూపంబు దాల్చి తదనంతరంబ నిజ గృహంబునకుం జని. 53

క. ఇతరులతోఁ బలుకక య
య్యతివకుఁ బొడచూపి పలుకు మంతటఁగోలెం
బ్రతిదివసము రతిపతికిని
రతిక్రియ నమ్మగువ నీకు రాగ మెనర్చున్. 54

మ. ఇది నీకుం బ్రియమేని ప్రెగ్గడలతో నేకాంత మూహించి
యెుప్పిద మై యుండఁగ నాచరింపు మనుడుఁ బేల్పాటు
చిత్తంబునం, దొదవఁ సమ్మద మొంది యియ్యకొని మా
యోపాయజాలంబులం, బొదువం బడ్డ నెఱింగి యాత్మ
ముద ముప్పొంగంగ నే వానితోన్. 55

వ. మఱియు నిట్లంటి. 56

ఉ. నీవు సధర్మవర్తి వని నీ కొక మే లొనరింపఁ గోరి యే
పోవన కాని యిప్డు పరభూములఁ గ్రుమ్మరుచున్న యట్టి
నా, పోవుట నిల్చు నిట్టి దొకపాం దని లే దది యట్ల
యుండె స, ద్భావముతోడ నొక్కమరి భక్తిఁ దలంపుము
మమ్ము నిచ్చలున్. 57

వ. అని పరిజనుల నవలం బొమ్మని యతని డాయం బిలిచి
మంత్రాకారంబులుగాఁ గొన్ని కపటాక్షరంబు లుపదేశించి
యంతకుమున్న ఘటించియున్న యొక్కజిలిబిలిరక్షపూసయు
నిచ్చినం గృతార్థీభూతమనస్కుం డై నమస్కరించి మునీం
ద్రా! నన్నుం గొలువుగొని మీ రిందు నిలుచుట మా
కెల్లపురుషార్థంబులు నని ప్రార్థించిన మా కంతవట్టునకు
భాగ్యంబు గలిగి యిట్లయ్యెం గాని మానవర్తనంబు గ్రామైక
రాత్రం బై యుండు ననిన నట్లన యగు నని మగుడం బలికి
వీడ్కొలిపినం జనియెఁ బదంపడి గతాగతజనంబులవలన
నతండుమంత్రిపురోహితసహితంబుగా నిక్కార్యంబు సేయ
నిశ్చయించు టెఱింగి నాచెప్పిన దినంబునకు ముందటినాఁటి
నిశాసమయంబున. 58

క. ఏనును మదీయశిష్యుల
లోనుగ వంచించి కొలనిలోపల నుండన్
మానిసి కుండఁగ నయ్యెడు
మానముగాఁ దటమునం దమర్చి తగంగన్. 59

వ. ఉపద్వారంబు సూక్ష్మంబుగాఁ గల్పించి యవ్వేకువన నతి
దూరంబగు నొక్కతీర్థంబునకుం బోవు నెపంబున శిష్యుం
గొనిపోయి గవ్యూతిమాత్రంబునం గాననంబులోనం గాడు

పఱచి తొలంగి యొండుజాడ మరలివచ్చి కొలను సొచ్చి
వేషోపకరణంబు లడంచి యాయితం బై యుండి. 60

మ. సమయం బైన నృపాలుఁ డస్మదుపదేశప్రక్రియం బద్మషం
డమునం గ్రుంకుట చూచి బిట్టడరి యంటం బట్టి కంఠంబు
పా, దమునం జిక్కఁగ నూఁది *యంతఁ దనువుల్ ద్వంద్వం
బుగాఁ జేసిప్రా, ణములం బాసిన మేను బొక్క నిడి యా
నందంబునం గప్పితిన్. 61

వ. ఇట్లు జయసింహుని సమయించి కొలను వెలువడి తదీయాం
బరభూషణాదులు ధరియించి యల్లన పరిజనంబు లున్నపరి
సరంబున కరిగి నివ్వటిల్లు దివియలు వెలయించిన. 62

ఉ. అచ్చెరుపాటు నొందు హృదయంబులతోఁ బరివార మం
తయుఁ, వచ్చి కనుంగవల్ విరియ నాకు మహీస్థలిఁ జాఁగి
మ్రొక్క నే, నచ్చట సస్మితాననమునాకృతి వారల నాద
రించి వా, క్రుచ్చి యొకండుఁ బల్కక నిరూఢమహానియ
ముండ పోలె నై. 63

చ. నగరికి నేఁగి వాఁడినయనంబుల నందఱు వీడుకొల్పి వా
సగృహముచొచ్చి యంతిపురిభామలువిస్మితలోచనప్రభల్
మిగులఁగఁ జూచుచోఁ గనకరేఖఁ గనుంగొని దానితోడఁ ద
న్నగనొకపల్లు పల్లి మునుపొల్తులకుంబుయిలోటపాయఁగన్.

వ. మనోహరాకారలాభకారణంబునకుం దగినయాలాపంబులం
గలపికొని కొంతసేపు వారలనడుమ నిలిచితి నట్టియెడం
గర్దనందన సందేహాందోళితం బైన డెందంబుతోడ నన్ను
నిరూపించుచుండె నేనును సాభిప్రాయంబులు సవిస్మితం

* తొలిక్క నృపు పీతప్రాణుఁ గా.

బులు సప్రత్యభిజ్ఞానంబులు నగు నవలోకనంబుల నయ్యంబు
జానన యనుమానంబువాపినం గొండొక యలరుచుండియు
వితర్కంబుతోడి యచ్చెరుపాటునం బొరయుచుండం
గరకిసలయంబు సరసంబుగాఁ బట్టికొని యేకాంతగృహంబు
నకుం దోడ్కొనిపోయి. 65

క. అల్లనిమాటల నంతయుఁ
దెల్లంబుగఁ జెప్పి కలపు దెలిపి మనములన్
వల్లగఁ గనుకలి గలసి స
ముల్లాసము నొంది యచట నువిదయు నేనున్. 66

ఆ. నగరివర్తనంబునకు నంతిపురముసుం
దరుల తెఱఁగునకును బరిజనముల
నడపుటకును నాదునడవడి యిట్లని
నిశ్చయించి నెమ్మి నిద్రచేసి. 67

క. మేలుకని ప్రాద్దుపొడుపునఁ
గాలోచితవిధులు సలిపి కాంతాకల్ప
శ్రీలసితుఁడ నై సమ్మద
లీలం గరి నెక్కి వైహాళికిఁ జని యచటన్. 68

ఆ. ఉచితవర్తనముల నొక్కింతవడి నిల్పి
మరలివచ్చి సకలపరిజనములు
బలసి కొలువఁ బెద్దకొలువున నుండి మం
త్రులకు నిట్టు లంటి నెలమితోడ. 69

ఉ. కోరిక నిట్లు కర్దనునికూఁతుఁ బ్రియాంగనఁ గా నొనర్చితిం
గారణబాంధవం బలర గ్రక్కున నానృపు నాత్మరాజ్యవి

స్త్రారకు (గా నొనర్చి నిజధాత్రిక్కిఁ బంచుట నీతి గాన మీ
కోరికపద్ధతిం దెలియఁ గోరితి నావుడు వార లీకొనన్. 70

క. ఘనమతితో నప్పుడు క
ర్దనునిఁ రావించి నీదు రాజ్యమునకుఁ) బో
మ్మనుమాట ప్రియ మొనర్చితి
వినుతాంబరభూషణాదివితరణములతోన్. 71

వ. పదంపడి కనకరేఖచేత నతనికి నాక్రమంబును సాధకకూ్రిర
కర్మకౌశలంబును ముదితగాంధర్వపరిణయప్రకారంబును
జయసింహునెడం జేసిన వైచిత్రియుం జెప్పి పుచ్చి కలపి
కొని యతనిం గళింగనగరంబున కనిచి రెండురాజ్యంబులు
నొక్కటిగాఁ బాలించి భవత్పాదోపకంఠసంవాససౌఖ్యంబు
దొఱకొనుతెఱంగు చింతించుచున్నంత సింహవర్మ సహా
యంబు గోరి పుత్తెంచినం జనుదెంచి మనోరథసిద్ధిం బొందితి
ననిన విని రాజహంసనందనుం డభినందించి. 72

తే. మంత్రగుప్తు పరాక్రమమహిమ గుప్త
మయ్యు నియ్యెడఁ బ్రఖ్యాత మయ్యె ననుచు
విశ్రుతుని మోము చూచి నీవిధము చెప్పు
మనుడు నాతండు భక్తి ని ట్లనిమెఁ బలికి. 73

ఉ. ఏనును వింధ్యకాననమహిం గలయ న్నిను రోసి క్రమ్మఱం
గా నొకచోట నూతిదరిఁ గన్నులనీళుల మోముఁ గప్పు
చుఁ,హీనదశార్తుఁ డేఁడెనిమిదేఁడుల ప్రాయమువాఁడు పెద్ద
యుం, దీనత నొంది నఁ గని యధీరత నిట్లని పల్కు
వెక్కుచున్. 74

ఉ. తానును నేను నిట్ట్యేఁడ బథశ్రమఖేదముఁ బొందినీరవ
ట్టూనిన నిల్చి చేద గొని యొయ్యన నీటికిఁ జేరి దానితో
నానతుఁ డై పదద్విత యమల్లల నాడ వడంకి వార్ధకా
ధీనశరీరతం దెమలి త్రెళ్లె నొకం డిదె నూతిలోపలన్. 75

ఆ. ఇతనిఁ దిగువ లావు నేర్తైఱ లేకున్న
దిక్కుమాలి యిచటఁ జిక్కియున్న
వాఁడ నిన్నుఁ గనిన వచ్చెఁ బ్రాణంబు శీ
ఘ్రమున వెడలఁ దిగిచి కావవయ్య!. 76

క. అని కరుణ పుట్ట వేఁడిన
విని యొకబలు దీవఁ డిగ్గ విడిచిన నావృ
ద్ధును నద్దెస మొలనిరియిం
చిన వెరవును లావు మెఱయఁ జేఁదితి వెడలన్. 77

వ. ఇవ్విధంబున వెడలం దిగిచి బ్రదికించి కొంకిగల నిడుపు వెదురునం జేఁద *వుచ్చి నీరు దిగిచి యబ్బాలుని దప్పి దీర్చి సాంద్రతరుచ్ఛాయాశీతలసికతాతలంబున నయ్యిరువుర నునిచి పాషాణనిపుణపతితంబులైన వన్యఫలంబుల వారియాఁకలి దీర్చి యేనును జలపానఫలఖాదనంబునం బథశ్రమం బపనయించి వారలచేరువ సుఖాసీనుండ నై తదీయ యోగక్షేమం బావృద్ధు నడిగిన నతండు సవిస్తరంబుగాఁ జెప్పెద విను మని యి ట్లనియె. 78

ఉ. నీతివిదుండు వైరిధరణీవరభీకరశౌర్యుఁ డార్యసం
ప్రీతి(వి)ధాశరీరుఁ డధరీకృతకల్పతరుండు రాపవి

* వుచ్చుక.

ఖ్యాతుఁడు ధర్మవర్మ యనఁగా నొకరాజు వివర్ధరాజ్యసం
స్ఫీతవిభూతిమైఁ గరము పెంపు వహించె నృపాల*కోటిలోన్.

తే. జనుల భాగ్యదినంబులు చనినయట్ల
యతనిదినములు చనుటయు నమరపురికి
నరిగెఁ దత్సూనుఁడైన యనంతవర్మ
రమణఁ బట్టంబుఁ గట్టె సామ్రాజ్యమునకు. 80

క. అసమానబుద్ధివైభవ
లసితుఁడు నృపనయవిచారలంపటుఁడు జన
వ్యసనహరుఁడు గలఁ డొక్కఁడు
వసురక్షితుఁ డనఁగ మంత్రివర్యుఁ డతనికిన్. 81

వ. అయ్యమాత్యుండు తజ్జన్మసంభావితుండు గావున శిశువు నొడయం డగుటంజేసి యొక్కనాఁడు సముచితసమయం బున నమ్మహీవల్లభున కి ట్లనియె. 82

చ. కులమును బెంపుఁ దేజము నకుంఠితబుద్ధియుఁ జారుమూ ర్తియుం, గలిగి రసోజ్జ్వలంబులగు కార్యములం గొనియాడ నేర్చి శ, త్రులకు భయంకరం బయిన దోర్బలసంపద నుల్ల సిల్లి న, త్కళలఁ బ్రసిద్ధిఁ బొంది నుతి గాంచితి వీవు మహీ తలంబునన్. 83

ఆ. వినుము రాజనీతివిద్యతాత్పర్యంబు
చాల కునికి పూర్ణచంద్రులోనఁ
గానవచ్చుచున్న కందున ట్లున్నది
నీకు నిదియ కొఱఁత నృపకుమార!. 84

* కోటికిఁ.

చ. నృపనయహీనుఁ డైన ధరణీపతి రాజ్యవిభూతిచూడఁగా
నపగతవాతవారణక మైనయెడ న్వెలుఁగొందు దీపరే
ఖపగిది నిప్పు డప్పు డనఁగాఁ జలితస్థితి నుండు నీతిసా
రపరమనస్కుఁ డైనన్నృపురాజ్యముసుస్థితిఁ బొందునారయన్.

వ. కావున. 86

తరువోజ. ఖ్యాతవిద్వజ్జనగ్రాహ్యంబులైన కామందకము లోను
గాఁ గలయట్టి, నీతులు విని తజ్జ్ఞనికరంబుతోడ నిష్ఠమై
సద్గోష్ఠి నిచ్చలుఁ జేసి, యాతదర్థం బెల్ల నభ్యాసవృత్తి
నంతరంగంబున నలవడ నిలిపి, యాతెరు వొంది కార్యా
కార్యవేది వై మేదినీచక్ర మంతయు నేలు. 87

వ. అనిన విని యవనీశ్వరుం డప్పలుకు లభినందించినవాఁ డై
సముచితసంభాషణంబుల సంభావించి పుచ్చి తనకు బాల
సేవకుండునుం బరిచయవిస్రంభస్థైర్యవచనుండును సంగీత
విదుండును నంగనాకార్యనిర్వహణనిపుణుండునుం జిత్తాను
వర్తనకుశలుండును సవినయోపాధ్యాయుండును నైన
విహారభద్రుండను నర్మసచివుండు తోడనె చనుదేర నంతః
పురంబునకరిగి తరుణీజనంబులు గొలువ నున్నయెడ వాఁడు
కొండొక నగుచు నమ్మంత్రిమాటలు కొంతగాఁ బ్రసంగించి
యి ట్లనియె. 88

క. ఎలమిగల లక్ష్మి యొకనికిఁ
గలిగిన నది పంచి కుడువఁగాఁ గూడి యనే
కులు పెక్కుభంగులం గలి
బిలిసేయుదు రతనిమనసు భేదించి తగన్. 89

వ. అది యెట్లం టేని కొందఱు శ్రోత్రస్మార్తవిదు లనం బరఁగిన
డాంబికులు. 90

చ. అలఘుమహేంద్రలోకసుఖ మందఁగ సాధన మంచు గ్ర
క్కున నం, దల గొఱిగించి తో లొకటి దాల్పఁగ వెన్న య
లంది యన్నముక్, జలము దొరంగఁగా ధరణిశయ్యను నిద్ర
యొనర్పఁ బంచి యా, కులపడఁ జేసి యర్థములు గొండ్రు
మనంబులలోన నవ్వుచున్. 91

క. జర పొందిన దొరకొన దని
వెరవు కలిగి విషయసుఖము వెదకెడువానిం
గరము విదగ్ధత నెడ కొని
మరులు గొలిపి చొచ్చి కొలిచి మంత్రుల మనుచున్. 92

తే. అర్థములు పూర్ణములు గా నుపార్జనంబు
చేయు విధమును బరుల నిర్జించు తెఱఁగుఁ
దెలియఁ జెప్పెద మది శాస్త్రదృష్టిఁ గాని
యెల్ల నెఱుఁగంగరా దని యియ్యకొలిపి. 93

క. ఒకపాత్రము మెడఁ దగిలిచి
సెక లాయువునంద పోవ జీవింతురు వా
ర్ధక మగునంతకుఁ జదివినఁ
జకితత్వముఁ గుటిలతయు నిజంబుగఁ బొందున్. 94

ఆ. ఆర్జవంబు విడిచి యాలిని బిడ్డను
నైన విశ్వసించు టాత్మ నుడిగి
సుఖము లెల్లఁ దొఱఁగి సొలవక కృపణుఁ డై
యునికి నేర్పు గాఁగఁ గొను నతండు. 95

వ. ఇట్టివి శాస్త్రాభ్యాసంబునకు ఫలం బని చెప్పి వెండియు
ని ట్లనియె. 96

క. పోకలఁ బోయిన నృపతి య
నేకము లోసఁగంగ మాట లింపుగ నాడన్
లోకము మన్నింపంగాఁ
జేకొన రది కృత్రిమంబ చేయుదురు జనుల్. 97

క. తనయెడ విశ్వాసము భూ
జనులకు లేకుండెనేని జగతీశుఁడు పె
ట్టినబిరుదున కనుమతి గలి
గినఁ జిరకాలంబుమనికికిం గీడొందున్. 98

ఉ. ఎంతటఁ జేసి వర్తనము జెల్లను జెల్లుఁ గొఱంత లేక తా
నంతటినీతి లోకమునయందు కడుం దెలియంగవచ్చు న
త్యంతమనోవ్యథావహము లై చను శాస్త్రము లభ్యసించి
యశ్రాంతముఁ ద్రుళ్లిపడ్డనవిచారముగల్గినయట్టివాఁ డగున్.

క. తనబుద్ధిఁ గాదె? బాలుఁడు
జననిఁ బ్రసన్నాత్మఁ జేసి చన్నిచ్చువిధం
బునకుం జేర్చుం దగ నె
వ్వనితో నేచదువు చదివె వాఁడుం దెంపన్. 100

క. సిరి గలయప్పుడె దుఃఖముఁ
బొరయక సంతతసుఖంబుఁ బొందు విమూఢే
తరుఁ డటు చేయక జేలకు
పురుషుం డాదినము లవధిఁ బుచ్చుచు నుండున్. 101

క. కావున వలవని యంత్రణ
లేవియుఁ జొరనీక మనము నెంతయు సుఖినిం

గావించుకొని యనూనము
దావహభోగములు సలుపు మవనీనాథా!. 102

వ. అనిన విని వనితాజనంబు లెల్ల నివి యిట్టివియ యని మోదం
బుచేసి వసంతవర్మయు నలరిన మొగంబుతోడ సద్గురాలా
పంబులు పరమహితంబులుగాఁ గైకొని రాజనీతిశాస్త్ర
భ్యాసంబులకుం దదనుచారనియతాచారంబులకును విము
ఖుం డై యాధూర్తునిమ(ది ననుసరించి) వర్తిల్లుచుండు. 103

చ. అనయముఁగ రాజ్యవర్తన మహార్ణిశముఖ విషయోపభోగత
త్పరమతి యై వినీతిఁ బరిపాలన సేయఁడు మంత్రి దీనికిం
బురపురఁ బొక్కి చెప్ప తగుబుద్ధులఁ బిమ్మట గేలి సేసి యా
వెరవిఁడి మన్మనోగతికి వీఁడు వినం డని *యాడు నేర్పునన్.

ఆ. అతఁడు నతనియింగితాకారచేష్టల
నతివిరక్తుఁ డగుట యాత్మ నెఱిఁగి
మాటఁ బడఁగవలదు మౌనవ్రతంబున
నునికిదక్క నీతి యొండు లేదు 105

క. దీన నొకకీడు దోఁచిన
నైనను మన ముడిగి మన్మతానుసరణముఁ
బూనెడునంతకుఁ జెప్పఁగ
నే నోపం దొలఁగవలయు నెల్లవిధములన్. 106

వ. అట్లుగాక స్నేహపారవశ్యంబున నతనికి మాఱుపలుకు
చుండితినేని భంగంబు వచ్చు నితండును సన్మార్గంబున నడ
చినవాఁడునుం గాఁ డని చేయునది లేక యూరకుండె నన్నృ
పతియును స్వైరవిహారనిరతుం డై నట్టి సమయంబున సమీ

* యుండు.

ప్రదేశాధీశుండును బహువిధోపాయపారీణుండును నగు
వసంతభానుం డను రాజునమాత్యుం డింద్రపాలితుండనువాని
తనయుండు గూఢకృత్యపాటవపారీణుండు చంద్రపాలితుం
డనువాఁడు పతియనుమతంబునం దనకపటనీతిప్రయోగం
బునకు నలయుపరివారంబును దానునుం దండ్రి వెడల
నడిచిన వచ్చినవాఁడై విదర్భనగరంబున కరుగుదెంచి విహార
భద్రుం గని యతండుం గార్యసహాయుండు గా ననంత
వర్మం గొలిచి. 107

క. నూతనకేలివిరచన
చాతుర్యంబున మనఃప్రచారానుగతిం
బ్రీతికరుం డై యాదు
ర్జాతుం డవనీశుఁ దనవశంబుగఁ జేసెన్. 108

వ. ఇట్లు పరమాప్తుం డై యాయాసచ్ఛేదనస్నేహత్వంబును మేదోహీనతయును *నుత్ఖాతనపరత్వదేహంబును నాదిగాఁ గలకొన్ని గుణంబు లగుట చూపి మృగయావ్యాపారంబుల యందును నిపుణతాప్రకటంబునుం జతురకాలయాపనంబును ధనాగమంబును నాదిగాఁ గల కొన్ని గుణంబు లగుట చూపి దురోదరక్రీడలయందును నారోగ్యంబును వీరరససంధుక్షణంబును సౌమనస్యంబును ధాతువృద్ధియు నాఁ దగు కొన్ని గుణంబు లగుట చూపి మద్యప్రకారంబులయందును నంగరాగమాల్యాభరణమాంగల్యంబును ననితరసులభానందంబు నాదిగాఁ గొన్ని గుణంబు లగుట చూపి యంగనాసంగమవిహారంబులయందునుం †గుతూహలంబుఁగాఁ జేయుచు

* నుద్ధావన. † గుతూహలింగాఁ.

జనంబులు జడుం డవహితుం డకృపణుం డనకుండవలయునట్టి వాక్పారుష్యదండార్థదూషణంబులవలనం బ్రవీణుం డగు నట్లునుం గావించె. 109

క. వ్యసనపరుం డై భూపా
లసుతుం*డు సంతతము నధికలౌల్యంబున వే
డ్క సలుపఁ గోడఁగెఁ బ్రజయుం ద
ద్రసానుభవకౌతుకమున రాజుం బోలెన్. 110

క. నరు లెల్ల దుర్నయంబునఁ
దిరుగుట నొండొరులకీడు దెలుపంగా నె
వ్వరు లేమి భూమిలో వెలి
విరిసె నధర్మంబు యోగవిధ్వంసక మై. 111

ఆ. బలియుఁ డన వ నడఁచు వలచినయవి యెల్లఁ
బాడి లేక చేయుఁ బ్రభుజనంబు
వేళ వేచి యొరుని యాలి నర్థంబును
నపహరింతు రేచి యాగడీలు. 112

క. అప్పు గొని మగుడఁ బెట్టరు
తప్పు పలుక శంక గొనరు తగు బేహారం
బెప్పటిపరివర్తనముల
చొప్పు చెఱిచి చూఱగొనఁగఁ జొత్తురు జనముల్. 113

క. అవి యెల్లఁ గారణములుగ
నవనిం గలహములు పుట్టె నన్యోన్యవిచి
త్రవధంబులు చేసి నృపా
హవయోగ్యభటాలి యెల్ల నాఱడిఁ బోయెన్. 114

---

* డనంతరము.

వ. అట్టిసమయంబునం జంద్రపాలితు పరికరం బను కపటజనంబు
వాదంబు లొనర్చి పోటార్చి వేఁటవేడుకలు పుట్టించి
వారలు మృగంబుల పాలుచేసియు మ్రుచ్చిలి యొరులపైఁ
జొప్పులు వెట్టియుఁ బెనఁకువలు చేసి చచ్చునంతలు పుట్టిం
చియు విషంబు లిడియుం జిచ్చులు దగిల్చియు మన్నీల వేఱు
సేసి యొగపడ్డచోట్లఁ దెగఁజూచియు యోధవీరుల సమ
యించుచుండ. 115

క. అధికారిచయముఁ దత్త
ద్విధముల నవపాడి సేసి వివిధధనంబుల్
పృథగతి నొక్కొక వెరవున
నధిపతికిం జెప్ప కంత కంతకుఁ జెఱిచెన్. 116

క. తొల్లి గలుగు భండారం
బెల్లను నానావిధముల నెసపోసి పతిం
జెల్లఁగఁ బనిచిరి గాయక
పల్లవలోల్యాభిరతి నపాత్రంబులకున్. 117

వ. ఇవ్విధంబున ననంతవర్మ రాజ్యం బస్తవ్యస్తం బగుటయు వసంత
భానుం డంతకుమున్నం దా నతనికి నవిరోధి యై వర్తిల్లు
చుండుం గావున గూఢవృత్తిం దద్విరోధి యగు భానువర్మ
పాలికిం జతురదూతం బుచ్చి యనుకూలభావంబున నిలిచి
పగ సాధించి యిచ్చువాఁడుగాఁ బూనిన నతండును. 118

మ. చటులస్యందనఘట్టనం దెరలి యశ్వవ్రాతచంచత్ఖురో
ద్భటపాదాతపదాహతి న్నెగసి యుద్యద్వారణశ్రేణికా
కటనిష్యందమదాంబువృష్టి నడపంగా భూరజఃపుంజ ము
త్కటదర్పోద్ధతవృత్తినొత్తినడచెన్ దండెత్తియుద్దండుఁడై.

క. నడచి విదర్భప్రాంతము
పొడియుగఁ గాల్చియునుఁ జూఱపుచ్చియుఁ బైపై
విడిసిన వసంతవర్మయుఁ
గడు నలిగి బలంబు గూర్చి గ్రక్కున వెడలెన్. 120

ఆ. వెడలి పగతుమీఁద నడవ వసంతభా
నుండు కుంతలేశ్వరుండు మఱియుఁ
గలుగు చుట్టములను గలసి యేతెంచిన
పీరు వారుఁ గడియ విడిసి రంత. 121

వ. అట్టియెడ. 122

తే. కుంతలాధీశుఁడైన యవంతిదేవు
ననుగలంబగు నొకవారిజాక్షి మంచి
గొండ్లి యన విని పిలిచి యక్కొమ్మ నృత్త
మంతయును జూచె వేడ్క వసంతవర్మ. 123

క. చూచి మకరకేతనశర
గోచరుఁడై దానిఁ గలిసెఁ గుత్సితవృత్తిన్
వేచిన వసంతభానున
కాచేష్టిత మెల్లఁ జెప్పి రందలిచారుల్. 124

వ. విని యతండు ప్రముదితచిత్తుండై. 125

మ. అది మూలంబుగఁ గుంతలాధిపతి కత్యంతంబు నానాఁటికిన్
హృదయక్షోభము పుట్టఁ జేయుచు విదర్భేశుం బెడంబాసి
యు, న్మదుఁడాచారవిహీనుఁ డుగ్రుఁ డని యన్నం బెక్కు
దోషంబులం, దుదిముట్టం జెడ నాడి యాతనికి శత్రుం జేసె
నే ర్పేర్పడన్. 126

వ. మఱియు ననేకప్రకారంబుల ననంతవర్మునిమిత్రుల నెల్లను వేఱుపఱిచి వివిధవస్తుప్రదానంబులం దనవశంబు గావించి వసంతభానుండు వానికి ననంతదేవునకుం దనతోడిపొందు శపథకీలితంబుగా దృఢంబు చేసికొని. 127

ఆ. భానువర్మ తోడు గా నరపాలుర
నెల్లఁ గూర్చి వారి నింద నిలిప
యవ్విదర్భపతికి నాపద పుట్టించు
నట్లు కుటిలనీతి యనువు చేసె. 128

ఆ. మొనలు నడుచునపుడు ముందటఁ దఱుమక
యోజఁ దాను వారు నోసరించి
తాఁకుతో విదర్భధరణీశు సైన్యంబు
నాకులతను బొడిచి యతనిఁ జంపి. 129

ఉ. కరితురగాదివస్తువులు గైకొని పాళులు వెట్టి యప్పు డ
న్నరవరకోశకోశ కాంచనాద్యధనంబుల లోభము పుట్టఁ జేసి యొం
డొరువులతోఁ బెనంగి తెగి యుద్ధము సేయువిధం బొనర్చి యా, తురగతిఁ బొందునట్లుగ నదోషుఁడ పోలె నొనర్చె నేర్పునన్. 130

వ. సకలరాజలోకంబును వికలతం బొంది చనినం దత్పరివారం బెల్ల బెదరి వచ్చిన మధురవచనప్రదానాదులవలన వారిం గూర్చుకొని బలసి భానువర్మ పగఁ దీర్చినవాఁ డై యిమ్మెయి నాతనిం బ్రీతచిత్తుం జేసి యల్పధనంబునఁ దృప్తుం గావించి నిజదేశంబునకుం బుచ్చిన వసంతభానుండు సమస్తవస్తు సహితంబుగా విదర్భరాజ్యంబు చేకొని యుండె నిట వసు రక్షితుండును భండనంబున మొగ తప్పి పట్టణంబునకుం జని

యనంతవర్మ యగ్రమహిషి యైన మహాదేవినిం దత్పుత్రి మంజువాదినిం బుత్రకు భాస్కరవర్మనుం దోడ్కొని వెడలి పరదేశంబున కరిగి వారలకు నాపదను బంధువిధాయకుం డైన విధాతకరుణాహీనత నయ్యమాత్యుండు కాలగోచరుం డగుటయు నత్యంతవిరళంబై పరిజనంబు వారిం దడవి తెచ్చి మాహిష్మతిఁ జేర్చి యప్పట్టణం బేలెడు మిత్రవర్మ యనంత వర్మ పెద్దకొడుకు గావున. 131

క. ఆనరపతిఁ గనిన నతం
డనూనప్రియపూర్వకముగ నుర్వీశుసతిన్
సూనునిఁ గుమారిఁ బురి నొక
చో నుపయోగ్యప్రభావసుస్థితి నునిచెన్. 132

వ. ఇట్లు కొన్ని దినంబులకు. 133

తే. మఱఁదలికి నాసపడి లోలమతిఁ జరించి
యమ్మహాదేవి పతిభక్త యగుటఁజేసి
తనకు లోను గాకున్న నతండు చాల
సిగ్గువడి పోయి కలుషితచిత్తుఁ డగుచు. 134

క. ఈయసతి సుతుని నృపుఁ గాఁ
జేయఁగ నని యున్నఁ గలుచఁ జేరద మృతునిం
జేయంగవలయు నేమి యు
పాయంబు లొనర్చి యైన బాలకు ననుచున్ 135

తే. క్రూరబుద్ధి యై తొడగినఁ గొంతకొంత
వినియు వినమి నంతఃపుర *వృద్ధ కొకని

* వృద్ధ నొకని.

కమ్మహాదేవి తనయుని నప్పగించి
యి ట్లనియెను భయం బెడ్డ నెనక మెసఁగ. 136

వ. వీని నెక్కడికేనియుం గొనిపోయి భిక్షుకాదులవలన వార్త
పుత్తెంచి నాళీజంఘుఁ డిట్లు సేయునే యని పొగడించుకొ
నుము వీఁడు ప్రాణంబులతోడ నునికియ నాకు నెల్లసంపద
లనవుడు వాఁడును సత్వరుం డై. 137

ఉ. ఆనృపసూనునిం గొని భయంబున రే గడు దవ్వు వోయి
య, చొచ్చి నొకయాలమంద గని చొచ్చి తదంతరవర్తి
గోపికా, నూనకృపాతిరేకవిహితోపకృతిం దగ దప్పి దీర్చి
యెం, దేనియుఁ బోవ వచ్చి ధరణీశ్వరు బంటులు గాంతు
రక్ష వగన్. 138

ఆ. అలికి దినమునందు నిలుచుట కొల్లక
బాలుఁ దడివి యచటు వాసి వింధ్య
విపినభూమి నడచి వేసవి గావున
డప్పి నొక్కనూయి డాయ నరిగె. 138

క. అని చెప్పంగనె నానృప
తనయునిఁ దెచ్చిన యతం డతం డని చిత్తం
బున నెఱిఁగియు వినియెదఁ గా
కని యెఱుఁగనియట్లు యుండ నతఁ డి ట్లనియెన్. 140

క. ఏ నాళీజంఘుండను
భూనాథకుమారుఁ డితఁడు పోయెద మిట యెం
దేనియు నల్లల్లన య
మ్మానవపతియాజ్ఞ గడవ మనుజోత్తంసా!. 141

ఉ. సత్యయశోవిలాస! మహనీయకళాకమనీయ! కొమ్మనా
మాత్యతనూభవత్వమహిమ స్తవనీయ! వివేకసంపదు
న్నత్యభిరామ! కాంతిపరిణామజితామృతధామ! సూరిసాం
గత్యరసైకకామ! శుభకర్మసముజ్జ్వల! ధర్మనిర్మలా!. 142

క. అనవద్యచిత్తవిద్వ
జ్జనమోదననిపుణ! వినయసంపదుదాత్తా!
దినినాథజైత్రతేజో
ధనసార! వికారదూర! ధర్మవిచారా!. 143

మాలిని. నరపతినయవిద్యానైపుణప్రౌఢభావా!
నిరుపమగుణరత్నోన్నిద్రతేజఃప్రభావా!
సురగిరిసమకీర్తిస్తుత్యధైర్యానుభావా!
సరసమధురవాణీసవ్యభవ్యప్రభావా!. 144

గద్యము. ఇది సకలసుకవిజనప్రసాదవిభవ విలస దభినవదండి నామధేయవిఖ్యాత కేతనార్యప్రణీతం బైన దశకుమార చరిత్రం బను మహాకావ్యంబునందు నేకాదశాశ్వాసము.

# ద్వాదశాశ్వాసము.

---

శ్రీవిస్తారారాధిత
దేవద్విజలోక! విమలధీసుశ్లోకా!
భూవినుతపాత్రవిద్యా
ద్రావణదేవేశ! తిక్కదండాధీశా!. 1

వ. మహాపురుషా! పరమకారుణ్యంబ కారణంబుగా నుత్సవం
బైన పాత్రభావంబున. 2

ఆ. ప్రాణదాన మిచ్చి రక్షించినాఁడ వి
ట్లగుటఁ జేసి నిన్ను నడుగవలయు
బాలు నేచట నెట్లు బ్రతికించి యిమ్మేయి
నిస్తరించువాఁడ నీతి చెపుమ!. 3

క. అనుసమయంబున బాలుం
గనుఁగొన నామానసంబు గాఢస్నేహం
బునఁ బొందుటయును దీనికిఁ
బని యేమని యరయఁ గోరుభావముతోడన్. 4

వ. ఏ నావృద్ధుతో ని ట్లంటి. 5

ఉత్సాహ. తల్లివారిఁ జెప్పు మితని తల్లి నింక నింటి నీ
వెల్ల నెఱిఁగి యున్న వాఁడ విక్కుమారుమీఁద నా
యుల్లమునకు నరులు మిగిలి యున్న యది నిరూపణం
బెల్లమైన బాంధవంబుతీపు గలుగ నోపునే. 6

వ. అనిన విని వాఁడు మొగంబున నాస దోఁప నిట్లనియెఁ బాటలీపుత్రనగరంబున వణిజుండైన వైశ్రవణు దుహిత నాగరదత్తకుం గౌసలేశ్వరుం డగు కుసుమధన్వునకు జనియించినయదియ తజ్జనని యనవుడు నేనును. 7

క. ప్రీతి విని వీనితల్లికి
మాతండ్రికి నొక్కరుండ మాతామహుఁడం
చాతతహర్షంబున నృప
సూతిం గనుఁగొనుచు వృద్ధుఁ జూచితి నెమ్మిన్. 8

వ. చూచిన నతండును సందేహంబుతోడ నభినందించి భవత్పితృనామంబునుం ద్వదీయాభిధానంబును నెఱింగింపవే యని యడిగిన నే నతనియంతర్గతం బెఱింగి. 9

సీ. అనఘ! వైశ్రవణుని యగ్రనందనుఁడైన
వసుదత్తు సుతులలో వర్యుఁ డనఁగ
సడిసన్న సంశ్రుతుం డడిగెదవేని నా
యభిధాన మని సందియంబు వాయఁ
జెప్పిన మోదంబు చిప్పిలి నిండి మో
మున విరివిరియంగ మోడ్పుఁ గేలు
తోడ నీమఱఁదికి నేఁడుగడయు నీవ
చేకోలు గలిగి రక్షింపు మింక

తే. ననుడుఁ బగ దీర్చి నిలిపెద నధిపతనయు
నెల్లభంగుల నని యూఱడిల్లఁ బలుకు
చున్న యెడ రెండుమృగముల నొక్కవేఁట
కాఁడు వెనుకొని వచ్చుట గని గడంగి. 10

వ. అతిత్వరితంబునం జని వానిచేతి కోదండకాండంబులు పుచ్చుకొని యుచ్చిపోయి డొల్ల నొకకోలతోడన కూలనేసి యమ్మృగయునకు నొక్కటి యిచ్చి తక్కటి దాని యందలి సారమాంసంబు కార్చిచ్చున వారియాఁకలి దీర్చి యేను నుపయోగించి నాళీజంఘునితో ని ట్లంటి. 11

ఉ. ఏను గుమారునిం గనుట యేకత మింతికిఁ జెప్పు మేర్పడన్
గానభూమిలోన నరుగంగ నృపాత్మజుఁ జంపె నొక్కపం
చానన మంచు వీటఁ గలయం బలుచోటులఁ బల్కు
ముమ్మరం, బై నటు లుండు నంత వసుధాధిపువీనుల వార్త
సోఁకినన్. 12

తే. ఆత్మఁ బ్రీతుఁ డై శోకించినట్లు పోలె
నరుగుదెంచి మహాదేవి ననునయించి
చనినపదపడి దేవినిఁ బిలిచి చెవుల
కింపుగ నతని కిట్లు చెప్పింపవలయు. 13

క. మును పిన్నవాఁడు తనకడ
నునికిఁ దగవుగాఁ మిఁజేసి యుగ్మలి! నీకో
రినపని యెడ నేసెం గడ
చనియె నదియు నింక నీవ శరణం బధిపా!. 14

ఆ. అనినఁ దలఁపు గట్టి యగుటయుఁ దనమది
నిజముగాఁ దలంచి నృపతి వచ్చు
నపుడ వానిఁ జేరి యంతఃపురముపరి
జనులు చూచుచుండ సతియు నతని. 15

వ. ఇమ్మహావిషంబు ప్రయోగించిన జలంబులం దోఁచి విదిర్చిడించిన కుసుమదామంబున. 16

తే. ఏను బతిభక్తినిరతనయేని శస్త్ర
ఘాతమై మిత్రవర్మనిప్రాణిఁ గొనఁగ
వలయు నని శాప మిచ్చుచుఁ దలము నురము
వ్రేయుటయు వాఁడు పడుఁ గడు విస్మయముగ. 17

క. ఆమాలిక గూఢముగా
నీమాలిక సోఁకఁజేసి యింతి పరిజన
స్తోమము నెదుకన తనయం
బ్రేమంబునఁ బిలిచి యఱుతఁ బెట్టఁగవలయున్. 18

వ. అని చెప్పి రెండుమందులు వేఱువేఱఁ జూపి మఱియు ని
ట్లంటి. 19

చ. మనుజవరేణ్య చావునుఁ గుమారక మాలికఁ బూనియుక్కి
యుం,గనుఁగొనుచున్న వారలు ప్రకాశము గాఁగ నమాత్య
భృత్యపౌ, రనికరసన్నిధిన్ భయకరంబున విస్మయమున్
విషాదముం, బెనఁగొనుచుండఁ జెప్పుదు రభేద్యత నీతి వరిం
చు నెమ్మెయిన్. 20

క. మృత్యువు పొందినరాజున
కత్యయవిధి యాచరించునప్పుడు పాతి
వ్రత్యస్తుతి యొనరింతు ర
మాత్యాదులు దాన దేవి మహనీయ యగున్. 21

వ. అట్టియెడ రెండు మూఁడు దినంబులు చనిన యనంతరంబ.

ఉ. రాజ్య మరాజకం బయినఁ బార్థివమెయిన్ భరియింప నుత్తమ
ప్రాజ్యునకైన దుష్కరము యట్లగుటం దమలోన నెంత
యున్, నజ్యత నీతివిక్రమవిచారపరంపర పుట్టుచున్న చోఁ
బూజ్యపురస్సరంబుగఁ బ్రభుప్రతతిం బిలిపించి వారితోన్.

వ. మహాదేవి యి ట్లనవలయు. 24

సీ. వింధ్యవాసిని గల వేంచేసి నీపుత్త్రు
నేను సింహాకృతి నెక్కి డేనిఁ
గొనిపోయి దాఁచితి వినుము మద్గణముల
తోనన మన్నింతు వానిబుద్ధి
బలపరాక్రమములుఁ గలిగెడు నిర్మల
ద్విజకుమారుని రూపవినయవంతుఁ
గాపు వెట్టినదానఁ గ్రమ్మఱఁ బుత్త్రెంతు
మాహిష్మతీరాజ్యమహిమ యిచ్చి

తే. వాఁడు మంత్రి యై భాస్కరవర్మపదవి
నడుపునట్లుగఁ బనిచెద నాకు నీవు
వియ్యమవు మంజువాదిని యయ్యమాత్యు
భార్యగా నొనరించితి బ్రదుకుఁ డనియె. 25

వ. ఎల్లుండి మనముం దనకు విశేషపూజ గావించి పంచమహా
శబ్దంబులతోడఁ గుడిలోపలనత్యంతవిజయంబు నేసి తిగిచికొని
వెడలి మొన గలసియుండ నందుండి యయ్యిరువురు నిర్గ
మించి మనకుఁ బొడసూపంగలవా రనియు నానతి యిచ్చెఁ
గలఁగన్న యాత్మకుం గంప మెత్తికొని పోయినయ ట్లంతన
సంతోషింపలేదు కన్నప్పుడు దాన లోకప్రసిద్ధం బయ్యెడు
నంతవునంతకు నీమాట గుప్తంబు గావలయు నని చెప్పి
పీడుకొలుపునది. వారునుం దమలోన నవ్వనిత పతివ్రత
గావున దైవసాధ్యంబు గలుగనోపునట్టి యాశ్చర్యంబు
గంటిమేని యింత్తకంటెను మనకు వెరవు వేఱొకండు లేదు
లెస్స పొమ్మని యుండుదు రటమున్న యేనునుం గుమారుం

డును గాపాలికవేషంబున నాపురంబున నిలిచి భిక్షాన్న రక్షితశరీరుల మగుచు దుర్గమవిపినంబున నొక్కబిలంబు దుర్గపీఠంబుచక్కటికి వెడలం ద్రవ్వి జనదృష్టికి ననుపలక్ష్యం బుగా నాయితంబు సేసి యద్దినంబుముందటి యర్ధరాత్రం బున నీవు దెచ్చియిచ్చిన యుజ్జ్వలాభరణపట్టవసనమాల్యాం గరాగంబుల నలంకృతుల మై బిలప్రవేశంబు చేసియుండి పంచమహాశబ్దంబుల నాసమయం బెఱింగి దేవిప్రతిమ యెత్తుకొని యుద్ధమించి దానిం గ్రమ్మఱ నెప్పటియట్ల కాఁ బెట్టి కవాటోద్ఘాటనంబు చేసి చనుదెంచిన రాజ్యసిద్ధి యగు మద్వచనంబు సాంగత్యంబుగా ననుష్ఠింపు మని పనిచిన. 26

ఆ. వాఁడు నరిగి యంతవట్టు గావించిన
నేము నట్లు సేసి యెల్లజనులు
నట్టు లెత్తి చూడ నాగండివెడలి య
శంకితాత్ము లగుచుఁ జనినయపుడు. 27

మ. కర మాశ్చర్యముఁ బొంది మంత్రిజనముల్ కారుణ్యపా
త్రత్వముం,బౌరయం గోరుచుఁ జాఁగి మ్రొక్కి ముదితాం
భోరాశిభంగిన్ దిశా, పరిపూర్ణం బయి పౌరలోకజయశబ్ద
శ్రేణి ఘూర్ణిల్లె నా, వరలీలం దగుసేన రాఁ బనిచె నంతన్
దేవు లచ్చోటికిన్. 28

ఉ. పట్టము గట్టి మంత్రులును భాస్కరవర్మని వారణేంద్రుపైఁ
బెట్టిరి వారువంబుఁ గడుఁ బెంపెసలారఁగ నెక్కి వారు నా
చుట్టును వచ్చుచుండ నృపసూనుని ముందటఁ గొల్చిపోయి
య, ప్పట్టణ మంతఁ జొచ్చి తగుభంగిఁ బ్రభుత్వము నిర్వ
హించితిన్. 29

వ. అంత వసంతభానుండు మిత్రవర్మమరణంబు విని ధరణిఁ గై
కొన దాడిమై నల్పసైన్యంబుతో నడచె మాహిష్మతీరాజ్యం
బరాజకం బగుట నందలివా రెల్లను నంతకుమున్న తమ
తమయంతం జతురంగబలంబులం గూర్చుకొని యునికిం జేసి
యేనును సేనాసమగ్రుండ నై గ్రక్కునం దండువెడలి
వారిచేతం బగతు కొంచెపుందనంబు వినుట నుద్దవిడిం గదియ
నడచినం బదంపడి యతండు భాస్కరవర్మ యద్భుతరాజ్య
ప్రాప్తి ప్రపంచం బంతయును విని వెనుకకు జరుగ నసువు
గాక సాహసంబున మోహరించి. 30

శా. సైన్యంబుల్ మద మెక్కి బాహుబలముల్ శౌర్యంబులుం
జూపి ని, ర్దైన్యస్ఫూర్తిఁ గడంగి పోరఁ బటుశస్త్రప్రౌఢిమైని
ష్ఠురాన్యోన్య(స్త్రా)హవనోత్థితాగ్నికణరౌద్రాకారతన్ లోక
సామాన్యాతీతమహోగ్రవిక్రమరణోన్మాదప్రకారంబులై.

వ. అట్టియెడ. 32

క. పసమరక ప్రజలు ముందట
వెసఁ దునుముఁగ నల్లనల్ల వెనుకకు జరగన్
గసిమసఁగఁ జేయి వీచుచు
వసంతభానుండు దాఁకె వసుధ వడంకన్. 33

ఉ. తాఁకినఁ దద్బలంబులు నుదగ్రపరాక్రమదుర్దమంబు లై
వీఁక నెదుర్పఁ జూచి పిఱువీఁక మదీయవరూథినుల్ జముం
డాఁకలి పుట్టి బిట్టడరునట్లు ప్రజం బురికొల్పికొంచు నే
నాఁకకు మీఱు వారిధిక్రియన్ రిపుసేనల నాక్రమించితిన్.

వ. ఇట్లు బరవసంబు సేసిన. 35

క. దవదహనుఁడు పరపై వెస
గవిసిన రూపడఁగు సాంద్రకాంతాకమున
ట్లవిరళశాత్రవసైనిక
వివిధాయుధజాల మడరి వ్రేల్మిడి మ్రగ్గెన్. 36

ఉ. ఆసమయంబునం దెగి యుగాంతకృతాంతునిభంగి విక్రమో
ల్లాసమునం గడంగి విపులంబగు మద్బల మెల్ల భూరిసం
త్రాసము పొందెఁ పాయపడ దర్పము మీఱి వసంతభానుఁ
డు, ద్ధ్వజసితకేతువైన యనంబు వడిం బఱపెఁ సముద్ధతిన్.

క. పడఁగఁ గని వీఁడె రాజని
యడరెదు లెంకలకు మున్న యతిరయమున నే
ఁడిదుగులగమిక్రియ డివి ముడి
వడు తూర్యధ్వనులతోడఁ బఱపితి గజమున్. 38

వ. సమస్తవస్తువులు గైకొని భాస్కరవర్మునిం దెచ్చికొని యనం
తవర్మరాజ్యంబునుమిత్రవర్మరాజ్యంబును నొక్కటిగాఁ జెల్లిం
చుకొని యంతకుమున్న కలిగిన యన్యోన్యదర్శనంబున జని
యించిన యుభయానురాగంబున మనోహరంబైన మంజు
వాదినివివాహోత్సవంబు నిర్వర్తిల్లినం బల్లవసోదరంబులగు
భవత్పాదంబుల సంవాహనంబునకు మత్పాణితలంబు లువ్వి
ళ్ళూర నున్నంతం జండవర్మ చంపానగరంబునకు వచ్చిన
సింహవర్మ సహాయార్థంబు చనుదెంచి యీయభ్యుదయం
బనుభవింపఁ గాంచితి ననిన విని రాజవాహనమహీవల్లభుండు
ప్రమదాయత్తచిత్తుం డై. 39

క. కార్యవిచారనిరూఢియు
శౌర్యసమగ్రతయు బంధుజనరంజనచా

తుర్యము సమయాలంబిత
ధైర్యంబును నితని కిట్లుదాత్తం బగునే!. 40

క. అని విశ్రుతపౌరుషమును
గొనియాడి ప్రమోదమారఁ గూరిన హృదయం
బునఁ దెలివొందిన యానన
మును నై యంగజముఖాబ్జములు గనుఁగొనియెన్. 41

తే. అపుడు కామపాలుండు ప్రహారవర్మ
యను విదగ్ధవాక్యంబుల మనుజవిభుని
బుద్ధిపౌరుషవాక్యసమృద్ధు లర్థిఁ
గీర్తనము చేసి చెలుల నగ్గించి రంత. 42

వ. సింహవర్మ నమాత్యుండు చనుదెంచి వినయంబునం బ్రణమిల్లి జలకంబు పెట్టియున్నది వేంచేయుం డని దేవరవర వుడు విన్నవించి పుత్తెంచె ననవుడుఁ గామపాలప్రహారవర్మలనుఁ గుమారసమూహంబునుం దత్తదనుచరులం దోడ్కొని చని తానును వారలు నిజోచితస్థానకృతమజ్జనానంతరంబ చంపేశ్వరభక్తిపూర్వకక్రియమాణప్రియసరసాహారంబులు పంక్తినుపయోగించియధిపతి యతనిచేత నర్చితుం డై సుఖసత్కథలం బ్రొద్దుపుచ్చి మఱునాఁడు శుభముహూర్తంబున జనకుం డిచ్చిన యంబాలిక నపహారవర్మకు విభవం బెసఁగ వివాహంబు చేసి. 43

క. చంపాధీశ్వరు రాజ్యము
కంపస్థితిఁ బొందునట్లుగాఁ గొని సంర
క్షింపంగలవాఁ డని తగఁ
బంపి యతని యౌవరాజ్యపట్టము గట్టెన్. 44

ఆ. సింహవర్మ నిలిపి చెలిక్రి దదీయస
ప్తాంగములును జెల్లునట్లు చేసి
సైన్యములును దాను సఖు లెల్లఁ గొలిచి రా
నడచె మాళవేంద్రు నగరమునకు. 45

క. అంత నట దర్పసారుం
డంతయు విని యాత్మరాజ్య మస్థిర మగుటం
జింతిల్లి తపము విడిచి య
వంతిపురికి నేఁగి సైన్యవర్గముఁ గూర్చెన్. 46

వ. మానసారుండును మగధనాథనందను తెఱం గెఱింగి
తానును దనయుండునుం గార్యాలోచనంబునకుం జొచ్చిన
సమయంబున నతనితో ని ట్లనియె. 47

ఉ. దేవసమానమూర్తి కులదీపకుఁ డేడవచక్రవర్తి యా
భూవరనందనుం డతనిఁ బొందఁగఁ గన్న యవంతిసుందరీ
దేవియుఁ బెంపునన్ వెలయు దీనిఁ బ్రియంబునఁ గప్ప మిచ్చి
సం, భావన గాంచి నీదు నృపభావము సంస్థితిఁ బొందఁ
జేయవే. 48

వ. అనిన విని యతం డుద్ధతుండు గావున నమ్మాట లపహసించి.

మ. నగుఁబా టారయవైతి నీవు మును కన్యాదూషకుండైన
వా, ని గుణాఢ్యుం డని సంస్తుతించె దకటా! నీయట్టివాఁ డి
ట్లనం, దగునే? యంతకు నేమి మూడె? నిజసంతానోచితా
చారముల్, మగపంతంబును దక్కినన్ జనము లేమం
డ్రీభయం బెటికిన్. 50

ఉ. వింతయె మాగధుండు మును వీఁడును వానిసుతుండ
కాఁడె దు, ర్దాంతమదీయబాహుబలదర్పమునన్ వెల

యింపుఁ గంటి ని, శ్చింతతతోఁడ నుండు మని చెప్పఁగ వెండి
యు నంతఁ బోక భూ, కాంతుఁడు తద్వయస్యులఁ దగం
బ్రణుతించిన దర్పసారుఁడున్. 51

క. కూటవమూఁకలకై వడిఁ
బోటై విని మెదవు సీదుపుత్త్రకు నిచ్చో
మాట లివి యేల? యని శౌ
ర్యాటోపము మెఱయఁ బల్కె యాహవమునకున్. 52

వ. ఇట్లు చని తదీయస్కంధావారంబు చేర విడిసి యనంత
రంబ రెండుతెఱంగులవారునుం గలసు సెప్పి యొద్దనం
బులు దీర్చుసమయంబునం గుమారులు శృంగారంబులు చేసి
కొని యేలినవానికిం బొడసూప నరుగునవసరంబునం దమ
లోన. 53

చ. వెలి మన మెంత యక్కజపువిక్రమముల్ పదివేలు చేసినన్
దలకొని వాని నియ్యకొనుదాతయుసన్నిధిఁ గానకొండవె
న్నెలక్రియ రిత్తవోయె ధరణీపతికిన్ బవరంబు గల్గె దో
ర్బలము పరాక్రమంబు నెఱపం దఱి యయ్యెఁ దలంపు
గల్గుఁడీ. 54

మ. అని సల్లాపము సేయుచుం జని మహీశాగ్రేసరుం గాంచి
యాననముల్ జృంభణ మొందఁ బ్రౌఢపదవిన్యాసాదిగంభీ
రభా, వనరూపస్థితి నొంది ధీరరససిర్వాహంబు శోభిల్లఁ బ
ల్కిన నాతండు దరస్మితద్రదననాళీకాంతకాంతాస్యుఁ డై.

తే. నగుచు నింతలు మాటలు నాకు మీకు
ననఁగవలయునె యది యేల? యంతవాఁడె

దర్పసారుండు దన కెట్లు దప్పఁ గ్రుంక
నగు నుపాయంబు లేమిఁ జాఁ బెగిలెఁ గాక. 56

క. అనుచు మొనలు నడిపింపఁగఁ
బనిచి యెదిరి మోహరమునఁ బడగలు గని మో
మున రణకేళీకౌతుక
మినుమడి యై తోఁప మేదినీశుఁడు గడఁకన్. 57

మ. గజరాజుం దలుమం గుమారులును దోర్గర్వంబున న్మీఱి
యో, ధజనోల్లాసవిధాయకంబు లగు నుత్సాహంబులం
దీవ్రు లై, విజయాకాంక్షఁ గడంగినఁ బలము లుర్వీభాగ
మల్లాడ న, క్కజపుంగోల్తల సేసె నొక్కురువడిఁ గా
ర్చిచ్చుచందంబునన్. 58

ఆ. అట్టియెడఁ గడంగి యరిసేన రారాతిఁ
దాఁకినట్లు బెట్టు దలపడుటయు
దూలితోన నెగసెఁ దూలిమిడుంగుఱు
గములు ఘోరశస్త్రఘట్టనమున. 59

మ. పటుతూర్యధ్వను లాకసం(బలమ)శుంభ ద్బాహుగర్వంబుమి
క్కుటమై సారథిఁ జూచి నీవగుససంక్షోభత్వముఁ ఘో
టకో, ద్భటవేగంబును జూపు మిప్పు డని సంభావించి
సంగ్రామలం,పటచిత్తోన్నతి నేచిమూ(ర్ఛతరగర్వ)స్ఫారతం
దాఁకినన్. 60

క. సంకులసమరము ఖచరా
తంకితపటుభంగి యగుడు ధరణీశ్వరుఁ డా
తంకబహుతూర్యనిస్వన
కింకిణిగర్జా(చయంబు)క్రియ ఘూర్ణిల్లెన్. 61

మ. మదవద్దంతిఘటా*గ(తాగతచలత్)క్ష్మాచక్రుఁడై శౌర్యసం
పద సొంపారఁగ నస్త్రశస్త్రచయశుంభద్దీప్తిజాలంబు స
ర్వదిశాభాగములందు దీటుకొన సంరంభంబు శోభిల్లఁ గెం
పొదవంజాడ్యుల మాగధధ్వజపటప్రోల్లాసమీక్షించుచున్.

చ. వెరసిన దర్పసారుఁడు నభేద్యత మార్కొనినం గుమారులు
ద్ధురగతిఁ గిట్టి తత్సుభటదుర్జయదోర్బలకాననంబులన్
సరభసదుర్నిరీక్ష్యఘనశాతనిరర్గళహేతినిష్ఠుర
స్ఫురణదవాగ్ని నేర్చిరి విభుండనుమాళవు నంటఁదాఁకినన్.

చ. అతఁడును రాజవాహనధరాధిపు చిహ్న మెఱింగి పొంగియు
ద్ధతిఁ దలపడ్డ వీరయుగదారుణబాణపరంపరాసము
ద్గతులఁ దదంతరాంబరము గప్పి నభశ్చరమానసంబులం
గుతుకము నొత్తరించుచు †(మి)గుల్ గదిరెన్ రణఘోర
రౌద్రతన్. 64

ఉ. అత్తఱి మాళవుండు గదియంబడి తోమరచక్రరాజి ను
న్మత్తగజేంద్రు నొంచి వెస మావతునంగము శోణితం
బునం, జొత్తిలఁ జేసినంగినిసి సూతుహయంబుల డొల్లనేసె
భూ, పోత్తముఁ డాతఁ డేమఱక యుగ్రతఁ గైదువువ్రేసి
వెండియున్. 65

ఆ. మెఱుఁగు ‡వఱచినట్లు మేదినీశ్వరుఁడు ర
థంబుమీఁది కుఱికి దర్పసారు
శిరము దొరసి డొల్లఁ గరవాలముల వ్రేసె
సురలు సంస్తుతింప సొంపు మెఱయ. 66

* విఘట్టన. † 'దిగుల్' అని వ్రాఁతప్రతి. ‡ మెఱసినట్లు.

వ. ఇత్తెఱంగున మాళవేంద్రుఁ డింద్రుచెలిం జేసి తనచెలులు తదీయతురంగరథంబులు రయంబునం బోదివి తేరం గైకొని ధర్మకాహాళ పట్టించి పదాతిపరుషవ్యాపారంబులు సాలించి విడిచి. 67

ఆ. వార్త ప్రియకుఁ బుచ్చి కీర్తిప్రియుం డయి
మహిమ యెసక మెసఁగ మాళవేంద్రుఁ
డాత్మశోక ముడుప సర్వజనంబుల
మనుజవిభుఁడు నెమ్మిఁ బనిచె నంత. 68

క. తా నుత్సుకుఁ డై యుజ్జయి
నీనగరంబునకు నరిగి నిరతిశయప్రా
ప్తానందపూరసంభృత
మానసనిజవల్లభాసమాగమ మొందెన్. 69

వ. ఇట్లవంతిసుందరిం గలసి తదీయసఖీజనంబు సంభావించి యంతఃపురంబున విభుండు పేరోలగం*బుండి కుమారవర్గంబు నిరర్గళసేవాసుఖంబనుభవించియాస్థానమంటపంబున నున్న సమయంబున సోమదత్తుండును నరపతిపరిజ్ఞాతుం డైన పుష్పోద్భవుండునుం దొల్లి హంసకథ వినుటం జేసి యప్రతి విధేయంబగు నాపదకు వెఱవక రత్నోద్భవు సంబంధించి యప్పురంబునన యునికి నమ్ముప్పురునుం బరమహర్షభరితాం తఃకరణు లగుచుఁ గొలువు సొత్తెంచి. 70

తే. మున్ను వెదకించి తమ్ముఁ బ్రమోద మెసఁగఁ
జూడఁ గోరుటకు నెదుళ్లు చూచునృపతి

* బిచ్చి.

యెలమి గద్దియ డిగి యెదురేఁగుదేర
మ్రొక్కి రవనీతలంబునఁ *జక్కఁ జాఁగి. 71

వ. ప్రణమిల్లిన భూవల్లభుండు సంభ్రమంబున నెత్తి కౌఁగిలించుకొని సోమదత్తపుష్పోద్భవులనుం దక్కటి చెలులనుం బరస్పరసాదరపరిరంభణంబు సేసినయనంతరంబ రతోద్భవాదులకుఁ గామపాలప్రహారవర్మల నెఱింగించి వీరలను వారలను నపహారవర్మప్రముఖసఖులకు రతోద్భవుం జూపి యన్యోన్యసముచితప్ర(సంగంబు నడిపి)సింహాసనాసీనుం డై సపరిచరగణంబుల(కు మణిమ)యాసనంబు లొసంగి బహుమానంబుగా మానసారు రావించి వలపటం బ్రహారవర్మాసనసమానంబున నునిచి. 72

తే. హర్ష మెడ నిండి మోమున నలువు వెడలు
కరణిఁ జెలువొంద లోచనకాంతిపూర
మల్ల నిగుడ వసుంధరావల్లభుండు
సోమదత్తుఁ బుష్పోద్భవుఁ జూచి యపుడు 73

క. తనచరితము మిత్రుల వ
ర్తనమును సంక్షేపవృత్తిఁ దగఁ జెప్పి ముదం
బునఁ బుష్పోద్భవునకుఁ ద
జ్జన †పదవివిధాధికారసంపద లిచ్చెన్. 74

వ. ఇచ్చి యతని సకలకార్యంబులకుం జాలించి బంధుపాలు రావించి యాలింగనసముచితాసనప్రదానాదుల సంభావించి సగౌరవంబుగా సంపద్విశేషప్రమోదితులం గావించి యనంతరంబ. 75

*ముందుఁ. † పతి.

క. విద్యేశ్వరుండు వచ్చిన
సుద్యత్ప్రీతిఁ విభూతి యొసఁగి యతనికిఁ
హృద్యమగు నింద్రజాలపు
విద్యాసంబంధవచనవిరచిత మొసఁగెన్. 76

వ. ఇట్లు పూర్వకృతోపకారుండైన యతని నభిమతార్థంబులం
గృతార్థుం జేసి సోమదత్తపుష్పోద్భవులం గనుంగొని. 77

ఆ. మాళవేంద్రుఁ జూపి మాన్యత నితనికి
నెల్లభోగములును జెల్లఁజేయుఁ
డనుచుఁ బ్రియముతోడ నధిపతి వారికి
నప్పగించెఁ జెర్మి యతిశయిల్ల. 78

వ. మఱియునుం జెలులకుం గారణమిత్రు లగువారల నంపలి
జనంబులను నర్హపదవీప్రదానంబులం బ్రీతచిత్తులంగావించి.

క. వెనుపొంద సోమదత్తుం
గనుఁగొని మీవీటి కరిగి క్రమ్మఱ నిట చ
య్యనఁ జనుదెమ్మని సముచిత
జనంబుతోఁ బనిచి పుచ్చి సమ్మదలీలన్. 80

తే. అవ్వసరంబునఁ దానుఁ బ్రియాంగనయును
వివిధకేళిఁ గ్రీడింపుచు విభుఁడు నిలిచెఁ
గొన్ని దినములు సైన్యంబు గూర్చుకొని ర
యంబుమై సోమదత్తుండు నరుగుదెంచె. 81

వ. ఇవ్విధంబున సంపూర్ణమనోరథుం డైన రాజవాహనుండు
విభవం బెసంగ నవంతిసుందరీసమేతుం డై సకలసేనా
పతులుం గొలిచి రాఁ గతిపయప్రయాణంబుల వామదేవు
నాశ్రమంబునకుం జని దాని కనతిదూరంబున నదీతీరంబున

సైన్యంబుల విడియించి యమ్మునీంద్రునకుం దనరాక యెఱిం
గించి*. 82

తే. తాను బ్రియయునుఁ జెలులు నందలము లెక్కి
యాశ్రమమునకు లలి దొలకాడఁ జేరి
వేడ్కయును గౌరవంబును విస్మయంబు
నెడఁ బెనంగొన మునిశిష్యు లెదురుచనఁగ. 83

వ. వారల నెడనెడ సంభావింపుచు రాజవాహనమహీవల్ల
భుండు పల్లవతోరణసంఫుల్లప్రసూనప్రాలంబమాలాసము
ల్లసితంబైన మునిపల్లియఁ దఱియం జని యటమున్న †యుట
జ(ంబులం దపోధను లిట్టులతోఁ) గూడ నట్టు లెత్తి చూచు
చుండ వారికిం గట్టెదు రగుటయు శిబికావతరణంబు సేసి.

ఆ. చెలులు సందడించి కెలనఁ బిఱుందను
బోడివి య(రుగుదేర బోయి తల్లిఁ
దండ్రి బుషిని జూచు తమకంబు గ) దుర (న
య్యాశ్రమస్థలంబు) నతఁడు సేరి. 85

క. వసుమతికి రాజునకుఁ దా
పసముఖ్యునకుం గ్రమమునఁ బ్రణమిల్లిన వా
రసదృశహర్ష భరితమా
నసు లై గరువంబు దీవెనలు ముందరగాన్. 86

చ. పులకలు సమ్మదాశ్రువులుఁ బొందఁగ నాతనిఁ గౌఁగిలించి నె
చ్చెలులు వినీతి మ్రొక్క సవిశేషమనఃప్రమదంబుతోడ వా
రలఁ గ్రమవృత్తి గాఢపరిరంభము సేసి తదీయవక్త్రము
ల్గలయఁగఁ జూచుచుం బ్రచురగౌరవసంభృతవత్సలాత్ము లై.

* పుచ్చి. † యుటజంబులగుంప నట్టులెత్తి,

వ ఉన్న యెడం గామపాలప్రహారవర్మాదులు సుమతిసచివులకు యథార్హప్రతిపత్తి యాచరించినం బదంపడి విదగ్ధసఖీ జనంబులు పాడివి తోడ్తేర లజ్జావనతవదన యగుచు నవంతిసుందరి యల్లన నరుగుదెంచి యభివందనంబు సేసిన నాశీర్వాదపురస్సరంబుగా నాముగ్గురుజనంబులు పత్నీ సహితంబుగా మునిప్రవరుల నెల్లను రావించి వారు నుం దామును నాదంపతులతోడం గుమారవర్గంబునకు సేసలువెట్టిన యనంతరంబ వామదేవుండు రాజహంసాను మతంబున వసుమతీదేవికోడలి నభ్యాంతరపర్ణశాలాంగణం బునకు సగౌరవంబుగాఁ దోడ్కొని యరిగి యమ్ముద్దియం జూపి యమ్మునీంద్రునకు నన్నరేంద్రుం డి ట్లనియె. 88

ఆ. ఎనక మెసఁగుకరుణ కెపుడును నునికిప
ట్టనఁగఁ జాలుమీకటాక్షమహిమ
మాళవేంద్రుఁ గొన్న మహనీయలక్ష్మి సా
కారలీలఁ దెచ్చె[illegible]లంగ. 89

వ. అనిన విని యతండు గౌరవంబున ని ట్లనియె. 90

క. ఆవసుదేవునిపిమ్మట
నీ వాకఁడవు సకలమేదినీతలమున సం
భావనయోగ్యుఁడ వనుచుఁ
దీవన లిచ్చెఁ దయార్ద్రదృష్టిం గనుచున్. 91

వ. అంతట సకలసైన్యసమేతుం డై స్వజనులతోఁ గుసుమపుర మునకుం జని రాజవాహనునకు మగధరాజ్యపట్టాభిషేకంబు చేసి లోకంబులు మెచ్చ ననేకంబులగు దానధర్మంబు లాచ రించుచు నిర్భరుం డై రాజహంసుం డుండె నంత. 92

తే. రాజవాహనన్నపతి ధర్మమున రాజ్య
పాలనము చేయునెడఁ బ్రజ పరమసుఖము
గదిరి ధర యెల్ల శ్రీధాన్యకటక మయ్యె
నతనికీర్తులు పాల్పొంగినట్లు వెలసె. 93

మ. *(విలసచ్ఛ్రౌతవిధీయమానసరణీవిధ్యుక్తయజ్ఞక్రియా
కలనాతర్పితదేవతేంద్రముఖదిక్పాలా! గృహీతోజ్జ్వల
జ్వలనాష్టాపదదేహభాగ! మతివైశద్యానవద్యాత్మ! ని
ర్మలవిజ్ఞాన! యనూనవాగ్విభవసామర్థ్యా! కవిగ్రామణీ!.



క. నవరసభావాలంకృత
కవితారచనావిధానకల్పనపాండి
త్యవిశేష! యుభయభాషా
తివిశారద! బుధవిరాజి! తిక్కనయాజీ!. 95

మాలిని. సురుచిరచిరకీర్తీ! సుందరాకారమూర్తీ!
చరితసవనపూర్తీ! సత్సుధీచక్రవర్తీ!
పరిణతనయవేదా! భాగ[illegible]దా!
స్థిరతరఘనమోదా! [illegible]దా!)

గద్యము. ఇది సకలసుకవిజన[illegible]వ[illegible]స దభినవదండి
నామధేయవిఖ్యాత కేత[illegible]ప్రణీతం[illegible] దశకుమార
చరిత్రంబను మహాకావ్యంబు[illegible]శ్వాసము.

దశకుమారచరిత్రము సంపూర్ణము.

---

*సాంప్రదాయసిద్ధము గావచ్చుచున్న యాశ్వాసాంతపద్యములు శిథిలములైనందునఁ బూరింపఁబడినవి.

చెన్నపురి. 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1925.

# శుద్ధపత్రిక.

| పుట. | పద్యసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 12 | 60 | తూఁపు | తూపు |
| | | లెప్పంబు | (పా)లేపంబు |
| 13 | 64 | దోహత్త | చోహత్త |
| 14 | 67 | తాపంధత | తారుంధతి |
| 15 | 75 | నెర | (పా)నెన |
| 16 | 79 | ప్రరకంబు | ప్రకరంబు |
| 18 | 87 | యలసయయ్యో | యలసనుయ్యో |
| 21 | 97 | చాళుక్య | చాణక్య |
| 23 | 104 | భజన | సుజన |
| 26 | 7 | ధూరీకృత | దూరీకృత |
| 27 | 11 | వాగు | వాఁగు |
| | 13 | దొరుఁగుచు | (రూ)దిరుగుచు |
| 29 | 20 | ఎడ | (పా)ఎద ఎడ్డ |
| 30 | 23 | సుద్యత | సుద్ధత |
| 33 | 42 | వెలువడినల | వెలువడియల |
| | | మానికొమ్ము | మ్రానికొమ్ము |
| | 43 | మొగంబబల | (పా)శిరంబబల |
| 34 | 44 | పరిపృత | పరిస్రుత |
| | 45 | దనరగ | దనరఁగ |
| | 49 | మఖస్థితు | సుఖస్థితు |
| | | *చీఁకటి | చీకటి |
| 35 | 50 | దీటితిక్ | తేటితిక్ |
| 37 | 60 | *పరఁగు | పరగు |
| | 62 | *నేఁగి | నేగి |
| 38 | 63 | నయ్యురుపురు | నయ్యురుపుర |
| 44 | 95 | నాయాసమునను | నాయాసమునకు |
| 52 | 4 | గావించినప్రాణంబు | గావించినఁబ్రాణంబు |
| | | గాంచెయమ్మన్న | గాంచెనమ్మన్న |
| 58 | 28 | కూఁతురగాంళి | కూఁతురఁగాంచి |

| పుట. | పద్యసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 62 | 50 | హుతభుక్శిఖా | హుతభుక్శిఖా |
| 63 | 52 | తోడుతేఱం | తోడితేఱం |
| | | తల్లంయగుట | తలియగుట |
| 64 | 53 | పాడుపోళ్ల | పాడుప్రోళ్ల |
| 65 | 58 | నింపు | యింపు |
| 69 | 74 | సంబంధయోగ్యం డేని | సంబంధయోగ్యందుగాఁ(డేని |
| 71 | 83 | యథాపూర్వంబు | యథాపూర్వంబు |
| 73 | 93 | వేఁకువ | వేకువ |
| 79 | 122 | మడిఁగి | (పా)మండి |
| 80 | 127 | నీరలికిన | నీరొలికిన |
| 94 | 32 | విరిగిన | విఱిగిన |
| 95 | 36 | హృదయుండవై | హృదయుండనై |
| 98 | 47 | పరివాఁతుండై | పరివారయుతుండై |
| 99 | 52 | సంసారము | సంచారము |
| 100 | 57 | విభూతమై | విధూతమై |
| 104 | 82 | నెన్ని | యెన్ని |
| | 82 | సమకట్టి | (పా)పగబట్టి |
| 106 | 90 | ప్రసంగంబు | ప్రసంగంబగు |
| 107 | 93 | జూపఁగ | జోపఁగ |
| 108 | 101 | కనురూపంబు | కనురూపంబగురూపంబు. |
| 111 | 117 | వినరవాయి | వినియరవాయి |
| 112 | 119 | గూడఁబూఱి | గూడఁబాఱి |
| | 120 | మహేశ్వరులు | మహీశ్వరులు |
| 117 | 12 | నొండక | నొండొక |
| 119 | 20 | నారూఢిగ౯ | యారూఢిగ౯ |
| 120 | 27 | యేనుమీరు | యేనుమీఱు |
| 121 | 33 | వత్తుమనవుడు | వత్తమనవుడు |
| 123 | 39 | జైనపల్లె | జైనపల్లి |
| | | మ్రాని క్రేవ | మావి క్రేవ |
| | 40 | మొరలు | మొదలు |
| 124 | 43 | పసుపాలితుండును | పసుపాలుండును. |

| పుట. | పద్యసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 125 | 49 | శుభగపతాక | సుభగపతాక |
| | 50 | ంగోమణి | గోమణి |
| | 52 | గుంజెనీయులు | గుంజెనీలు |
| 126 | 58 | స్ఫురితోలాసములు | స్ఫురితోల్లాసములు |
| 127 | 61 | కడుపుల్లారట | కుడుపుల్లారట |
| 128 | 64 | యరుదైన | యనువైన |
| 130 | 71 | పొందులుంగోసలు | గొందులుంగోసలు |
| 134 | 95 | శరిరగత | శరీరగత |
| 136 | 106 | మణిమండలము | మణిమండనము |
| 137 | 115 | నూనంబకి | న్యూనంబకి |
| 144 | 6 | ంగాలింబుచ్చెదు | గాలింబుచ్చెదు |
| 148 | 32 | వృత్తప్రకారంబు నాచరించు | నృత్తప్రకారంబు నాచరించుచు |
| 149 | 40 | కాంతయొకింగి | కొంతయొకింగి |
| 150 | 43 | బోండిగ | బాడిగ |
| 151 | 44 | నెత్తురువు | నెత్తురుపు |
| 154 | 66 | వైరముగాని | వేరముగాని |
| 160 | 95 | రింతవట్లోటింగి | రింతవట్లోటేంగి |
| | 96 | మాటిడంగా | మాంటిడంగా |
| 169 | 132 | గన్నంపు | గన్నపు |
| 171 | 137 | వెలయుచు | మలయుచు |
| 174 | 156 | మొదులు | మొదలు |
| 178 | 170 | లఘించిన | లంఘించిన |
| | 172 | నధరికృత | నధరీకృత |
| 183 | 3 | జీరవస్త్రం | జీర్ణవస్త్రం |
| 193 | 60 | కనురెప్ప యిట్టుచిత్రపు | కనుఱెప్ప యిట్టిచిత్రపు |
| 194 | 63 | నేర్పడనాడిరొ | యేర్పడనాడితో |
| 195 | 71 | మోంక | మోక |
| 196 | 76 | మదతాపము | మదనతాపము |
| 199 | 95 | నమరనరి | నమరనది |

| పుట. | పద్యసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 201 | 103 | ముసుంగుతెల్ల | ముసుఁగుసెల్ల |
| 205 | 120 | చంపనాగురు | చందనాగరు |
| 207 | 132 | వచ్చినిచ్చిన | నిచ్చెనిచ్చిన |
| | | నిచ్చెఁగొని | నిచ్చెపంగొని |
| 215 | 9 | బూచి | బూన్చి |
| | | సిరికి | సిఱికి |
| 232 | 91 | సరోజనేత్రి | సరోజనేత్ర |
| 234 | 5 | మూయనెడ | మూయునెడ |
| 239 | 31 | భీరంబునుఁ | భీరంబును |
| 248 | 77 | మదీయాంశంబు | మదీయాంసంబు |
| 257 | 36 | పకున్నమైగ | పకునట్టుగ |
| 262 | 62 | పోవనవసరంబున | పోవునవసరంబున |
| | 67 | పేకిన | పేఱిన |
| 263 | 67 | రాక్షసుండీరము | రాక్షసుండీఱము |
| 264 | 78 | అజాదిగోమహిష | అజావిగోమహిష |
| 266 | 90 | పంగించిన | భంగించిన |
| 281 | 170 | మోల | మ్రోల |
| 284 | 189 | కాంతుండాప్రలు | కాంతుండాప్తులు |
| 294 | 52 | బావభవున | భావభవున |
| 312 | 136 | భయంబెడ్డ | భయంబెద్ద |
| 314 | 6 | నరులు | మరులు |
| 316 | 11 | సారమాసంబు | సారమాంసంబు |
| | | కార్చిచ్చున | కార్చిచ్చునంగాల్చియిచ్చి |
| 317 | 17 | దలము | దలయు |
| | 20 | పూనియుక్కి | పూనియున్కి |
| 324 | 52 | కూటవమూఁక | కూటువమూఁక |
| | 54 | కొండవెన్నెల | (పా)కానవెన్నెల |
| | 55 | స్మితప్రదన | స్మితోల్లసిత |
| 326 | 63 | దుర్నిరీక్ష్య | దుర్నిరీక్ష |
| 276 | 67 | కాహాళ | కాహళంబు |

# ఆంధ్ర గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చ తెనుఁగు రామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అనంతుని ఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము | ... | 0 | 8 |
| అప్పకవీయము, నూతనముద్రితము | ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, సటీక | ... | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్ర భాగవతము | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి 2 సంపుటములు | ... | 8 | 0 |
| ఆంధ్ర భారతము, 7 సంపుటముల ప్రతి | ... | 15 | 12 |
| డిటో 3 సంపుటముల ప్రతి | ... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములు | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీ పర్వములు | ... | 2 | 4 |
| శాంతిపర్వము | ... | 2 | 4 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 4 | 4 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| శాంతిసప్తకము ,, | ... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము | ... | 0 | 8 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహమువగైరా | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము | ... | 2 | 4 |
| ఉత్తరహరివంశము | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము | ... | 1 | 8 |
| కళాపూర్ణోదయము | ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో ఘట్టుప్రభుకృతము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 10 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు | ... | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 1 | 10 |
| చెన్నబసవపురాణము | ... | 1 | 2 |
| జైమినిభారతము | ... | 1 | 0 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 1 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| తెనుఁగుసమస్యలు ... | 0 | 2 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక ... | 0 | 8 |
| నలచరిత్ర, ద్విపద ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 4 |
| నృసింహపురాణము ... | 0 | 12 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 0 | 12 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |
| పారిజాతాపహరణము ... | 0 | 4 |
| డిటో మేలుకాకితములు, చిన్నసైజు ... | 0 | 8 |
| బ్రహ్మోత్తరఖండము ... | 1 | 0 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, క్రొత్తకూర్పు ... | 4 | 0 |
| భోగినీదండకము ... | 0 | 1 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితముల మీఁద స్ఫుటమైనఅక్షరములతో చక్కగముద్రించి యున్నారము. ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| మూన్నాళ్లముచ్చట ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| మొల్లరామాయణము, చిన్నసైజు | ... | 0 | 10 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 3 | 8 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 8 |
| ,, కాలికోబైండు | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 2 | 4 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| ,, కాలికోబైండు | ... | 0 | 14 |
| రామరాజీయము, చక్కనిప్రతి | ... | 0 | 12 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | ... | 0 | 8 |
| ,, కాలికోబైండు | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | ... | 0 | 8 |
| ,, కాలికోబైండు | ... | 0 | 14 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 10 |
| ,, కాలికోబైండు | ... | 0 | 14 |
| రూపలి; రాజపుత్ర స్త్రీ సాహసపుకథ శ్రీ వెనమంద్ర నారాయణమూర్తిగారిది | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక | | 1 | 4 |
| వసుచరిత్ర విమర్శనము | ... | 1 | 0 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

